# రావి-ఎన్-అవధాని

## సాహితీ స్వర్ణోత్సవ
## కథా సంపుటి






శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-59/1/7. చిక్కడపల్లి
హైద్రాబాద్ - 500 020
ఫోన్ : 6621230

**RAVI-N-AVADHANI SAHITI SWARNOTSAVA KATHA SAMPUTI**
(Short stories compilation)
By
**RAVI-N-AVADHANI**



*First Edition*
**January 2002**

*Cover Design*
**BALI**

*Price :* **60/-**

*Copies can be had from*
All Branches of **Visalandhra** Publishing House
**Navodaya** Book Distributors
**Navayuga** Book House, Koti, Hyd.
**Book links,** YMCA, Narayanaguda

*DTP :*
**MANU GRAPHICS**
1031, Chikkadpally
Hyderabad - 20

*Printed at*
OMSREE GRAPHICS
Kavadiguda
Hyderabad
✆ : 7530019

# కథాక్రమం

# నానూ సదూకుంతాను

ఈ పొద్దు నీకేటైందే? పెందిల లెగిసిన కాడ్నుంసీ ఒటే నస ఎడతన్నావ్! ఎట్టిందేదో కతికి ఎల్లక! తోటోల్లంతా సల్దిదిని బుట్ట సంకనిడుకుని బయలెల్తన్నారు? అవుపడ్నేదేటి? బేగి తెవలకబోతే ఆల్లెనక నువ్వు దిగబడి పోతావు!" అని కూతురు పోచమ్మని హెచ్చరించింది కొండమ్మ.

"నా నెల్లనని సేప్పేనా! ఎల్లనుగాక ఎల్లను! నానూ సదూకుంతాను!" అంది పోచమ్మ మెండిగా.

"అదోటే తక్కువైనాదే మన బతుక్కి! యిసిగించక బేగి బయలెల్లు! నాను పొయ్యిలోకి కంపదే బోతన్నా!" అని గంఢ్ర గొడ్డలి తాడు తీసుకుంది కొండమ్మ.

"దినమూ జొన్న సకంటే నేటి? నేదినను! నాకు వొరన్నం ఎట్టు!" అంది పోచమ్మ.

కూతురు పేచీలకు నివ్వెరపోయింది కొండమ్మ. కోపంతో రెండు దెబ్బలు వేయాలనుకుంది. కాని తల్లిమనసు తమాయింప జేసి మారు సమాధానమియ్యకుండా గుడిసెలోంచి బైటకు వెళ్ళింది.

దుమ్మలగూడెం పట్టణానికి పాతికమైళ్ళ దూరంలో కొండల నడుమనుంది. కొండల చుట్టూ దట్టమైన అడవి. గూడెం మొత్తం పాతిక గుడిసెలుంటాయి. జనాభా 70 మంది. గూడెం చేరుకోవాలంటే అడవి గుండా డొంకలంటా 20 మైళ్ళు నడవాలి. ఏ విధమైన నాగరికతకూ నోచుకోని మారుమూల ప్రాంతం అది.

కొండమ్మ కిద్దరు పిల్లలు. కొడుకు సింగన్న, కూతురు పోచమ్మ. కొండమ్మ భర్త దేవయ్య మూడేళ్ళ క్రితం పోయేడు. అడవిలోనూ, కొండకోనలలో లభ్యమయ్యే, కరక్కాయలు, షీకాయి, ఇంగువ పిక్కలు, నల్లజీడిగింజలు, విప్పపువ్వు, పట్టుతేనె,



వంటి సరుకులు సేకరించి ప్రతివారం వారి గూడెంకి 10 మైళ్ళ దూరంలో జరిగే సంతలో వాటిని గూడెం ప్రజలు వస్తు మార్పిడికిచ్చి వారికి కావలసిన జొన్నలు, చోళ్ళు, కొర్రలు, పప్పు, ఉప్పు,నూనె వంటి సరుకులు తెచ్చుకుంటారు.

తాము వస్తుమార్పిడికిచ్చే సరుకుల విలువ కాని తాము తెచ్చుకుంటున్న వస్తువుల ధరలు కాని ఏ మాత్రం తెలియని అమాయకులు.

కొండమ్మ భర్త దేవయ్య పట్టుతేనె సేకరించటంలో దిట్ట. ప్రతిదినం ఒకటి రెండు పట్టులు తెచ్చేవాడు. వారం సంతలో వాటికి వస్తుమార్పిడికి సరుకులు తెచ్చేవాడు. అంతేకాదు పదిహేను మైళ్ళ దూరంలో వున్న ఆయుర్వేద వైద్యుడికి స్వచ్ఛమైన పట్టుతేనె అడపాదడపా అందిస్తే అతగాడిచ్చే పాత బట్టలు తెచ్చేవాడు దేవయ్య.

దేవయ్య చనిపోయిన తరువాత కొండమ్మ పరిస్థితి దిగజారిపోయింది. ఆమె కొడుకు సంగన్నని ఆయుర్వేద వైద్యుడు తీసుకొని పోయి పట్నంలో గిరిజన హాస్టల్లో చేర్పించాడు. దాంతో కొండమ్మ, పోచమ్మల జీవనం పూర్తిగావారి రెక్కల కష్టంమీదనే ఆధారపడింది.

పోచమ్మ చురుకైన పిల్ల. వయస్సు పన్నెండు ఏళ్ళు జబరుగా, పుష్టిగా వయస్సుని మించిన దానిలా వుంటుంది. ఉదయం ఏదో యింతతిని ఆమె యీడు వారైన మరో నలుగురితో కలిసి కొండలంట పోయి రకరకాల వస్తువులు సేకరించి తెస్తుంది.

తల్లి వెళ్ళినవైపు పోచమ్మ కాస్సేపు విసవిసా చూసి దాకలో జొన్న సంకటి తిని, పెణకలో వున్న కర్ర దువ్వెనతో తల గబాగబా దువ్వుకొని వేలు ముడి వేసుకుంది. బుట్ట చంకన పెట్టుకొని తడిక దగ్గరగా లాగి తాడుతో కట్టేసరికి ఆమె తోటి వాళ్ళు గంగమ్మ, సన్నమ్మ, పుట్టమ్మ, మున్నమ్మ వచ్చేరు. వాళ్ళతో కొండవైపు పరుగుపెట్టింది.

“కొత్త మాసకి సంగన్న వొత్తాడేటేపోచీ?” అంది సన్నమ్మ.

“నాకు తెల్దు! పోయడుగు!” అందిపోచమ్మ విసురుగా.

“ఏటోలమ్మ! అంత యిసురుబాటు!”

“సంగన్న నిన్ను మనువాడతాడేటే సన్నీ?” అంది మున్నమ్మ.

“సీ! సీ! పోవే! ఆడు పట్నంలో దొరబిడ్డనాగ సదూకుంతున్నాడా! అచ్చరం ముక్కరాన్దాన్ని ఆడెందుకు మనువాడతడు?” అంది గంగమ్మ నవ్వుతూ.

“ఏటేటీ! నా కచ్చరాల్రావా! పుంజిడు అచ్చరాలొచ్చు పోయింతూరి ఆడొచ్చి నేర్పినాడు!” రోషంగా అని “సూడండి- అ.ఆ.ఇ.ఈ” కర్రపుల్లతో నేలమీద రాసి చదివింది సన్నమ్మ.

పోచమ్మ తప్ప మిగిలిన ముగ్గురూ నివ్వెరపోయి సన్నమ్మ చుట్టూచేరి “మాకూ నేర్పియవా” అన్నారు.

పోచమ్మ వాళ్ళ కబుర్లు వింటూ నేల రాలిన కరక్కాయలు ఏరి బుట్టలో వేస్తోంది.

సంగన్న పట్నంలో హాస్టల్లో చేరి చదువుకుంటున్న గత మూడేళ్ళల్లోనూ ముమ్మారు గూడేనికి వచ్చి తల్లి, చెల్లిని చూసి వెళ్ళేడు. వేషభాషలు మారి అచ్చం

దొరబిడ్డలా వున్న సంగన్నకు వాడు వచ్చినప్పుడల్లా బ్రహ్మరథం పట్టేరు గూడెం ప్రజలు.

వాడి చదువు, పట్నం వింతలు, విశేషాలు వివరంగా చెప్పేడు వాడు. చెప్పే విషయాలన్నీ ఎంతో కుతూహలంతో విన్నారు గూడెం వాసులు. హాస్టల్లో వాడికి "ఉదయం టిఫెన్, టీ, సాయంత్రం టీ, రెండుపూటలా భోజనంలో వరి అన్నం, పప్పూ, కూర, పులుసూ, మజ్జిగ పెడతారని, స్నానానికి బట్టలకూ సబ్బులూ, కట్టుకోడానికి నాలుగుజతల బట్టలు, బూట్లు, చదువుకునేందుకు పుస్తకాలు, పెన్నులు, పెన్సిలు, రాత్రి పడుక్కునేందుకు పక్కబట్టలూ యిస్తారని" చెప్పేడు. ఆడవాళ్ళకు వేరే హాస్టలు ఉందని చెప్పేడు. సినిమాలు, టీవీలూ, రేడియోల గురించి చెప్పేడు.

వాడి కబుర్లకి ఎక్కువగా ప్రభావితులైన వాళ్ళు - వాడిచెల్లెలు పోచమ్మ, వాడినేస్తం సన్నమ్మ.

"చదువు మాటెలాగున్నా హాస్టల్లో చేరితే రెండు పూటలా కడుపు నిండా వరి అన్నం తినొచ్చని, వంటినిండా బట్టకట్టొచ్చని" అనుకుంది పోచమ్మ.

చదువుకోకపోతే సంగన్న తనను మానువాడడు. అందుకోసం తను చదువుకొని తీరాలను"కుంది సన్నమ్మ.

"నానూ సదూకుంతాను!" అని పేచీపెట్టి పలుమార్లు తన్నులు తిన్నారు వాళ్లు.

అయినా వారు తమ పట్టుదల, సంకల్పం విడనాడలేదు. ఒకరోజు కూడపలుక్కుని గూడెం ప్రజలంతా సంతకి వెళ్ళిన సమయంలో ఎవరికీ చెప్పకుండా యిద్దరూపట్టణానికి బయల్దేరారు. అడ్డదారిన కొండలూ, అడవీ దాటి వారు రోడ్డు చేరుకునే సరికి అక్కడ ఒక లారీ ఆగివుంది. అందులోఆడా, మొగా, చిన్నా, పెద్దా అంతా కలిసి పాతికమంది వరకూ వున్నారు.

"ఏటా పెల్లి నడకలు! బేగి పాత్రండి!" అని వారు లారీ వద్దకు వచ్చేసరికి లారీ వెనుక నిల్చుని బీడీ కాలుస్తున్న మీసాల మేస్త్రీ యిద్దర్నీ అమాంతంగా ఎత్తి లారీ బాడీలో పడవేసి "రైట్! రైట్!" అని వాడూ అందులోకి ఎక్కేడు.లారీ ఒక జర్క్‌తో ముందుకు కదిలింది.

అంతవరకూ ఏ వాహనం చూడని సన్నమ్మా, పోచమ్మా నిలదొక్కుకోలేక పలుమార్లు ప్రక్కవారి మీద పడ్డారు. వారికి ఏం జరుగుతోందో అర్థం కాలేదు. వారు ఆశ్చర్యంలోంచి తేరుకొనక మునుపే లారీ ఓ అరగంట ప్రయాణంచేసి ఆగింది.

అక్కడ తారు రోడ్డు వేస్తున్నారు. అందుకు కూలీల్ని చుట్టుప్రక్కల గ్రామాల నుండి తీసుకురావడం మీసాల మేస్త్రీ డ్యూటీ.

"బేగి తట్టా పారా పట్టుకొని పని మొదలెట్టండి! యీ పొద్దు నేటైపోనాది! పెద్దాయన సూసేడంటే సిందులేత్తాడు" అని వారిని గదమాయించి పని మొదలు పెట్టించేడు. సాయంత్రం వరకూ వీరిద్దరి చేతా పని చేయించి వాళ్ళ చేతిలో రెండేసి రూపాయల నాణేలు పెట్టి పొమ్మన్నాడు.

అక్కడికి పట్నంఎంత దూరం వుందో, ఎటు వెళ్ళాలో తోటి పనివారిని అడిగి తెల్సుకున్నారు. అయితే ఆ రోడ్డుకు తూర్పు వైపూ, పడమటి వైపూ కూడా పట్టణాలున్నాయని విన్నారు. ఎటు వెళ్ళాలో, సంగన్న ఏ పట్టణం లో వున్నాడో తెలియక తికమక పడ్డారు. చివరకు వారు తెగించి తూర్పువేపున ఉన్న పట్నం వైపు నడక ప్రారంభించేరు.

వారు పట్నం చేరుకునే సరికి రాత్రి 8 గంటలైంది. ఎత్తైన భవనాలూ, విద్యుద్దీపాలూ, వచ్చేపోయే రకరకాల వాహనాలూ చూసి సంభ్రమాశ్చర్యాలు చెందేరు. వారికి ఎటు వెళ్ళాలో, ఏం చెయ్యాలో తెలియలేదు. కడుపులో ఆకలి, ఎదరగా ఉన్న టీ బడ్డీవేపు వెళ్ళేరు. పలు రకాల తినుబండారాలు పళ్ళేలలో పేర్చబడి వున్నాయి.

వీళ్ళు టీ బడ్డీ దగ్గర నిల్చునే సరికి "ఏం గావాల!" అని గద్దించేడు ఓనరు.

పోచమ్మ పకోడీల వేపుచేయి చూపించింది.

"పైసల్దీయి!" అన్నాడు.

పోచమ్మ కాసేపు తటపటాయించి చిక్కంలో వున్న రెండు రూపాయల బిళ్ళ తీసి యిచ్చింది.

మూరెడు పొడుగు కాగితపు పొట్లంలో మూడు పకోడీ ముక్కలు నైస్‌గా చుట్టి పోచమ్మ చేతిలో పెట్టి పొమ్మన్నాడు.

వారు అవి తీసుకుని కొంచెం దూరం వెళ్ళి ఒక యింటి అరుగుమీద కూర్చుని వాటిని తిని అక్కడే కాళీ జాగాలో నిద్రపోయేరు.

ఉదయం లేచి పట్నం వింతలు చూస్తూ ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి వారికి అక్కడ యూనీఫామ్స్ వేసుకొని, స్కూల్‌బేగ్స్ పట్టుకొని వెళ్తున్న పిల్లలు చాలామంది

కనిపించేరు. దాంతో వారికి ఎక్కడలేని ఆనందం కల్గింది. కొండంత ధైర్యం వచ్చింది.

"సదూల బడి అవుపడింది! ఎంటనే సేరి పోవాల!" అని పిల్లల వెనుక వారూ లోనికి వెళ్ళబోయేరు. గేటువద్ద వాచ్‌మేన్ అటకాయించేడు వారిద్దరినీ.

"మాఁవూ సదూకుంతావు!" అన్నారు.

వాచ్‌మేన్ తుళ్ళకసిరి వారిని రోడ్డు మీదకు నెట్టేడు.

వారికి ఏం చెయ్యాలో తోచక దిక్కులు చూస్తూ నిల్చున్నారు. ఉదయం నుండీ వారి వెంట ఒక వ్యక్తి ఫాలో అయి వారి చర్యలు గమనిస్తున్నాడు.

"సదూకుంది కొచ్చేరేటి? మందేవూరు?" అని ఎంతో ఆప్యాయంగా పలకరించి వారి వివరాలు సేకరించాడు.

"రండి మిమ్మల్ని ఆడాళ్ళ సదూల బడిలో సేరిపిత్తాను!" అన్నాడు.

వారిద్దరూ సంతోషంగా గొర్రెపిల్లల్లా వాడి వెంటవెళ్ళేరు.

వాడు వారిని ఒక రేకుల షెడ్‌లోకి తీసుకొని వెళ్లి వారు తినడానికి పూరీలు, టీ తెచ్చి యిచ్చేడు. వారు అవి తిని టీ త్రాగేంతలో మరొక వ్యక్తి వచ్చేడు. యిద్దరూ చాలాసేపు బేరసారాలు సాగించేరు. డబ్బు చేతులు మారింది.

నిత్యం కొండల్లోనూ, అడవుల్లోనూ సంచరించే గిరిజనులకు క్రూరమృగాల బారినుండీ సమయస్ఫూర్తితో తమ ప్రాణాలను ఏ విధంగా కాపాడుకోవాలో వారికి తెలుసు.

పోచమ్మ, సన్నమ్మ వారిరువురి చర్యలూ గమనించి చిక్కంలో వున్న వనమూలికల ముక్కలు నోట్లో వేసుకొని నమిలేరు. యింతలో ఆ యిద్దరు వ్యక్తులూ వారిని సమీపించి పట్టుకోబోయేరు. అంతే! పోచమ్మ, సన్నమ్మ ఆ యిద్దరు వ్యక్తుల కళ్ళల్లోకీ తమ నోటితో చిమ్మిన వనమూలిక పసరు ప్రభావంతో వారి చూపు తాత్కాలికంగా పోయింది. వారి కళ్ళు ఒకటే మంట!

"కళ్ళు మంట! బాబోయ్! ఏం కనిపించటంలేదు" అని బిగ్గరగా అరుస్తూ చిందులేయసాగేరు.

పోచమ్మ సన్నమ్మలు రేకుల షెడ్‌లోంచి రోడ్డుమీదకు పరుగుపరుగున రావడం

అటుగా జీప్‌లో వస్తున్న సి.ఐ కరుణాకర్ కంట పడింది. వెంటనే జీప్ ఆపించి జరిగింది వారిని అడిగి తెల్సుకొని రేకుల షెడ్‌లో చిందులు వేస్తున్న యిద్దరు వ్యక్తుల్ని సంకెళ్ళు బిగించి యీడ్చుకొచ్చేడు.

"వీళ్ళిద్దరూ గజదొంగలు! ఎన్నో దోపిడీలతోనూ, దొంగతనాలతోనూ వీరికి సంబంధముంది. ఆడపిల్లల్ని యితర రాష్ట్రాలకు తరలిస్తుంటారు. ఎన్నాళ్ళనుండో వీరి కోసం గాలిస్తున్నాం. మీ వల్ల వీళ్ళు పట్టుబడ్డారు. మీకు మంచి బహుమానం యిప్పిస్తాను!" అన్నాడు కరుణాకర్.

అతను చెప్పిందేమిటో పోచమ్మ, సన్నమ్మలకు అర్థం కాలేదు. దిగులుతో దిక్కులు చూస్తూ నిల్చున్నారు.

'మీకేం భయం లేదు! ఏం కావాలో చెప్పండి. ఆకలి వేస్తోందా? అన్నం తింటారా?' అన్నాడు కరుణాకర్ ఆప్యాయంగా.

"అన్నం" అన్నమాట వినగానే వారి కళ్ళు తళుక్కున మెరవడం గమనించి వారిని తన యింటికి తీసుకొని వెళ్ళి అన్నం పెట్టించేడు.

కోరుకున్న వరి అన్నం కంటపడగానే పోచమ్మ ఆనందానికి అంతులేదు. ఇద్దరూ కడుపునిండా తిన్నారు.

వారు భోజనం చేసి కాస్త స్థిమిత పడ్డ తరువాత కరుణాకర్ నిదానంగా వారి వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. వారిది క్షణిక ఆవేశమా! లేక నిజంగా వారికి చదువు కోవాలనే కోరిక వుందా? అన్న విషయం తెలుసుకోవాలనుకుని-

"చూడండి! మీరు మీ వాళ్ళకు చెప్పకుండా వచ్చేసేరు! వారుమీ గురించి బెంగ పెట్టుకుంటారు. అందుచేత మిమ్మల్ని గూడెంకి దిగబెట్టిస్తాను! యింటికి వెళ్ళిపోతారా?" అన్నాడు.

"ఎల్లవండి! మాం సదూకుంతాం!" అన్నారు వారు ఎంతో నమ్మకంగా.

చదువుమీద వారికి గల ఆసక్తికి, పట్టుదలకూ కరుణాకర్ మెచ్చుకొని వారికి అవసరమైన దుస్తులు, సామగ్రి కొని యిచ్చి వారిని స్వయంగా తీసుకొని వెళ్ళి సంక్షేమ హాస్టల్‌లో జాయిన్‌చేసేడు.

('ఆంధ్రప్రదేశ్' జూన్, 2000) ✪

# కాకి బంగారం

"**నా**న్నమ్మ ఎప్పుడూ నన్ను ఎందుకు కోప్పడుతుంది డాడీ!" అన్నాడు అశోక్ ప్రోగ్రెస్ రిపోర్ట్ చూసి మెచ్చుకొన్న తండ్రితో.

"ఊరికనే ఎందుకు కోప్పడుతుంది! నువ్వేదో పాడుపని చేసివుంటావ్! అవునా?' ' అన్నాడు నరేంద్ర చిరునవ్వుతో.

"లేదు డాడీ! నేనే పాడుపనీ చెయ్యలేదు! నిజం! గాడ్ ప్రామిస్, కావాలంటే మమ్మీని అడుగు" అన్నాడు.

"అశోక్! నో కంప్లైంట్స్ అని చెప్పేనా! తమ్ముడు సోనీ చూడు! బుద్ధిగా చెప్పిన మాట వింటాడు. హార్లిక్స్ కలిపి డైనింగ్ టేబిల్‌మీద పెట్టేను వెళ్ళితాగు!" అంది ప్రశాంతి భర్తకు కాఫీ కప్పు అందిస్తూ.

నరేంద్ర భార్యవైపు ప్రశ్నార్థకంగా చూసేడు. అయితే ఆమె భర్తచూపు గమనించనట్లే మిన్నకుంది.

"అశోక్! నీ ప్రోగ్రెస్ రిపోర్ట్ మమ్మీకి చూపించేవా?" అన్నాడు.

"నాది తమ్ముడిది కూడ చూసింది మమ్మీ" అన్నాడు ఉత్సాహంగా.

"అదేంటోయ్! పుత్రరత్నాలు ఘనకార్యం సాధించుకొస్తే సంతోషించక ముఖం అలా పెట్టేవ్!" అన్నాడు నరేంద్ర భార్యను కవ్విస్తూ.

సోనీ హార్లిక్స్ గ్లాసు తెచ్చి అన్నకిచ్చేడు.

"గుడ్‌బోయ్!" అని చిన్నకొడుకుని దగ్గరకు తీసుకున్నాడు.

"అశోక్, సోనీ మీరిద్దరూ డ్రస్సు మార్చుకుని కాస్సేపు బయటకు వెళ్ళి



ఆడుకోండి!'' అని కాళీ కప్పూ, గ్లాసూ తీసుకుని కిచెన్‌వేపు వెళ్ళింది ప్రశాంతి.

భార్య వెళ్ళినవేపు చూసి నిట్టూర్పు విడిచేడు నరేంద్ర.

'ఆమెకున్న శాంతం, సహనం, ఓర్పు, నేర్పూ మరే స్త్రీకి వుండవేమో!' అనుకున్నాడు.

ప్రశాంతి స్టేట్‌బ్యాంక్‌లో ఆఫీసర్‌గా జాబ్ చేస్తోంది. నరేంద్ర యూనియన్ బ్యాంక్‌లో ఆఫీసరు.

ఉదయాన్నే టిఫెన్, వంటా చేసి పదిగంటలకు భర్త పిల్లలతో కలిసి భోజనం చేసి, టిఫెన్ బాక్సులు ఇచ్చి పిల్లల్ని స్కూల్‌కి పంపి భర్తతో కలిసి బేంక్‌కి వెళ్తుంది ప్రశాంతి. రెండు బేంక్‌లూ ఒకే స్ట్రీట్‌లో వున్నందున ఇద్దరూ స్కూటర్‌మీద వెళతారు. ఆమె అత్తగారు 12 గంటలకు భోజనం చేస్తారు. ఆవిడకు లంచ్ డైనింగ్ టేబిలు మీద వుంచుతుంది. సాయంత్రం ఐదుగంటలకు ఇంటికొస్తుంది. పిల్లలిద్దరూ 4 గంటలకే స్కూల్‌నుంచి వచ్చేస్తారు. ఇంటికి రాగానే ముందు హార్లిక్స్ కలిపి పిల్లలిద్దరికీ

ఇచ్చి తరువాత కాఫీ కలిపి అత్తగారికిచ్చి తనూ భర్తా తీసుకుంటారు. తరువాత రాత్రికి వంట ప్రయత్నం చేస్తుంది.

అశోక్ వయస్సు 6 సంవత్సరాలు. 3వ క్లాస్ చదువుతున్నాడు. సోనీ వయసున నాలుగు సంవత్సరాలు. ఒకటవ తరగతి చదువుతున్నాడు. ఇద్దరూ తెలివైనవాళ్ళే. చురుకైన పిల్లలే! అయితే అశోక్ కాస్త అమాయకుడు. సోనీ గడుసువాడు.

ప్రశాంతి వంటవగానే పిల్లలిద్దర్నీ కూర్చుండబెట్టి స్కూల్ హోంవర్క్ చేయించి చదివిస్తుంది. భర్తక్లబ్ నుండి వచ్చిన వెంటనే అందరూ కలిసి డిన్నర్ చేస్తారు.

ఏడాది క్రితం వరకూ ప్రశాంతి అత్తగారు పార్వతమ్మగారు కోడలికి వంటపని యింటిపనిలో ఎంతో హెల్ప్ చేసేవారు. మనవలు స్కూల్‌నుంచి రాగానే వారికి ఏదైనా టిపిన్ చేసి పెట్టడం, హార్లిక్స్ కలిపి ఇవ్వడం లాటి పనులు చేసేవారు. ఏడాది నుండి ఆవిడ యింట్లో ఏపనీ ముట్టుకోవడం మానివేసారు. ప్రతి చిన్న విషయానికీ కోడల్ని తప్పుపట్టడం మనవల్ని కసరడం వంటివి చేస్తున్నారు. అయితే కొడుకు ఎదుట ఆవిడ నోరు విప్పరు.

పార్వతమ్మగారి ప్రవర్తనలో అంతమార్పు రావడానికి కారణం ఆమె కూతురు సుమిత్ర. సుమిత్ర భర్త ముకుందరావు ఎల్.ఐ.సిలో జాబ్ చేస్తున్నాడు. ఏడాది క్రిందట ట్రాన్స్‌ఫరై ఆవూరు వచ్చేడు. పార్వతమ్మగారికి కూతురంటే వల్లమాలిన ప్రేమ.

"ఏంటమ్మా! నువ్వు మరీ అంత అమాయకంగా వుంటే ఎలాచెప్పు! ఈ వయస్సులో హాయిగా కాలుమీద కాలువేసుకుని కూర్చొని కోడలు చేత సేవలు చేయించుకోవాలి! అవిడగారేమో చక్కగా ముస్తాబై టింగురంగాలా ఆఫీసంటూబయట తిరిగొస్తుంటే నువ్వేమో ఆవిడగారికీ, అవిడగారి పిల్లలకీ చాకిరీ చెయ్యడం సిగ్గుగా లేదూ! ఇకనుంచీ నువ్వేపనీ పూనుకొని చెయ్యకు" అని తల్లికి పదే పదే సలహా ఇచ్చింది సుమిత్ర.

కూతురి సలహా చక్కగా అమలు పరిచేరు పార్వతమ్మగారు.

ప్రశాంతి అత్తగారు ఎన్ని అన్నా ఏమీ పట్టించుకోదు. ఆవిడ గురించి భర్తకు ఏనాడూ కంప్లైంట్ చెయ్యలేదు. అంతేకాదు పిల్లల్ని కూడ కంట్రోల్ చేసి ఏమీ చెప్పనివ్వదు.

పార్వతమ్మగారికి గులాబి మొక్కలంటే ఇష్టం. వంద రూపాయలిచ్చి నాలుగు

హైబ్రీడ్ గులాబి మొక్కలు- తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగు పువ్వులవికొని ఆగోలేలు పోర్టికోలో వుంచేరు.

సోనీ బర్త్‌డేకి ప్లాస్టిక్ బేటూ, రబ్బర్ బాల్ కొనిచ్చేడు నరేంద్ర. "వాటితో యింట్లో ఆడకూడదని, బయట లాన్‌లోనే ఆడుకోవాలి" అని ప్రశాంతి పిల్లలకి చెప్పింది. వారు బయట లాన్‌లో ఆడుకోబోతే బంతి పోర్టికోలో వున్న గులాబి మొక్కల గోలేలకు తగలవచ్చు. అందువల్ల అక్కడ ఆడవద్దని కట్టడి చేసారు. పార్వతమ్మగారు. దాంతో పిల్లలు బేటూ, బాల్ గదిలో బీర్వాక్రింద దాచివేసి మరి వాటిని ముట్టుకోలేదు.

అయితే ఆరోజు సాయంత్రం మొక్కలకు నీరు పోస్తూ పసుపు రంగు గులాబి మొక్కగోలెం చిట్లి వుండడం చూసేరు పార్వతమ్మగారు. దానిని పిల్లలే పగలకొట్టి వుంటారని వారు స్కూలునుంచి రాగానే కేకలేసి తిట్టి నానా హంగామా చేస్తున్నారు పార్వతమ్మగారు.

ప్రశాంతి యింటికి వచ్చేసరికి పిల్లలిద్దరూ ఆవిడ ఎదుట దోషులులా నిల్చుని వుండడం గమనించి విషయం తెల్సుకుని బట్టలైనా మార్చుకోకుండా వెంటనే బజారుకి వెళ్లి కొత్తగోలెం ఒకటి కొనితెచ్చి మొక్కను మార్చింది. పాతది గోలెం నాసిరకంది అవటంవల్ల నీటికి తడిసి అది విచ్చిపోయిన విషయం అత్తగారికి చూపించేవరకూ ఆవిడ శాంతించలేదు. పిల్లలే పగలగొట్టేరని ఆవిడ వాదన.

ఆడబడుచు సుమిత్రకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు రాకేష్ ఆరవక్లాస్ చదువుతున్నాడు. రెండోవాడు నరేష్ నాల్గవ తరగతి చదువుతున్నాడు.

పిల్లలిద్దరూ రణపెంకి. వాళ్ళకి ఏమాత్రం భయం భక్తిలేవు. వాళ్ల చదువులు అంతంత మాత్రంగానే వున్నాయి. తల్లితండ్రీ వాళ్ల చదువు విషయం ఏమాత్రం పట్టించుకోరు.

రెండు మూడు రోజులకోమారు సుమిత్ర పిల్లల్ని వెంటేసుకుని తల్లి దగ్గరకు వస్తుంది. వాళ్లకి టిఫిన్, భోజనం ప్రశాంతి చేసిపెట్టాలి. పిల్లలు బూట్లకాళ్లతో సోఫాలూ, కుర్చీలూ, పరుపులూ, కార్పెట్ తొక్కి పాడుచేస్తుంటారు. అంతేకాదు అశోక్, సోనీల ఆటవస్తువులూ పెన్నులూ, పెన్సిళ్లూ విరగగొట్టి ఆనందిస్తుంటారు. వారిని గిచ్చడం, కొట్టడం వంటి పనులు చేస్తున్నా అటు పార్వతమ్మకాని ఇటు సుమిత్రకాని వాళ్లని వారించి మందలించరు.

పిల్లలకోసం కోడలు యింట్లో చేసివుంచిన వంటకాలు వెంటనే కూతురు

పిల్లల్ని పిలిచి వాటినన్నిటినీ పంచేస్తుంది పార్వతమ్మ. అంతేకాదు, వాళ్లు యింటికి వచ్చేసరికి-ఇంట్లోని పాలు, హార్లిక్స్ కలిపి వాళ్లకి బలవంతంగా త్రాగిస్తుంది. ప్రశాంతి చాలామార్లు ఆఫీసు నుంచి వచ్చి పిల్లలకు ఇవ్వడానికి పాలులేక బూత్‌కి వెళ్లి పాలపేకెట్స్ తెచ్చుకోవలసి వచ్చేది.

కోడలికి చెప్పకుండా యింట్లో ఉండే గ్యాస్ స్పేర్ సిలెండర్‌ని కూతురికిచ్చి దానిప్లేస్‌లో ఖాళీ సిలెండర్ పెట్టేసి.... కోడలికి చెప్పేదికాదు పార్వతమ్మ.

వంటపనికి, ఇంటిపనికీ మనిషిని పెట్టుకుంటే ఆ పనిమనిషితో పోట్లాడి కావాలని దానిని పనినుంచి తీసేసేది పార్వతమ్మ. దాంతో పనిమనిషిని పెట్టుకోవడమే మానుకుంది ప్రశాంతి.

సుమిత్ర పిల్లలు అడగ్గానే వాళ్లకి ఆడుకునేందుకు క్రికెట్ బేటూ, బాలు కొనిచ్చింది పార్వతమ్మ. వాళ్లు వాటితో డ్రాయింగ్ రూమ్‌లో ఆడుతున్నారు.

తల్లీకూతురూ సోఫాలో కూర్చుని హాయిగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

“బాబూ! క్రికెట్ యింట్లో ఆడకూడదు! బయట లాన్‌లో ఆడుకోవాలి! లేకుంటే బాల్ టీ.వీకికాని, మనుషులకుగాని తగుల్తుంది” అంది ప్రశాంతి సౌమ్యంగా, ఆఫీసుకు బయలుదేరుతూ.

“పిల్లలు ఎండలో ఎక్కడ ఆడతారు! వాళ్ళేం చిన్నపసిపాపలు కారు. వాళ్లకి జాగ్రత్త తెలుసు! కాస్సేపు ఆడుకున్నంత మాత్రాన ప్రమాదమేం జరిగిపోదు. నువ్వు వెళ్లు” అన్నది పార్వతమ్మ. తల్లి మాటలకి చిరునవ్వు నవ్వింది సుమిత్ర.

ప్రశాంతి యింకేమీ మాట్లాడకుండా చెప్పులు వేసుకుని బయటకు నడిచింది. భర్త తొలిరోజే కేంప్ వెళ్లడంవల్ల ఆటోలో ఆఫీసుకు వెళ్లింది. అంతకు అరగంట ముందే పిల్లలు కాన్వెంట్‌కి వెళ్లేరు.

సుమిత్ర కాస్సేపు కూర్చుని తల్లితో కబుర్లు చెప్పి ‘పనివుందని’ యింటికి వెళ్లిపోయింది.

“పిల్లలకి భోజనం పెట్టి తరువాత పంపిస్తా” అన్నది పార్వతమ్మ కూతురితో-

వాళ్లు క్రికెట్ ఆటకోసం స్కూల్ ఎగ్గొట్టేరు.

మనవల ఆటచూసి మురిసిపోతోంది పార్వతమ్మ.

చిన్నవాడు నరేష్ బలంగా కొట్టిన బంతి నేరుగా వెళ్లి పార్వతమ్మ కుడికంటికి తగిలింది.

ఆ దెబ్బకు ఆవిడ చావుకేక పెట్టి పడిపోయింది. నెత్తురు బొటబొట కారుతోంది. అంతే, పిల్లలిద్దరూ బేటూ బాలు అక్కడే పారేసి వాళ్లింటికి పరుగులంకించుకున్నారు.

పిల్లలిద్దరూ భోజనం చెయ్యకుండా వచ్చినందుకు వాళ్ళని తిట్టింది. అప్పుడు మళ్ళీ వాళ్ళకోసం వంట చెయ్యాలని విసుక్కుంది. 'తిండి పెట్టకుండా తరిమివేసిందని' తల్లిని నిందించింది సుమిత్ర.

సాయంత్రం నాలుగు గంటలకు అశోక్, సోనీ, స్కూల్ నుంచి వచ్చేర్చు. అశోక్ నాయనమ్మ పరిస్థితి చూసేడు. తమ్ముడ్ని యింటి దగ్గర వుండమని, వెళ్లి ఆటోని పిల్చుకొని వచ్చేడు. ఆవిడను ఆటోడ్రైవర్ సహాయంతో హాస్పటల్‌కి తీసుకొనివెళ్లి అక్కడ నుండి తల్లికి ఫోన్‌చేసి చెప్పేడు.

ప్రశాంతి వెంటనే హాస్పటల్‌కి వచ్చి అత్తగారిని చూసింది.

"మేడమ్! మీ అబ్బాయి సకాలంలో ఈవిడను హాస్పటల్‌కి తీసుకొచ్చేడు కనుక సరిపోయింది. ఇంకా లేటయివుంటే కంట్లో క్లాటైన బ్లడ్‌వల్ల కన్నుపోయేది" అన్నాడు డాక్టర్, పార్వతమ్మగారి కంటికి కట్టుకడుతూ ప్రశాంతితో.

"అమ్మా ప్రశాంతీ! యిన్నాళ్లూ నాకళ్లకేదో పొరలు కమ్మి అసలు బంగారమేదో కాకిబంగారమేదో కానుకోలేకపోయినందుకు నన్ను క్షమించు!" అంటూ కళ్లు మూసుకునే గుణిసింది అత్తగారు పార్వతమ్మ-

('ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక', మే 2000) ✪

# చంద్రుడికో నూలుపోగు

సరోజకు తన అత్తగారు శాంతమ్మగారి మీద ఏమాత్రం గౌరవం లేదు. ఆడపడుచు రాధంటే అభిమానం లేదు. అందుకు కారణం వారు పల్లెటూరివారు కావడమే. పల్లె ప్రజలకు నాగరికత లేదని, సభ్య సమాజంలో ఎలా మసులుకోవాలో వారికి తెలియదని ఆమె అభిప్రాయం. గ్రామ ప్రజల శ్రేయస్సుకు ప్రభుత్వం వారు ఎన్నో ఉపాధి పథకాలు రూపొందించినా వారు వాటిని ఉపయోగించుకొనక లేజీగా కాలం గడిపేస్తారని ఆమె విశ్వాసం.

అంతేకాదు పల్లెప్రజల్లో కరడుకట్టుకొని వున్నంత కులమత పట్టింపులు మరెక్కడా లేవని, వారు ఎప్పుడూ ఒకర్నొకరు దూషించుకుంటూ ద్వేషించుకుంటూ పోట్లాడుకుంటారని, ఆస్తినష్టం ప్రాణనష్టం కల్గించుకుంటారని ఆమె నమ్మిక. రాజకీయాలకు పల్లెటూర్లు పట్టుకొమ్మలని ఆమె భావన.

సరోజ తన పదవ ఏట ఒకే ఒక పర్యాయం తల్లిదండ్రులతో కలసి పెళ్లికి పల్లెటూరు వెళ్ళింది. ఆ గ్రామంలో రెండు కులాల మధ్య పోట్లాట మొదలై యిళ్లు తగులబెట్టుకున్నారు. గ్రామంలో సగభాగం యిళ్లన్నీ అగ్నికి ఆహుతయ్యేయి. పెళ్లి ఆగిపోయింది. పెళ్లికి వచ్చినవారంతా ప్రాణభయంతో రాత్రికి రాత్రే ప్రయాణమై గ్రామం వదిలి వెళ్ళిపోయేరు. ఈ సంఘటన సరోజ మనస్సులో నాటుకుంది.

శివరామశాస్త్రిగారు వేదం, సంస్కృతం, పురాణేతిహాసాలు, షట్ఛాస్త్రాలు క్షుణంగా నేర్చుకొని ఎందరికో విద్యాదానం చేసిన మహాపండితులు. చుట్టుప్రక్కల పది గ్రామాల్లో అతనికెంతో గౌరవముంది. మంచి పలుకుబడి వుంది. అతని సలహాలేందే వారేపనీ చెయ్యరు.

శివరామశాస్త్రిగారు చెయ్యెత్తు మనిషి పచ్చని పసిమిఛాయ దేహం. ఆయన



వీధిలోంచి వెళ్తుంటే ప్రజలు భక్తిపూర్వకంగా వంగి రెండు చేతులు జోడిస్తారు. ఆయన దర్భాసనం మీద వ్యాసపీఠం ముందు కూర్చుంటే సాక్షాత్తూ పరమశివుడు కైలాసం నుండి దిగి వచ్చినట్లు భావిస్తారు.

శాంతమ్మగారు ఆయనకు అన్నివిధాలా తగిన యిల్లాలు. ఆమె బహుముఖశాస్త్ర పరిజ్ఞాన సంపన్నురాలు. చదువుల్లో భర్తకేమాత్రం తీసిపోదు. అయినా నిండుకుండ. ఆమె అంత పండితురాలని చెప్తేకాని ఎవరికీ తెలియదు. వారిరువురికీ సమాన గౌరవముంది.

ఆనంద్, రాధ వారి సంతానం. ఆనంద్ చిన్నతనంలో తండ్రి వద్ద వేదం, సంస్కృతం నేర్చుకొని పట్నంలో బి.ఎ పాసై విజయవాడలో గవర్నమెంట్ ఉద్యోగంలో వున్నాడు. అతని ఆఫీసరు కూతురు సరోజను పెళ్లి చేసుకున్నాడు. సరోజ ఒక ప్రైవేటు స్కూల్లో టీచరుగా జాబ్ చేస్తోంది. నెలకు రెండువేలు జీతం. సరోజకు పల్లెటూరి

మీద పల్లెప్రజలపైన వున్న దురభిప్రాయం తెల్సుకొని దానిని తొలగించాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు ఆనంద్.

శివరామశాస్త్రిగారు కొడుకు పెళ్లయిన ఏడాది లోపలే గుండెపోటు వల్ల మరణించేరు. తప్పని పరిస్థితుల్లో భర్త వెంట గ్రామం వచ్చింది సరోజ. మామగారు ఆస్తిపాస్తులేం సంపాదించలేదని గ్రహిచింది. వారికి ఆ గ్రామంలో నడివాకిలి గల నాలుగు గదుల పెంకుటిల్లు, శాంతమ్మగారికి కన్నవారిచ్చిన ఎకరం పొలం వున్నాయి. ఈరోజుల్లో డబ్బు సంపాదన లేకుండా పేరు ప్రఖ్యాతులు గడించినంతమాత్రాన కుటుంబ పోషణ జరగదని, మామగారు సంపాదించింది కేవలం పేరుప్రఖ్యాతులు మాత్రం కనుక యికముందు అత్తగారి పోషణభారం, రాధ పెళ్లి బాధ్యత తమ మీదే పడిందని ఎంతో విచారించి పదే పదే విసుక్కుంది. ఇతర వ్యాపకమేమీ లేకుండా ఎకరం పొలం మీద వచ్చే పంటతో మామగారు సంసారాన్ని ఎలా నెట్టుకొచ్చేరో అర్థం కాలేదు సరోజకు.

"డబ్బు సంపాదన కోసం కష్టపడక లేజీగా గడపడం పల్లెప్రజలకు అలవాటు అన్న తన అభిప్రాయం సరైనదేననుకుంది సరోజ.

"తాను పనిచేస్తున్నది ప్రైవేటు స్కూల్లో కనుక ఎక్కువ రోజులు లీవు యివ్వరు" అని పరామర్శకు వచ్చిన తల్లి తండ్రితో బయల్దేరి పట్నం వెళ్లిపోయింది సరోజ.

భార్య ప్రవర్తనకు ఎంతో నొచ్చుకున్నాడు ఆనంద్. మరో నాలుగు రోజులుండి పనులన్నీ పూర్తిచేసుకొని తల్లినీ చెల్లెల్ని తీసుకొని పట్నం వెళ్లేడు. భర్త వెంట వచ్చిన అత్తగారిని, ఆడపడుచుని చూసి ముఖం ముడుచుకుంది సరోజ. "పల్లెలో వున్న యిల్లూ, పొలం అమ్మి డబ్బు తీసుకొని వస్తే రాధకు పెళ్లి చెయ్యవచ్చు" అని సలహా ఇయిచ్చింది.

విశాలమైన యింట్లో స్వచ్ఛమైన గాలి, వెలుతు..., నీరూ వీటికి అలవాటు పడ్డమేగాక పల్లెలో ఎంతో స్వేచ్ఛగా జీవిస్తున్న శాంతమ్మగారు రాధ, యీ పట్నంలో పగలుకూడా లైటు వేసుకుంటేనే గాని వెలుతురురాని, ఫేను లేకుండా గాలి ఆడని అగ్గిపెట్టెల్లాంటి రెండు గదుల యింట్లో పంజరంలో బంధించిన పక్షుల్లా విలవిల లాడిపోయేరు. నీటిని కూడా పొదుపుగా వాడాల్సిన పరిస్థితికి చింతించేరు.

వీటికి తోడు సరోజ ముభావంగా వుండడమేగాక యిరుగు పొరుగు

యిళ్లవాళ్ళతో మాట్లాడకూడదని, వారి యిళ్లకు వెళ్ళకూడదని, వారిని తమ యిళ్లకు ఆహ్వానించకూడదని హెచ్చరించింది. 'అనవసరంగా ఫేన్లూ లైట్లూ వేసి కరెంట్ వృధా చెయ్యకూడదని' వార్నింగ్ యిచ్చింది.

భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్తులవడం వల్ల వారు ఉదయం తొమ్మిది గంటలకు భోజనం చేసి ఆనంద్ ఆఫీసుకి, సరోజ స్కూలుకి వెళ్లిపోయేవారు. అత్తగారిని రాధను తమతోటే భోజనం చెయ్యమని సరోజ వారిని బలవంతం చేసేది. పల్లెల్లో వారికి పన్నెండు గంటలకు భోజనం చెయ్యడం అలవాటు. ఉదయం తొమ్మిది గంటలకు భోజనం చెయ్యలేక ఎంతో యిబ్బంది పడ్డారు.

పట్నంలో ఆ వాతావరణంలో యిమడలేక వచ్చినవారం రోజులకే తమ గ్రామానికి తిరుగుప్రాయణమయ్యేరు శాంతమ్మగారు, రాధ. ఆనంద్ వారిని వుండమని బలవంతం చేసేడు. రెండు సంసారాలకు డబ్బు సర్దుబాటు చెయ్యలేమని నిర్మొహమాటంగా చెప్పింది సరోజ. అయినా వారుండలేదు. అలా వెళ్లినవాళ్లు మనవడి నామకరణానికి వచ్చి ఒక్కరోజుండి వెళ్లిపోయేరు.

మరోవసంతం గడిచింది.

కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యాల్సిన తమకు మాటమాత్రమైన చెప్పకుండా అత్తగారు రాధకు పెళ్లి నిశ్చయించడం సరోజకు నచ్చలేదు. అంతేకాకుండా పెళ్లికి ఏకంగా ముహూర్తం నిర్ణయించి పంచమీ బుధవారం నాడు పెళ్లి పనులు ప్రారంభిచడానికి మంచిదని, వెంటనే కోడల్ని మనవడు శివరాంని తీసుకొని రమ్మనమని రాయడం ఆమె ఎంతో ఫీలైంది.

"ఏమిటండీ! ఎటుపోయి ఎటొచ్చినా అందరూ మనల్నే కదా అంటారు. పెళ్లి విషయంలో నాలుగూ చూసుకోకుండా యింత తొందరేంటండీ" అని భర్తతో వాదించింది.

"పోనీలే సరోజా! నాన్నగారు పోయింతరువాత మనం అమ్మా, చెల్లాయి విషయాలేం పట్టించుకోలేకపోయాం. అయినా మనం యింతదూరంలో వున్నాం. ప్రతీ చిన్న విషయానికీ వెళ్లలేం కదా! పెళ్లికొడుకు తండ్రి అమ్మకు బాగా తెలుసునట. వాళ్లంతట వాళ్ళు ఏరికోరి వచ్చి చెల్లాయిని చూసి యిష్టపడి చేసుకుంటామన్నారుట.

కట్నకానుకలు వద్దన్నారుట. మరి అన్నీ బాగున్నట్లే కదా? ముఖ్యంగా కుర్రాడిది మంచి జాబ్, యింజనీరు!" అని భార్యకు నచ్చచెప్పబోయేడు ఆనంద్.

"కట్నకానుకలొద్దంటే సరా! వారి హోదాకు తగ్గలాంఛనాలు పెళ్లికి ఖర్చు అంతా వుంది కదా? నిల్చున్న పాళంగా మరి డబ్బెక్కడనుంచి వస్తుంది. పోనీ ఆ పొలం, యిల్లు తాకట్టు పెట్టడమో లేదా అమ్మివేయడమో చెయ్యండి. తాకట్టంటే వడ్డీ భరించాలి, అందుచేత సేల్ చెయ్యడమే మంచిది" అంది.

"ఉత్తరంలో డబ్బు సంగతి ఏమీ రాయకపోవడం ఆనంద్ కొద్దిగా బాధపడ్డాడు. బేంక్‌లోంచి ఐదువేలు డ్రాచేసి భార్య చేతికిచ్చి వారిని ముందుగా పంపేడు.

కోడల్నీ మనవడ్నీ ఎంతో ఆదరంగా రిసీవ్ చేసుకొన్నారు శాంతమ్మగారు, రాధ. ఆనంద్ ఎప్పుడు వస్తున్నాడో అడిగి తెలుసుకున్నారు.

పెళ్లికొడుకు తండ్రి చంద్రశేఖరం తన మామగారి వద్ద యిక్కడే వుండి సంస్కృతం చదువుకొని తరువాత ఎమ్.ఎ.పి.హెచ్‌డి చేసి ప్రస్తుతం విజయనగరం కాలేజీ ప్రిన్సిపాల్‌గా వున్నాడని, పెళ్ళికొడుకు మురళి వారి ఏకైక పుత్రుడని, అతను బి.యి పాసై విజయనగరంలోనే ఎలక్ట్రికల్ యింజనీరుగా జాబ్ చేస్తున్నాడని సరోజ తెల్సుకుంది.

అత్తగారు డబ్బు విషయమేమీ ప్రస్తావించకపోవడంతో తను ఐదువేలు తెచ్చిన విషయం అత్తగారికి చెప్పలేదు సరోజ.

మర్నాడు ఉదయం అత్తగారు చెప్పినట్లే స్నానంచేసి గణపతికి పూజ చేసి కొద్దిగా బియ్యం, ఒక రూపాయి పసుపుగుడ్డలో మూటకట్టి దేముడి పీఠంలో వుంచింది. అలా గణపతికి మీదుకట్టి పెళ్లిపనులు ప్రారంభించడం వాళ్ల ఆచారం.

"ఎవరూ! శివయ్య బుగతగోరే! నాయిరోలు దండాలెడతన్నా. రాధమ్మగోరి కల్లేనానికి లగ్గం ఎడతన్నారా!" అన్న మాటలకు శాంతమ్మ, సరోజ, రాధ నడివాకిట్లోకి వచ్చేరు.

శివరాం వ్యాసపీఠం ముందు దర్భాసనం మీద కూర్చున్నాడు. ఒక చేత్తో జపమాల పట్టుకొని వ్యాసపీఠం మీదున్న పుస్తకం చూస్తున్నాడు. వాడిముందు నిల్చుని కబుర్లు చెప్తున్నామెకు సుమారుగా శాంతమ్మగారి వయస్సుంటుంది. ఖరీదైన కంచి

పట్టుచీర కట్టుకుంది. మెళ్లో మూడు వరుసల చంద్రహారం, చేతులకు నాలుగేసి జతల బంగారు గాజులు, నుదుట అర్ధరూపాయంత బొట్టు- ఆ దృశ్యం సరోజనెంతో ఆహ్లాదపరిచింది.

"బుగతమ్మగోరూ! మనవడిగోరిది కన్నూ, ముక్కూ, నోరూ ఆ కూకోడం అంతా సాచ్చాత్ పెదబుగతగోరేనండి!"

"ఆవిడెవరు?" అన్నట్లు ప్రశ్నార్థకంగా రాధ వంక చూసింది సరోజ.

"సీతమ్మగారు! ప్రెసిడెంట్ రామునాయుడిగారి భార్య. అమ్మకు చిన్ననాటి నుండీ స్నేహితురాలు. వీరికి వంద ఎకరాల పొలం, అరటితోట, మామిడితోట, పూల తోటలు వున్నాయి. కాయగూరలు పండించి పట్నం పంపిస్తారు"

"కోడలమ్మగోరు దండాలండీ! మాకు 'గారు' నేదండి, సీతమ్మేనండి! మరి బుగతగోరు నాయిరోలనేవోరండి! మామయ్యగోరు అందర్నీ అట్టాగేపిలసేవోరండి" అంది నవ్వుతూ.

సరోజ ఆవిడకు ప్రతి నమస్కారం చేసి "కూర్చోండి" అని చాప వెయ్యబోయింది. సీతమ్మ వారించి క్రిందనే కూర్చుంది.

సీతమ్మ చేతులు జాచేసరికి శివరాం ఎంతో చనువుగా వచ్చి ఆమె వొళ్లో కూర్చున్నాడు నవ్వుతూ.

"బుగతమ్మగోరూ! యియిగో కుంచెడుపాలు, కుంచెడు పెరుగు సరిపోద్దా? ఎగస్టా అంపించమంటారాని సూర్నాయిడుగోరు అడగమన్నారు" రెండు స్టీలు కేరేజీలు వారి ముందుంచేడో పని కుర్రవాడు.

"నాను మర్సేపోనాన్రా అప్పన్నా! ఊసులాడత కూకున్నాను! బుగతమ్మగోరూ రెడీ అయినారా?" అంది సీతమ్మ.

"ఆ! దేముడి పూజయింది సీతమ్మా!" అన్నారు శాంతమ్మగారు.

"ఆరు రడీ అయిపోనారని సెప్పి నాను రావోలేటి అడుగు" అని పనివాడికి చెప్పి పంపించింది.

పది నిముషాలలో యిద్దరమ్మాయిలు చక్కగా అలంకరించుకొని చేత్తో పేకెట్స్ పట్టుకోని వచ్చి శాంతమ్మగారి పాదాలకు వంగి నమస్కరించి వారి ఆశీస్సులు పొందేరు.

వారిరువురూ చూడ్డానికెంతో నాజూకుగా, కట్టూబొట్టూ, నడక చదువూ సంస్కారం వున్నవాళ్లలా కన్పిస్తున్నారు. సరోజ వాళ్లవేపు చూసేసరికి-

"రాండి. నాను ఊసులాడత కూకుండిపోనాను! అమ్మా కోడలమ్మగోరూ! ఇది పెద్దకోడలు సూర్నాయుడి పెల్లాం, యిది సిన్న కోడలు సెంద్రం పెల్లాం లలిత, పార్వోతి. ఈల్లిద్దరూ మా పెద్దన్న, సిన్నన్న బొట్టిలే! ఆల్లకి మొగ సంతానం నేదు. ఈల్లిద్దరే ఆల్లిద్దరికీ యిజానగరంల బట్టలేపారం. ఆడోల్ల కాలేజీలో యీల్లిద్దరూ అదేటమ్మా! ఆ బికాం, బి.ఏ సదివేరు" అంటూ తన కోడళ్లను పరిచయం చేసింది సీతమ్మ.

సరోజ చాపవేసి వాళ్లను కూర్చోమంది. కాని వాళ్లు చాపమీదగాక సీతమ్మ ప్రక్కన కూర్చున్నారు.

"మీ అబ్బాయిలు ఏం చేస్తున్నారు?" అని అడిగింది సరోజ సీతమ్మను.

"సెప్పండి!" అంది సీతమ్మ కోడళ్లతో.

"ఇద్దరూ ఎగ్రికల్చరల్ బియస్సి పాసయ్యేరు. ఒకరు పూలతోటలూ, పళ్లతోటలూ, వెజిటబుల్ గార్డెన్స్ చూస్తున్నారు. రెండో అతను మిగతా భూముల్లో ధాన్యం, కమర్షియల్ పంటలూ చూస్తారు" అన్నారు.

"అంత చదువు వుండి యీ పల్లెటూర్లో ఎలా వుంటున్నారు?" అంది సరోజ ఆశ్చర్యంగా.

"ఈ రోజుల్లో పల్లెల్లో లేనివేంటండీ? వినోదం కోసం టీవీ రేడియో ఎలక్ట్రానిక్ పరికరాలంతటా వున్నాయి. పైగా పల్లెల్లో లభించే స్వచ్ఛమైన గాలి, వెలుతురు, నీరు, ప్రశాంత వాతావరణం పట్టణాల్లో ఎక్కడ లభిస్తుందండీ! వీటన్నిటినీ మించినది నిష్కల్మష ప్రేమ, అభిమానం, అనురాగం, ఆరాధన, ఆప్యాయత, ఆత్మీయత పల్లె ప్రజల్లోనే యింకా వుంది. పట్నాలలో లభించదు. ఒకవేళ వున్నా అది కేవలం కృత్రిమమే అనాలి" అన్నారు లలిత, పార్వతి ఎంతో కన్విన్సింగ్‌గా.

"బుగతమ్మగోరూ! ఊసులాడత కూకుంటే పొద్దెక్కిపోతంది! మరి రాధమ్మగోర్ని కూకోబెడితే మనోల్లందరూ వొచ్చేత్తారు" అంది సీతమ్మ.

రాధమ్మ వ్యాసపీఠం ముందు కూర్చుంది. సీతమ్మ పళ్లెంలో పట్టుచీర, జాకెట్

బట్ట, పువ్వులు, పళ్లూ తాంబూలంలో పెట్టి సరోజకు, రాధకు యిచ్చింది.

లలిత, పార్వతి, పళ్లెంలో పట్టుచీర, జాకెట్ పీస్, పళ్లూ తాంబూలంలో 501 రూపాయలుంచి, చెరొకళ్లూ రాధకు యిచ్చేరు.

వెంటనే పూర్లో వున్న ఆడవాళ్లందరూ వచ్చి కొందరు పట్టుచీరలు, కొందరు జరీ చీరలు, యింకొందరు సిల్క్, నైలాన్, విమల్, వగైరా చీరలు, పళ్లు డబ్బు తాంబూలంలో వుంచి రాధకు యిచ్చేరు. వచ్చినవారందర్నీ సీతమ్మ సరోజకు పరిచయం చేసింది.

బండిలో వచ్చిన సామాన్లు, పది బస్తాల బియ్యం, బస్తా పంచదార , బస్తా కందిపప్పు, శనగపప్పూ బెల్లందిమ్మలు, పాత్ర సామగ్రిని సీతమ్మ దగ్గరుండి అరుగుమీద సర్దిపెట్టించి పనివాళ్లచేత వాటిపై చాపలు వేయించింది.

"బుగతమ్మగోరూ! సరుకులన్నీ మా యింటికాడ సుబ్రం నేపించేసినాను. ఆటి దుక్కు మరి సూడక్కర్లేదు" అంది సీతమ్మ.

అంతేకాదు. ఇంకా ఎవరికి తోచిన సరుకులు వాళ్లు తెచ్చి పడవేస్తున్నారు ఎవరూ చెప్పకుండానే. ఈ లోపల వీధి గుమ్మంలో ఒక పెద్ద తాటి ఆకుల పందిరి, పెరట్లో ఒక పందిరి వేసి మామిడి మండల తోరణాలు కట్టేరు.

వంటవాళ్లు వచ్చి కాఫీ ఉప్మా తయారుచేసి వచ్చిన వాళ్లకు యిచ్చేరు.

సర్కస్ కంపెనీ పనుల్లా యింట్లో పనులన్నీ ఎవరూ చెప్పకుండానే చకచకా జరిగిపోతున్నాయి. సరోజకు ఏమీ అర్థంకావడంలేదు.

మొత్తం అరడజను మంచి ఖరీదైన పట్టుచీరలు, పాతిక మిగిలిన చీరలు, 30 వేల రూపాయల రొక్కం వచ్చింది. అంతేకాదు బియ్యం పప్పులు వగైరా సరుకులన్నీ క్షణాల మీద చేకూరేయి.

"బుగతమ్మగోరూ! సీతమ్మ మీ నేస్తురాలని సరుకులన్నీ ఆయమ్మే ఎట్టీసి పనంతా ఆయమ్మకే సెప్పీస్తే మాం పల్లకోవండి. మావూ సెందురుడికో నూలుపోగు ఎట్టాల గదండీ మాకు ఛాన్సు యివ్వండి"

"ఏటి రత్తమ్మొదినా! నామీద సాడీలు సెపుతున్నావు! నువ్వేటీ యివ్వనేదా? బస్తా పంచదార, రెండుపుట్ల సన్నబియ్యం ఎవరు అంపీనారు" అంది సీతమ్మ నవ్వుతూ.

వాళ్ల అభిమానానికి శాంతమ్మగారి కన్నులు చెమ్మగిల్లేయి.

సరోజ ఆ సాయంత్రం లలిత, పార్వతిలతో వెళ్లి వాళ్లాగ్రామంలో నడుపుతున్న వయోజన విద్యాకేంద్రం చూసింది. ఆ గ్రామంలోనేగాక చుట్టుప్రక్కల పది గ్రామాల్లో చదువురానివారు లేరని వింది. కుట్టుపనుల శిక్షణా కేంద్రం చూసింది. అందులో తయ్యారైన గౌన్లూ, లంగాలు, జాకెట్లు, నైటీల్లాంటివన్నీ పట్నంలో తమ షాపు ద్వారా అమ్మిస్తామని వాటికి కావాల్సిన క్లాత్ తమ షాపునుండీ తెస్తామనీ, టైలరింగ్ నేర్పడానికి టీచర్ని నియమించేమని చెప్పేరు లలిత, పార్వతి, వీటన్నిటికీ ప్రోత్సాహమిచ్చింది. రామునాయుడిని పంచాయితీ ప్రసిడెంటుగా నిల్పి గ్రామాభివృద్ధికి కృషిచేయమని చెప్పింది శివరామశాస్త్రిగారేనని తెల్సుకుంది.

చదువు, సంస్కారం, డబ్బు వున్నా ఏమాత్రం గర్వం, అతిశయం లేకుండా ఎంతో అణకువతో లలిత, పార్వతి, వాళ్లత్తగారు సీతమ్మ మీద చూపుతున్న గౌరవ మర్యాదలకు, ఆదరాభిమానాలకు అబ్బురపడింది సరోజ.

గ్రామంలో ప్రజలంతా తనకు చూపుతున్న గౌరవ మర్యాదలకు, ఆప్యాయతకు ఎంతో చలించిపోయింది సరోజ. తాను యిన్నాళ్ళూ ఎంతో మూర్ఖంగా ప్రవర్తించి పోగొట్టుకున్నదేంటో తెల్సుకుంది. అన్నిటికీ డబ్బే ప్రధానం కాదని, ఆత్మీయత, అభిమానం ఎంత డబ్బు వెచ్చించినా పొందలేమని గ్రహించింది.

అంతేకాదు యీరోజుల్లో పట్నవాసులు ఎంతో ఆర్భాటం, అతిశయం ప్రదర్శిస్తూ ఆవగింజంత యిచ్చి ఆనపకాయంత యిచ్చినట్లు ప్రచారం చేసుకుంటున్నారు. అదే పల్లెవాసులు ఆత్మీయతతో, అభిమానంతో ఆనపకాయంత యిచ్చినా ఆవగింజంతే యిచ్చినట్లూ, చంద్రుడికో నూలుపోగన్నట్లూ భావిస్తున్నారన్న నగ్నసత్యం గ్రహించింది సరోజ.

**('ఆంధ్రభూమి సచిత్ర వార పత్రిక', 22 మే 2000)** ✪

# మానిని

"నీ పేరేమిటమ్మా" అన్నారు వర్ధనమ్మగారు వత్తులు నలుపుతూ.

"జ్యోతి! శివజ్యోతి" అంది ఆ అమ్మాయి వినయంగా.

"వంట చేయగలవా?" ఆ అమ్మాయిని ఆపాదమస్తకం ఓ పర్యాయం చూసి అడిగారు.

"పిండి వంటలూ, టిఫిన్లూ కూడా చేయగలనండీ!" అంది ధైర్యంగా.

"నాలుగు రోజులుండి వెళ్లిపోతానని అనవుకదా!" అన్నారు చిరునవ్వుతో.

"అననండి. వుంటాను" అంది నమ్మకంగా.

"సన్నమ్మా!" అంటూ కేకవేసేరు వర్ధనమ్మగారు.

పనిమనిషి సన్నమ్మ లోపలినుండి గబగబా వచ్చింది. సన్నమ్మకు 50 ఏళ్ళుంటాయి. సన్నంగా, పొడవుగా వుంటుంది, చామనఛాయ.

"ఈ అమ్మాయి జ్యోతి. నాకు పనిసాయం చేయడానికి వచ్చింది. గెస్ట్‌రూమ్‌లో ఉంటుంది. తీసుకుని వెళ్ళి కాళ్ళూ చేతులూ మోహం కడుక్కోమను. ఇల్లూ, వంటగదీ చూపించు" అన్నారు.

"రండమ్మాయిగోరూ. ఆ సంచీ ఇటివ్వండి" అంది.

"ఫర్వాలేదు పద" అంటూ ఆమె వెంట నడిచింది.

గెస్ట్‌రూమ్ కడిగినట్లుంది. గదిలో ఒక బల్ల, మంచం, దానిమీద పరుపూ బెడ్‌షీట్, దిండూ వున్నాయి. సీలింగ్ ఫేనుంది. కిటికీలోంచి చల్లని గాలి వీస్తోంది. గది గోడకు నిలువెత్తు అల్మైరా వుంది. ఒక తలుపుకి మిర్రర్ వుంది. ఆల్మైరాలో



రెండు బెడ్‌షీట్లూ, టవల్, టాయ్‌లెట్ సామాన్లూ వున్నాయి. ఎటాచ్‌డ్ బాత్రూమ్ వుంది.

"అందల సామాన్లు తవరికోసం ఎట్టినవేనండి. పెందిల గది కడిగేనండి" లంది సన్నమ్మ.

జ్యోతి తన బేగ్ ఆల్మైరాలో వుంచి టవల్, సోపూ తీసుకుని వెళ్లి కాళ్లూ, చేతులు, ముఖం కడుక్కుని వచ్చింది.

సన్నమ్మ ఇల్లంతా జ్యోతికి చూపించింది.

మేడమీద మూడు బెడ్‌రూమ్స్, ఒక డ్రాయింగ్ రూమ్, ముందూ వెనుకా విశాలమైన బాల్కనీలున్నాయి. క్రింద గెస్ట్‌రూమ్‌తో నాలుగు బెడ్‌రూమ్స్, కిచెన్, డైనింగ్ హాల్, పూజా మందిరం, డ్రాయింగ్ రూమ్ వున్నాయి, ఇంటి చుట్టూ విశాలమైన పెరడూ అందులో కొబ్బరి, మామిడి, జామ, అరటిచెట్లూ, పూల మొక్కలూ ఉన్నాయి.

"అమ్మాయిగోరూ! టీ ఎడతారా? పాలుఫ్రిజ్జిల వుంటాయి" అంది సన్నమ్మ.

"ఎంతమందికి?"

"ఎందరంతే పెద్దమ్మగోరూ, సాత్తుల్లుగోరూ" అంటూ వేళ్లు లెక్కపెట్టి "సేతుడుమంది" అంటూ ఐదు వేళ్ళు చూపించింది.

సన్నమ్మ కిచెన్ గుమ్మం వద్ద నిలబడి ఏ సామాన్లు ఎక్కడ వుంటాయో చెప్పింది. జ్యోతి టీ కలిపి రెండు కప్పులు ట్రేతో తెచ్చి టీపాయ్ మీద వుంచింది. వర్ధనమ్మగారూ, శాస్త్రిగారూ చెరో కప్పు తీసుకున్నారు.

వర్ధనమ్మగారు టీ కొద్దిగా రుచి చూసి "చాలా బాగుందమ్మా టీ" అంది మెచ్చుకోలుగా.

"టీ నువ్వూ, సన్నమ్మా తీసుకుని వాచ్‌మెన్ రంగయ్యకు కూడా ఇవ్వు" అన్నారు.

ఆవిడ చెప్పినట్లే చేసింది జ్యోతి.

వర్ధనమ్మగారి వయస్సు 60 సంవత్సరాలు. ఆమె భర్త వాసుదేవరావుగారు సివిల్ సర్జన్‌గా పనిచేసి రిటైర్ అయి నాలుగు ఏళ్ళక్రితం పోయారు. వారి కుమారుడు విజయ్, కోడలు నళిని ఇద్దరూ గవర్నమెంట్ హాస్పటల్లో డాక్టర్స్. వారికిద్దరు కొడుకులు. పెద్దవాడు వాసు 6 సంవత్సరాలు, రెండోవాడు బంటీ నాలుగు సంవత్సరాలు. ఇద్దరూ కాన్వెంట్‌లో చదువుతున్నారు.

వర్ధనమ్మగారు పూర్వాకాలం మనిషి అయినా ఆవిడకు ఎక్కువగా చాదస్తం లేదు. మడీ, తడీ, ఆచారం పాటిస్తారుగానీ అవన్నీ ఉదయం ఆవిడ పూజ ముగిసేవరకే. అయితే ఉదయం పూట ఆవిడకు పనివొత్తిడి చాలా ఎక్కువ. ఉదయం ఎనిమిదిన్నర గంటలకు మనవలిద్దరూ టిఫిన్ తిని కొద్దిగా టిఫిన్ లంచ్ బాక్స్‌ల్లో పెట్టుకుని కాన్వెంట్‌కి వెళతారు. మరలా 1 గంటకు తిరిగి వస్తారు. అప్పుడు వారికి భోజనం పెట్టాలి. ఉదయం తొమ్మిదిన్నర గంటలకు కొడుకు, కోడలూ భోజనం చేసి టిఫిన్ బాక్స్‌లు తీసుకుని డ్యూటీకి వెళ్లి సాయంత్రం ఆరుగంటలకు వస్తారు.

అందువల్ల ఆవిడ ఉదయాన్నే పూజా కార్యక్రమం పూర్తిచేసుకుని 8 గంటలకు టిఫిన్, తొమ్మిది గంటలకు వంటా పూర్తిచేయాలి. పిల్లలిద్దర్నీ స్కూల్‌కి రెడీ చేసి పంపేవరకూ నళినికి వీలవదు అత్తగారికి పని సాయం చెయ్యడానికి ఇక టైమ్

వుండదు. సాయంత్రం అలసి వచ్చిన కోడలిని చూసి ఆమెకు ఏ పనీ చెప్పలేకపోతున్నారు వర్ధనమ్మగారు. ఆవిడకు వంటపనిచేయడానికి తైనాతుగా ఇంట్లో వుండడానికి ఒక పిల్లను పెట్టుకోవాలనుకుని ఆ విషయం శాస్త్రిగారికి చెప్పారు. శాస్త్రిగారు ఎంతో ప్రయత్నించి చివరకు ఆయన తమ్ముడు పై ఊర్నించి జ్యోతిని తీసుకువచ్చారు.

జ్యోతికి 16 సంవత్సరాల వయస్సు పసిమి ఛాయ. ముఖంలో మంచి కళ ఉంది. కడగిన ముత్యంలా వుంటుంది.

"పని చక్కగా చేస్తుందండీ. నెమ్మదస్తురాలు. ఒకప్పుడు ఎంతో బాగా బ్రతికినవాళ్లే. తల్లీతండ్రీ ఏక్సిడెంట్‌లో పోయేరుట" అన్నారు శాస్త్రిగారు.

శాస్త్రిగారికి ఖర్చులకుగాను వంద రూపాయలిచ్చి వారిని పంపేరు వర్ధనమ్మగారు.

రాత్రి వంట వర్ధనమ్మగారే చేసింది. ఆవిడకు వెనుకసాయం చేసింది జ్యోతి.

మర్నాడుదయం జ్యోతి 5 గంటలకే లేచి స్నానం వగైరాలు పూర్తిచేసి కాఫీ ఫిల్టర్‌వేసింది. పూజ గది శుభ్రంచేసి పూజ సామాగ్రి రెడీ చేసింది. కిచెన్‌లో సామాన్లు నీట్‌గా సర్దిపెట్టింది. వర్ధనమ్మగారు బ్రష్ చేసుకుని వచ్చేసరికి ఆవిడకు కాఫీ కలిపిచ్చింది.

"అప్పుడే స్నానం కూడా చేసేసేవా తల్లీ" అన్నారు చిరునవ్వుతో.

ఆ రోజు రెండు పూటలా జ్యోతి చేతి వంటా, టిఫిన్ తిని ఎంతో మెచ్చుకున్నారు వర్ధనమ్మగారు.

నాలుగు రోజుల్లో ఇంటి పనంతా అలవాటైంది జ్యోతికి.

"పెద్దమ్మగోరూ! అంటే దిస్టి తగల్తదిగానండీ. జ్యోతమ్మగోరు సక్కదనాల సుక్కండీ. ఏ తల్లి కన్న బిడ్డో సిదివి దీపవెట్టుగోచ్చుండి. శానా పనిమంతురోలు గదండీ. ఒక్క సుట్టు సెవితే సాలండి ఏ పనైనా సిటికెలో గెహించి నేస్తన్నారు గదండీ" అంది సన్నమ్మ.

"నిజమేనే చేతిలో పని అందుకుని మరీ చేస్తోంది. ఏ పనిచేసినా ఎంతో నీట్‌గా చేస్తోంది. అసలు నన్ను ఏ పనీ చెయ్యనివ్వడంలేదు. చూస్తున్నావుకదా" అన్నారు.

"పోనీ సెయ్యనియ్యండమ్మా. తవకి కొంత తెరిపి అవుద్ది" అంది.

సన్నమ్మ ఉదయం ఆరుగంటలకు వచ్చి 11 గంటలకు వెళ్లి మరలా మూడుగంటలకు వచ్చి సాయంత్రం ఆరువరకూ వుంటుంది. ఆమె భర్త రంగయ్య వాచ్‌మెన్‌గా ఆ ఇంటివద్దనే పనిచేస్తున్నాడు.

వర్ధనమ్మగారు కొడుకు, కోడలు, మనవల గురించి, వారి అలవాట్లూ, అభిరుచులూ జ్యోతికి చెప్పారు. వాళ్ళు ప్రస్తుతం సౌత్ టూర్‌కి వెళ్లారని నాలుగు రోజుల్లో వస్తారని చెప్పారు.

అనుకున్న విధంగానే వారు నాలుగోరోజు ఉదయాన్నే వచ్చారు. సన్నమ్మ, వాచ్‌మెన్‌వారి సామాన్లు లోనికి తెచ్చేసరికి జ్యోతి ట్రేతో రెండు కప్పుల కాఫీ, రెండు గ్లాసులతో హార్లిక్స్ తెచ్చి టీపాయ్ మీద వుంచింది. విజయ్, నళిని కాఫీ త్రాగారు.

వాసూ, బంటీ ఇద్దరూ వాళ్ల నాయనమ్మ ఒడిలో కూర్చుని కబుర్లు చెబుతున్నారు. వర్ధనమ్మగారు కొడుకూ, కోడల్ని కుశల ప్రశ్నలు వేసి మనవలతో కబుర్లలో పడ్డారు.

విజయ్, నళిని ఆవిడను జ్యోతి గురించి అడగాలనుకుని ఆవిడవేపు ప్రశ్నార్థకంగా చూసారు. అయితే ఆవిడ పిల్లలతో బిజీగా వుండడంవల్ల తరువాత తీరుబడిగా తెలుసుకోవచ్చునుకుని మేడమీదకు వెళ్లిపోయారు.

జ్యోతి పిల్లలిద్దరికీ చెరొక గ్లాసూ హార్లిక్స్ అందించింది. వాళ్లు సందేహంగా ఆవిడవేపు చూసారు.

"తీసుకోండి. అక్క" అంటూ వారికి పరిచయం చేసారు. వాళ్లు జ్యోతివైపు చూస్తూ హార్లిక్స్ త్రాగారు.

"వాసూ, బంటీ మీరిద్దరూ గుడ్‌బోయిస్ కదా. మరి ఇప్పుడు ఫస్ట్ స్నానం చేసి డ్రెస్ చేసుకుని టిఫిన్ చేయడానికి నా దగ్గరకు ఎవరు వస్తారో చూద్దాం. రెడియేనా!' ' అంది జ్యోతి.

"అప్పుడే కాదు, వుండు" అంటూ వాళ్లు వెంటనే కాళ్ళకున్న షూస్, సాక్స్ వూడపెరికి వాటిని ఓ మూలకు విసిరేసి ఇద్దరూ లైన్‌గా నిలబడి "ఆ..రెడీ" అన్నారు.

జ్యోతి "వన్...టూ...త్రీ" అనగానే ఇద్దరూ మేడమీదకు పరుగెత్తారు.

"మెల్లగా వెళ్లండిరా. పడగలరు" అన్నవర్ధనమ్మగారి మాటలు వారు వినిపించుకోలేదు.

జ్యోతి వాళ్ళ జోళ్ళూ, సాక్స్‌తీసి రేక్‌లో పెట్టి కిచెన్‌లోనికి వెళ్ళింది.

కోడలు పిల్లలను గదమాయించి వెంట తరిమితేగానీ స్నానానికి వెళ్లని వాళ్ళు జ్యోతి మాట విని అలా పరిగెత్తేసరికి వర్ధనమ్మగారు ఆశ్చర్యపోయారు.

పదినిముషాల్లో పిల్లలు స్నానం చేసి డ్రెస్ వేసుకుని తయారై ఇద్దరూ ఒకే టైమ్‌లో డైనింగ్ హాల్లో అడుగుపెట్టి-

"అక్కా! నేనే ఫస్ట్ స్నానం చేసాను" అన్నాడు బంటీ.

"కాదు అక్కా, నేనే ఫస్ట్. కావలిస్తే మమ్మీని అడుగు. మమ్మీ నా డ్రెస్ తొందరగా తీసివ్వలేదు. వాడికే డ్రెస్ ముందిచ్చింది" అన్నాడు వాసు బుంగమూతి పెట్టి.

"ఈ రూమ్‌లోకి మీరిద్దరూ ఒకే టైమ్‌లో వచ్చారు. ఇద్దరూ ఈ రోజు ఫస్ట్" అంది జ్యోతి నవ్వుతూ.

ఆమె అలా అనగానే వారి ముఖాలు వికసించాయి.

కొడుకూ, కోడలూ క్రిందకు రావడంతో వర్ధనమ్మగారు డైనింగ్ హాల్లోకి వచ్చారు. పిల్లలు పేచీలు పెట్టకుండా పొందికగా కూర్చుని ఆ అమ్మాయితో కబుర్లు చెప్తూ టిఫిన్ చేయడం చూసి ముగ్గురూ ఎంతో ముచ్చటపడ్డారు.

వర్ధనమ్మగారు జ్యోతి గురించి కొడుకూ, కోడలుకి చెప్పారు.

"ఆ అమ్మాయి నన్ను ఏ పనీ ముట్టుకోనివ్వడంలేదు. మంచి పనిమంతురాలు. చేసే పని నీట్‌గా చేస్తోంది. నిముషం తీరిగ్గా కూర్చోదు. ఇల్లంతా ఎంత చక్కగా సర్దిపెట్టిందో చూసేరా" అన్నారు.

నిజమే. ఇంట్లో సామాన్లు డెకరేటివ్‌గా అమర్చబడ్డాయి.

లంచ్‌కి దోసకాయపప్పు, గుత్తివంకాయ కూర, కొబ్బరి చట్నీ, రసం, మిరియం వడలు, సేమ్యాపాయసం చేసి డైనింగ్ టేబుల్‌మీద వుంచింది జ్యోతి.

ఆ రోజు డ్యూటీ ఆఫ్ కనుక లంచ్‌కి అంతా ఒకే పర్యాయం వచ్చారు. డైనింగ్ టేబుల్‌మీద వున్న ఐటమ్స్ చూడగానే విజయ్ కళ్ళు సంతోషంతో మెరిసాయి. అతనికి

మిరియంవడలు, సేమ్యాపాయసం ఎంతో ఇష్టం.

వర్ధనమ్మగారు వడ్డన చేస్తూ జ్యోతిని కూడా వారితో భోజనానికి కూర్చోమన్నారు. కానీ ఆమె తరువాత తింటానంది.

"నాన్నమ్మా! ఈ రోజు డాడీ బర్త్‌డేనా?" అన్నాడు బంటీ.

"కాదురా. ఎందుకని?" అన్నారు.

"మరి ఇవెందుకు చేసావు?" అంటూ వడలూ, పాయసంవైపు చూపించాడు.

వర్ధనమ్మగారు ఫలకాలున నవ్వారు.

"అవీ నా కొడుక్కి ఇష్టం. అందుకని" అన్నారు.

"మరైతే నాకేమిటి ఇష్టం? " అన్నాడు బంటీ.

"నీకు ఏది ఇష్టమో నువ్వే చెప్పాలి. చెప్పు" అంది జ్యోతి.

"నాకూ...నాకూ కిట్‌కేట్ ఎంతో ఇష్టం" అన్నాడు బంటీ ఉత్సాహంగా.

"షేమ్...షేమ్...!" ఎగతాళి చేసాడు వాసు.

"ఎందుకూ? నాకు అవే ఇష్టం" అన్నాడు బంటీ మొండిగా.

"అవి చెప్పకూడదు. బూర్లూ, జిలేబీలు, వడలు అని చెప్పాలి" అన్నాడు వాసు.

"అయితే నాకు ఇవే ఇష్టం" అంటూ ప్లేట్‌లో వడతీసి చూపించి తినబోయాడు.

"ముందు అన్నం తిని తరువాత అవి తినాలి. నువ్వు ఇవి తింటే మరి అన్నం తినవు" బంటీ చేతిలోని వడతీసి ప్లేట్‌లో వుంచింది నళిని.

"ఫస్ట్ పప్పు అన్నం, కూర అన్న, రసం అన్నం తిని తరువాత ఇవి తినాలి కదూ మమ్మీ" అన్నాడు వాసు.

"అవన్నీ ఫస్ట్ తింటే నా పొట్ట నిండిపోతుంది. మరి ఇవి తినడానికే ప్లేస్ వుండదు" అన్నాడు బంటీ దిగులుగా.

"సరే. అన్నం తింటూ మధ్యలో వడ కొద్దికొద్దిగా తిను" అంది జ్యోతి.

బంటీకి ఈ సజెషన్ నచ్చింది.

"పిల్లలకి వడ్డన నేను చూస్తాను. మీరు నిదానంగా భోజనం చేయండి" అని జ్యోతి పిల్లల మధ్యన నిల్చుని వారికి కావాల్సినవి వడ్డిస్తూ వాళ్లతో కబుర్లు చెప్పడంతో వారు పేచీలు మాని తొందరగా భోజనం చేసారు.

"ఐటమ్స్ అన్నీ ఎంతో రుచిగా చేసావు" అని మెచ్చుకుంది నళిని.

జ్యోతి వాచ్‌మెన్ రంగయ్య ద్వారా తోటకూర, గోంగూర, బచ్చలి, బెండ విత్తనాలు తెప్పించి పెరట్లో మళ్ళు కట్టి పిల్లలచేత వేయించి వారికి గార్డెన్ వర్క్‌లో ఇంట్రెస్టు కలిగించింది. వారు నాటిన బెండ కాపుకు రావడంతో పిల్లల ఆనందానికి ఇక అంతేలేదు. వాళ్లు తమ ఫ్రెండ్స్‌కు చూపించారు.

పిల్లలిద్దరూ జ్యోతికి ఎంతో చేరికయ్యారు. వారిని ఉదయాన్నే నిద్రలేపి 8 గంటలకల్లా తయారు చేసి స్కూలుకి పంపడం, మరలా 1 గంటకు వారికి లంచ్ పెట్టడం, పెద్దవాళ్ళకి 9 గంటలకు లంచ్ రెడీచేసి డైనింగ్ టేబుల్‌పై వుంచి వారి టిఫెన్ బాక్సులు రెడీ చేయడం, పిల్లలచేత స్కూల్ హోంవర్క్ చేయించి చదివించడం లాంటి పనులన్నీ చకచకా ఎంతో ఓర్పుతో నేర్పుగా చేస్తోంది.

ఆమె వచ్చిన నెలరోజులకే ఇంట్లో వచ్చిన మార్పుకు అందరూ ఆశ్చర్య పోయారు. నళినికి ఉదయం పూట ఎంతో రిలీఫ్‌గా వుంటోంది. పిల్లలు అసలు దేనికీ పేచీలు పెట్టడంలేదు. ఒకరితో ఒకరు పోటీపడడం లేదు. తమ పనులు చేసుకుంటున్నారు.

ఇంట్లో కన్నెపిల్ల కలవిడిగా అటూ ఇటూ మసలడం వర్ధనమ్మగారికి కన్నుల పండుగగా వుంది.

జ్యోతికి పట్టుచీరలతో నాలుగు జతల బట్టలు కుట్టించి ఇచ్చారు. పెద్దవాళ్ళకు ఆమె చేసే వంటకాలూ, పిల్లలకు ఆమెచేసే రకరకాల టిఫెన్స్ బాగా నచ్చాయి.

నెలాఖర్న జ్యోతికి జీతం ఎంతివ్వాలనే సందేహం వచ్చింది వర్ధనమ్మగారికి. ముందుగా జీతం విషయం ఏమీ నిర్ణయించుకోలేదు. శాస్త్రిగారు కూడా ఏమీ చెప్పలేదు. కోడలిని పిల్చి అడిగారు. ఆమెకూడా ఏమీ చెప్పలేక "ఆ అమ్మాయినే పిల్చి అడిగి మీరే నిర్ణయించండి" అంది నళిని అత్తగారితో.

జ్యోతిని పిలిచి అడిగారు వర్ధనమ్మగారు.

"నాకెందుకమ్మా జీతం. మీరు ఎంతో అభిమానంతో నన్ను మీ ఇంట్లో

ఉండనిచ్చి భోజనం, కాఫీ టిఫిన్స్ పెడుతున్నారు. బట్టలు కుట్టించి ఇచ్చారు. అంతకన్నా ఇంకేం కావాలి నాకు" అంది నవ్వుతూ.

"అదికాదమ్మాయ్. మీవాళ్ళకెవరికైనా డబ్బు పంపడానికి..."

"డబ్బు పంపాల్సిన వాళ్ళు నాకెవరూ లేరమ్మా" అంది బొంగురుపోయిన గొంతుకతో. కన్నీళ్ళు వర్ధనమ్మ గారికి కన్పించకుండా ముఖం పక్కకు తిప్పుకుంది.

వర్ధనమ్మగారి గుండె కలుక్కుమంది. వెంటనే ఆవిడ జ్యోతిని అక్కున చేర్చుకుని ఓదార్చింది.

"పిచ్చితల్లీ! మేమంతా నీవాళ్ళం కామా? ఊరుకో" అన్నారు ఎంతో అభిమానంతో. 'అనవసరంగా నీ మనస్సు నొప్పించాను" అని బాధపడ్డారు.

ఒకరోజు నళిని సాయంత్రం ఇంటికి వచ్చేటప్పుడు ఐదువందలు పెట్టి చక్కటి పాలరాతి రాధాకృష్ణుల విగ్రహం కొని తెచ్చింది. ఆ రోజు రాత్రి కో-డాక్టర్ మేరేజ్ రిసెప్షన్ ప్రెజెంటేషన్ కొరకు. ఆ విగ్రహం కోసం ఆమె చాలా షాపులు తిరిగి కొంది. అత్తగారికి చూపించి పేక్ చేద్దామనుకుంది. వర్ధనమ్మగారు దానిని చూసి ఎంతో మెచ్చుకున్నారు. ఆవిడ జ్యోతిని పిలిచి దానిని ఆమెకిచ్చి నీట్‌గా పేక్ చేయమన్నారు.

జ్యోతి విగ్రహాన్ని తీసుకుని రెండడుగులు వేసేసరికి బంటీ పరుగు పరుగున వచ్చి జ్యోతి వెనుక నుండి డేష్ ఇచ్చాడు. ఆమె కాస్త పరాకుగా ఉండడంతో ముందుకు తూలి పడి ఆమె చేతిలో బొమ్మ నేలమీద పడి ముక్కలైంది.

మేడమీదకు వెళ్ళబోయిన నళిని ఆ దృశ్యం చూసింది. కోపం పట్టలేక బంటీ రెక్క పట్టుకుని వీపుమీద రెండు దెబ్బలు వేసింది. వాడు ఏడుపు మొదలుపెట్టాడు.

"పొరపాటు నాదేనండీ. బంటీని కొట్టకండి" అంటూ వాడిని నళిని చేతినుండి విడిపించబోయింది జ్యోతి.

"అడ్డమైన వాళ్ళనూ నెత్తిన ఎక్కించుకుంటే ఇలానే వుంటుంది మరి. ఎవళ్ళని మాత్రం ఏమనగలం!" అంటూ కొడుకుని మేడమీదకు ఈడ్చుకుని వెళ్లింది నళిని.

వర్ధనమ్మగారు ఏమో అనబోయి తమాయించుకున్నారు. ఆవిడ తేరుకుని లేచి వెళ్లి నేలమీద పడ్డ ముక్కలను తీయబోయారు. అయితే జ్యోతి ఆవిడను వారించి అక్కడ క్లీన్ చేసింది.

నళిని పది నిముషాల్లో తయారై పిల్లల్ని కూడా తయారుచేసి క్రిందకు తీసుకువచ్చింది.

పిల్లలిద్దరూ "అక్కా టాటా! నాన్నమ్మా టాటా" అని చేతులూపారు.

"చాలు. నోరు మూసుకుని నడవండి" అని వారిని గదమాయించి కార్లో వారిని వెంట తీసుకుని వెళ్ళిపోయింది.

విజయ్ వెన్యూకి డైరెక్ట్‌గా వస్తానన్నాడు.

రాత్రి వర్ధనమ్మగారు భోజనం చేయగానే జ్యోతి ఏమీ తినకుండా డైనింగ్ టేబుల్ సర్ది తన గదిలోకి వెళ్ళి పడుకుంది. అంతా గమనించిన వర్ధనమ్మగారి మనస్సు గాయపడింది.

రోజూ ఉదయం వర్ధనమ్మగారు బ్రష్ చేసుకునేసరికి జ్యోతి ఆవిడ ముందు కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యేది. అయితే ఈ రోజు ఉదయం ఆమె అలికిడి లేకపోయేసరికి ఆవిడకు గత సాయంత్రం సంఘటన గుర్తుకొచ్చి ఏదో ఆందోళనతో "అమ్మా జ్యోతీ!" అంటూ కిచెన్‌వద్దకు వెళ్ళి చూసారు. ఆమె కిచెన్‌లోనూ, డైనింగ్ హాల్లోనూ లేదు. పెరట్లో చూసారు. లేదు.

వాచ్‌మెన్ పాలకేన్ తెచ్చి ఆవిడ ముందుంచాడు.

వర్ధనమ్మగారు. పాల కేన్ కిచెన్‌లో పెట్టి కాఫీ ఫిల్టర్ వేసారు. అనుమానంతో జ్యోతి గదిలోకి వెళ్ళారు. ఆమె మంచంమీద ముడుచుకుని పడుకుంది: దగ్గరకు వెళ్ళి ఒంటిమీద చెయ్యివేసి చూసారు. ఒళ్ళు కాలిపోతోంది. ఆవిడ వెనుతిరిగేసరికి-

"అక్కా! నేను ఫస్ట్ బ్రష్ చేసుకొచ్చాను. హార్లిక్స్ నాకే ముందు ఇవ్వు" అంటూ బంటీ సుడిగాలిలా వచ్చాడు. వాడి వెనుకనే వాసూ కూడా పరుగుపరుగున వచ్చాడు.

"అక్క ఎందుకు ఇంకా పడుకుంది నాన్నమ్మా?" అన్నాడు బంటీ.

"అక్కకి జ్వరం. గొడవ చేయక బయటకు పదండి" అని ఆవిడ మేడమెట్ల వద్దకు వెళ్ళి "విజయ్! విజయ్" అని కేకవేసి "వాసూ! వెళ్ళి మీ డాడీని పిల్చుకుని రా" అన్నారు.

"ఇదేం ఖర్మరా బాబూ. ఎంతో కలవిడిగా ఇల్లంతా తిరిగే పిల్ల ఇలా

నళిని పది నిముషాల్లో తయారై పిల్లల్ని కూడా తయారుచేసి క్రిందకు తీసుకువచ్చింది.

పిల్లలిద్దరూ "అక్కా టాటా! నాన్నమ్మా టాటా" అని చేతులూపారు.

"చాలు. నోరు మూసుకుని నడవండి" అని వారిని గదమాయించి కార్లో వారిని వెంట తీసుకుని వెళ్లిపోయింది.

విజయ్ వెన్యూకి డైరెక్ట్‌గా వస్తానన్నాడు.

రాత్రి వర్ధనమ్మగారు భోజనం చేయగానే జ్యోతి ఏమీ తినకుండా డైనింగ్ టేబుల్ సర్ది తన గదిలోకి వెళ్ళి పడుకుంది. అంతా గమనించిన వర్ధనమ్మగారి మనస్సు గాయపడింది.

రోజూ ఉదయం వర్ధనమ్మగారు బ్రష్ చేసుకునేసరికి జ్యోతి ఆవిడ ముందు కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యేది. అయితే ఈ రోజు ఉదయం ఆమె అలికిడి లేకపోయేసరికి ఆవిడకు గత సాయంత్రం సంఘటన గుర్తుకొచ్చి ఏదో ఆందోళనతో "అమ్మా జ్యోతీ!" అంటూ కిచెన్‌వద్దకు వెళ్లి చూసారు. ఆమె కిచెన్‌లోనూ, డైనింగ్ హాల్లోనూ లేదు. పెరట్లో చూసారు. లేదు.

వాచ్‌మెన్ పాలకేన్ తెచ్చి ఆవిడ ముందుంచాడు.

వర్ధనమ్మగారు. పాల కేన్ కిచెన్‌లో పెట్టి కాఫీ ఫిల్టర్ వేసారు. అనుమానంతో జ్యోతి గదిలోకి వెళ్లారు. ఆమె మంచంమీద ముడుచుకుని పడుకుంది. దగ్గరకు వెళ్లి ఒంటిమీద చెయ్యివేసి చూసారు. ఒళ్లు కాలిపోతోంది. ఆవిడ వెనుతిరిగేసరికి-

"అక్కా! నేను ఫస్ట్ బ్రష్ చేసుకొచ్చాను. హార్లిక్స్ నాకే ముందు ఇవ్వు" అంటూ బంటీ సుడిగాలిలా వచ్చాడు. వాడి వెనుకనే వాసూ కూడా పరుగుపరుగున వచ్చాడు.

"అక్క ఎందుకు ఇంకా పడుకుంది నాన్నమ్మా?" అన్నాడు బంటీ.

"అక్కకి జ్వరం. గొడవ చేయక బయటకు పదండి" అని ఆవిడ మేడమెట్ల వద్దకు వెళ్లి "విజయ్! విజయ్" అని కేకవేసి "వాసూ! వెళ్లి మీ డాడీని పిల్చుకుని రా" అన్నారు.

"ఇదేం ఖర్మరా బాబూ. ఎంతో కలవిడిగా ఇల్లంతా తిరిగే పిల్ల ఇలా

"పదండి. ఇంకా ఎందుకిక్కడ?" అని లలిత భర్త చేయిపట్టుకుని విసురుగా వెళ్ళిపోయింది. ఆమె జాడ నేటివరకూ తెలియలేదు.

"ఏమైందమ్మా?" అంటూ విజయ్ వచ్చి జ్యోతి పల్స్ చూసాడు.

"ఫీవర్ చాలా ఎక్కువగా వుందమ్మా" అని వెంటనే ఇంజెక్షన్ చేసాడు.

"తప్పంతా నాదే. బంటీని కొట్టకండి" అని పలవరిస్తోంది జ్యోతి.

బంటీ అల్మారాలో వున్న కార్డు సైజ్ ఫోటో ఫ్రేమ్‌తో వున్నదానిని తీసి "నాన్నమ్మా చూడు" అంటూ వర్ధనమ్మగారికి ఇచ్చాడు.

ఆవిడ ఫోటో చూసి షాకయ్యారు.

జ్యోతి తల్లిదండ్రులతో కలసి తీయించుకున్న ఫోటో అది.

"చూడరా విజయ్! చూడు. ఈ జ్యోతి ఎవరో కాదురా" అంటూ కొడుక్కి ఫోటో అందించి దుఃఖం ఆపుకోలేకపోయారు.

"లలితక్క" అన్నాడు విజయ్. అతను ఇంటర్‌చదువుతున్నప్పుడు లలిత ప్రతాప్‌ని పెళ్లిచేసుకుని ఇంట్లోంచి వెళ్లిపోయింది.

"ఏం జరిగింది అత్తయ్యా?" అంటూ నళిని వచ్చింది.

"ఇంకేం జరగాలి? నా చేతి గోరుముద్దలు తినాల్సిన నా చిట్టితల్లి తన చిట్టి చేతులతో మనందరికీ ఇన్నాళ్ళూ గోరుముద్దలు తినిపించిందమ్మా. నువ్వు తూలనాడినట్లు ఈ పిల్ల అడ్డమైన వాళ్ళూ కాదమ్మా. నా సొంత మనవరాలు. లక్షల ఆస్తిని కాలదన్ని కట్టుకున్న వాడివెంట కట్టుబట్టల్తో వెళ్లిన అభిమానవంతురాలు నీ ఆడపడుచు కూతురు.

ఏం శాపమో కళ్లముందున్న నా చిట్టితల్లి వాళ్ళమ్మ పోలికలు కొట్టొచ్చిన విధంగా వున్నా నేను గుర్తించలేక పిల్లదానిచేత ఇన్నాళ్ళూ చాకిరీ అంతా చేయిం చాను" అంటూ జ్యోతిని ఒడిలోకి తీసుకున్నారు వర్ధనమ్మగారు.

('ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక', జూలై 2000) ✪

# స్ఫూర్తి

"ఏమాటకు ఆమాటే చెప్పుకోవాలి మాధవమ్మా! నీ కోడలు రవళి మంచి గుణవంతురాలు, బుద్ధిమంతురాలు. గౌరవ మర్యాదలు తెలిసిన వ్యక్తి!" అంది సుందరమ్మ.

"అవును వదినా! అంత పెద్ద చదువు చదివి ఆఫీసర్ ఉద్యోగం చేస్తున్నా పిసరంత కూడా డాబు, దర్పం, భేషజం, ఏ కోశానా కానరావు!" వంత పలికింది అన్నపూర్ణమ్మ.

"మరేం! గొప్పింటి పిల్లకు దొడ్డ బుద్ధులే ఉంటాయి! ఏవీ లేని వాళ్ళకే ఎక్కడలేని విరగపాట్లు! ఆ కాంతమ్మ కోడలు విమలను చూడు! ఏం మిడిసిపాటు, అబ్బో! చేస్తున్నదేమో ఎనిమిది వందల జీతానికి కాన్వెంట్‌లో మేస్టరమ్మ ఉద్యోగం! ఆ మాత్రానికే ఎంత గోరోజనం!

మొన్నటికి మొన్న మా మనవడిని కాన్వెంట్‌లో వేద్దామని పిల్లాడిని తీసుకొని నా కొడుకూ కోడలూ వాళ్ళ స్కూలుకి వెళ్ళేరు. తొందరగా పనైపోతే మావారు ఆఫీసుకు వెళ్ళిపోవాలి కాస్త మీ ప్రిన్సిపాల్‌గారికి చెప్పమని మా కోడలు విమలను అడిగితే, ఇక్కడ రికమెండేషన్స్ చెల్లవందిట! ఆ మట్టున మావాడు అక్కడున్న ఆయాచేతిలో రూపాయి బిళ్ళ పడవేస్తే పని వెంటనే జరిగిపోయింది."

"అవునా! మరి నిన్న మా పెద్దాడు చెలానా కట్టాలని బేంకికి వెళ్ళేడుట. అక్కడ గొప్ప రద్దీగా ఉందిట. నీ కోడలు మా వాడిని గుర్తుపట్టి గుమస్తాకి చెప్పి పనిచేయించిందట. మావాడు అడక్కపోయినా ఆమె సహాయం చేసిందని ఎంతో మెచ్చుకున్నాడు."



మాధవమ్మ ఇరుగు, పొరుగు వారు సుందరమ్మ, అన్నపూర్ణమ్మలు, ఎదురింటి ఆవిడ కాంతమ్మ. తన కోడలు గుణగణాలు మెచ్చుకున్నందుకు మాధవమ్మ గర్వపడలేదు. కాంతమ్మ కోడల్ని విమర్శించినందుకు మాత్రం కాస్త నొచ్చుకుంది. ఇచ్చకాలను ఆమె ప్రోత్సహించదు.

"మీ అన్నయ్యగారు కరివేపాకు పొడిచేసి పెట్టమని అడిగేరు. నాలుగు రెబ్బలు కోసుకుంటాను వదినా!" అంది అన్నపూర్ణమ్మ.

"కావాల్సినంత కోసుకు వెళ్ళు దానికి అడగాలా!" అంది మాధవమ్మ.

"చారులోకి రెండు రెబ్బలు నేనూ కోసుకుంటాను" అని అన్నపూర్ణమ్మ వెంట వెళ్ళింది సుందరమ్మ.

మాధవమ్మ కొడుకు కోదండపాణి, కోడలు రవళి ఇద్దరూ బేంక్ ఆఫీసర్స్‌గా జాబ్ చేస్తున్నారు. కోదండపాణి కాస్త నెమ్మదస్తుడు. రవళి గడసరి. చురుకైంది. తప్పుకు దొరకదు. ఏ పని చేసినా ఎదుటి వాళ్ళకది ఒప్పు పనిలా కనిపించే విధంగా ప్రదర్శించగల నేర్పరి. ఆమె చేసే ప్రతిచిన్నపనీ పదిమంది దృష్టినీ ఆకర్షించి అందిర మెప్పు పొందగల యుక్తిపరురాలు.

మాధవమ్మకు నెలకు మూడువేలు పెన్షన్ వస్తుంది. కోడలు కాపురానికి వచ్చే వరకూ ఇంటి ఖర్చులు, పాలు, పనిమనిషి జీతం, గ్యాస్, వగైరాలు ఆ డబ్బులోంచి ఖర్చుచేసేది. కొడుకు జీతం అంతాతెచ్చి తల్లికిచ్చేవాడు. ఆ డబ్బులోంచి ఇంట్లోకి అవసరమైన సరుకులకు ఖర్చుపెట్టేది.

రవళి మనీ విషయంలో ఎంతో ఖచ్చితంగా వ్యవహరిస్తుంది. ప్రతి ఖర్చుకూ లెక్కలు వేసి అనవసర ఖర్చులు తగ్గించటంలో దిట్ట. ఆమె కాపురానికి వచ్చేక భర్తజీతం, తనజీతంలోంచి ఇంటికి నెలకి కావల్సిన సరుకులుతెప్పించి మిగిలిన సొమ్ము బేంక్‌లో వేస్తోంది. మాధవమ్మ ఆమె పెన్షన్‌లోంచి మునుపటి వలె పాలు, పనిమనిషి జీతం, గ్యాస్ వగైరాలకు డబ్బు ఖర్చు పెడుతున్నా ఆ విషయం రవళి పట్టించుకోలేదు.

కోదండపాణి నెలరోజులు ట్రైనింగ్‌కి హైదరాబాద్ వెళ్ళేడు. ఆ సమయంలో మాధవమ్మకు బిపి డౌన్ అయి చికాకు చేసింది. రవళి అత్తగారిని నర్సింగ్‌హోమ్‌లో జాయిన్ చేసింది. అన్ని టెస్ట్‌లూ చేయించింది. తను నాలుగురోజులు శెలవుపెట్టింది. రోజుకు పదిసార్లు ఆటోల్లో నర్సింగ్‌హోమ్‌కి ఇంటికీ హడావిడిగా తిరిగి వీధిలో వారందరి దృష్టి ఆకర్షించింది.

"ఆఫీసర్ జాబ్ చేస్తున్నా రవళికి పిసరంత గర్వం లేదు. పైగా అత్తగారంటే ఎంత అభిమానం, గౌరవం! మాధవమ్మ గొప్ప అదృష్టవంతురాలు" అని పదిమందీ పొగిడేరు.

రవళి అత్తగారిని నర్సింగ్ హోమ్‌నుంచి ఇంటికి తీసుకొని వచ్చి ఆమెకు అయిన ఖర్చులు -మందులు, డాక్టర్‌ఫీజు, టెస్ట్‌లు, నర్సింగ్‌హోం బిల్లు, పాలు, పండ్లు, బ్రెడ్, ఆటోలు, నాలుగురోజుల శెలవు మొత్తం రూ.3800 లెక్కరాసి అత్తగారికిచ్చింది.

మాధవమ్మగారు మాటాడాక బీరువాలోంచి డబ్బు తీసి కోడలు ముందుంచింది. రవళి డబ్బుతీసి రెండు పర్యాయాలు లెక్కపెట్టి పర్స్‌లో వేసుకొని ఆఫీసుకు వెళ్ళిపోయింది.

అత్తగారి కొరకు ఏ ఖర్చు చేసినా లెక్కరాసి ఆవిడకు యిచ్చి డబ్బు తీసుకోవడం రవళికి పరిపాటే.

కోదండపాణికి ప్రమోషన్ వచ్చింది. ఆఫీసువారు బంగ్లా ఎలాట్ చేసేరు. అది కూడా వాళ్ళ యింటికి దగ్గరలోనే వుంది. ఆఫీసు కారు డ్రైవర్ ఎలాట్ చేసేరు. అయితే అత్తగారిని తమతో తీసుకొని వెళ్ళడం ఇష్టంలేదు.

"మామగారు కట్టించిన యిల్లు వదిలి ఆవిడ మాతో రానన్నా"రని రవళి ముందుగానే అందరికీ ఎంతో నేర్పుగా ప్రచారం చేసింది. ఆమె మాటలు నమ్మిన ఇరుగు పొరుగు వారు బంధువులూ మాధవమ్మ మూర్ఖత్వానికి ఆమెను తప్పు పట్టేరు.

"ఈ వయస్సులో ఆవిడకు యింకా సెంటిమెంట్స్ ఏమిటి? హాయిగా కొడుకూ, కోడలు వద్దకు వెళ్ళి వుండక" అన్నారు.

నేర్పుగా ముందర కాళ్ళకు బంధం వేసిన కోడలి తెలివికి విస్తుపోయింది మాధవమ్మ. కొడుకు మాట వరసకి కూడా తమతో రమ్మని పిలవనందుకు ఎంతో నొచ్చుకుంది.

భర్తను ఏ విధంగా అదుపులో వుంచాలో రవళికి తెలుసు. కోడలు సీమంతానికి మనవడి నామకరణానికి వెళ్ళి ఒక పూట వుండి వచ్చేసింది మాధవమ్మ. ఆమెను మరొక పూట ఉండమనలేదు ఎవరూ.

రవళికిప్పుడు కొత్త ప్రాబ్లమ్ వచ్చింది. ఆమెకున్న మెటర్నిటీ లీవ్ అయి పోయింది. ఇక డ్యూటీలో జాయిన్ అవ్వాలి. లేకుంటే లాస్ ఆఫ్ పే. ఉన్న లీవ్‌లు అన్నీ ముందుగానే వాడేసింది. డెలివరీకి వచ్చి ఇంతవరకూ తోడుగా వుండిన ఆమె తల్లి వెళ్ళిపోయింది. పసివాడిని ఆయాల చేతుల్లో పెడితే బోల్డు ఖర్చని భయం. పరిష్కారమార్గం ఆలోచిస్తున్న సమయంలో ఆమె చిన్ననాటి స్నేహితురాలు రేవతి కలిసింది. ఇద్దరూ కాసేపు చిన్ననాటి విషయాలన్నీ ముచ్చటించుకున్నారు.

"నేనూ, మావారూ ఇద్దరం జాబ్‌చేస్తున్నాం రవళీ! మాకు నాలుగు నెలల బాబున్నాడు. చెప్పుకోదగ్గ దగ్గర బంధువుల మాకు లేరు నెల క్రితం ట్రాన్స్‌ఫర్ మీద ఈ ఊరొచ్చాం. మాకు దేవాలయం లాంటి యిల్లు దొరికింది. ఇంటి ఓనర్ మాధవమ్మగారు దేవతే! ఆవిడ నన్ను కన్నకూతురిలా చూసుకుంటున్నారు. మావాడి ఆలనాపాలనా ఆవిడే చూస్తున్నారు. మాకు ఏ దిగులూ లేదు. నిశ్చింతగా ఆఫీసుకు

వెళ్ళి వస్తున్నాం. ఆవిడ ఎంత అభిమానవంతురాలో తెలుసా! పిల్లాడికి పట్టడానికి పాలుకూడా ఆవిడే తెప్పిస్తారు. ఫేరెక్స్ కొన్నారు. నేను ఏమిచ్చినా తీసుకోరు. పిల్లాడు తాడే ఉగ్గుగిన్నెడు పాలు నువ్వునాకివ్వాలా అంటారు. మావాడికి ఆవిడ దగ్గర ఎంత చేరికనుకున్నావ్! ఆవిడ పలకరిస్తే చాలు కేరింతలు కొడతాడు. మాకుఆవిడ చేస్తున్న హెల్ప్ ఎన్ని జన్మలెత్తినా తీరదు" అంది రేవతి.

స్నేహితురాలి మాటలకు నివ్వెరపోయింది రవళి. అయితే మాధవమ్మ తన అత్తగారేనన్న విషయం రేవతికి చెప్పలేకపోయింది.

రవళికి చక్కటిపరిష్కార మార్గం గోచరించింది.

ఆ సాయంత్రం భర్తనూ కొడుకునూ తీసుకొని అత్తగారిని చూడవెళ్ళింది.

మాధవమ్మ కొడుకూ, కోడలూ పసివాడిని తీసుకుని అలా సడన్‌గా రావడంతో విస్తుపోయింది. వారిని సాదరంగా ఆహ్వానించి క్షేమసమాచారాలు అడిగి తెలుసుకుంది.

రవళి కొడుకుని అత్తగారి ఒడిలో వుంచింది.

మాధవమ్మ మనవడిని ముద్దాడింది.

రవళి అత్తగారితో కాస్సేపు ముచ్చటించి అసలు విషయం చెప్పింది.

"అత్తయ్యా! నాకు లీవ్ అయిపోయింది. రేపే డ్యూటీలో జాయిన్ అవ్వాలి. లేకుంటే జీతం నష్టం! మా అమ్మగారు నిన్ననే వెళ్ళిపోయేరు. అందుచేత మేము ఆఫీసుకు వెళ్ళేటప్పుడు మీ మనవడ్ని మీ వద్ద వదిలి సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చి వాడిని మా వెంట యింటికి తీసుకుని వెళతాం. మరి మీ మనవడి ఆలనా పాలనా మీరే చూడాలి!" అంది ఎంతో వినయంగా.

కోడలు మాటలకు చిరునవ్వు నవ్వింది మాధవమ్మ. కొడుకువేపు చూసింది.

"అవునమ్మా రవళి..." ఏమో చెప్పబోయాడు కోదండపాణి.

"దాందేం వుందిరా ! నేను ఖాళీగానే వున్నాను కదా!" అంది. కనీసం యీ సమయంలోనైనా కొడుకూ కోడలూ తనను వారి దగ్గరకు వచ్చి ఉండమంటా రనుకుంది.

"మీరు ఖాళీగా వున్నారు కనుకనే మేము ఆఫీసుకు వెళ్తూ మీ మనవడిని మీ

వద్ద వదిలి వెళ్తే మీరు సాయంత్రం వరకూ వాడి ఆలనా పాలనా జాగ్రత్తగా చూస్తారని"

"ఆలాగా!" అని కాగితం పెన్నూ తెచ్చి ఉదయం ఎన్ని గంటల నుండీ ఆసాయంత్రం ఎన్ని గంటల వరకూ మీ అబ్బాయి ఆలనా పాలనా నేను చూడాలి! అంది మాధవమ్మ కేజువల్‌గా

"ఉదయం పదిగంటలనుండీ సాయంత్రం ఆరువరకూ"

"అంటే ఎనిమిది గంటలు!"

"అవునండీ! మేం అందరివలె ఠంచనుగా ఐదుగంటలకే ఆఫీసు వదిలి రావడానికి అవదు. మావి ఆఫీసర్ జాబ్స్ కదా!" అంది రవళి గర్వంగా.

మాధవమ్మ ఏవో లెక్కలు వేసి

"చూడు రవళీ! ప్రతీ పని విలువనూ రూపాయల్లో లెక్కించి నీలాకరెక్టుగా చూపలేను కాని ఏదో నీ స్ఫూర్తితో ఆ విద్య కొద్దిగా నాకూ అలవడింది. రోజుకు ఎనిమిది గంటలు నీ కొడుకు ఆలనాపాలనా చూడాలి! అందుకు నా సర్వీస్ ఛార్జీలు గంటకు పదిరూపాయలు మాత్రమే! ముందుగా రెండువేలు అడ్వాన్స్ యివ్వాలి. ఇష్టమైతే చెప్పు!" అన్న అత్తగారి మాటలు తూటాల్లా తగిలేయి రవళికి.

**('ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక', జూలై 2000)** ✪

# కూడుపెట్టే విద్య

"చెప్పరా! నిజం చెప్పు! స్కూలుకి వెళ్ళకుండా ఎక్కడ తిరుగుతున్నావ్?" కేన్ బెత్తంతో మరో రెండు దెబ్బలు వేసి గద్దించారు సింహాలు మాస్టారు.

అప్పటికే అరడజను తట్లుతేరాయి కేశవ ఒంటిమీద. కొడుకు మొండితనం ఏ మాత్రం సహించలేకపోతున్నారు ఆయన.

"నేను నిజమే చెప్తున్నాను...."

"అంటే కోదండంగారు చెప్పింది అబద్ధమనా?"

"......."

"మాట్లాడవేం?"

"అతను మీకేం చెప్పేరో నాకేం తెలుసు!" అన్నాడు కేశవ మొండిగా.

సింహాలు మాస్టారు ఇక కోపం పట్టలేక కొడుకు చేయిపట్టుకుని బరబరా ఈడ్చుకొని వెళ్ళి రోడ్డుమీద కుదేసి మరో రెండుదెబ్బలు వేసేరు.

"పోరా! పో! ఓ రెండుపూటలు తిండిపెట్టకుండా కడుపు మాడ్చితే కాని నీ పొగరణగదు" అని విసవిసా లోనికి వెళ్తూ ఎదురుగా వున్న భార్యను చూసి "అన్నపూర్ణా! నే చెప్పేవరకూ ఆ పింజారీ వెధవను ఇంట్లోకి రానివ్వకు. వాడికి పచ్చి మంచినీళ్ళు కూడా ఇవ్వకు" అన్నారు ఆవేశంగా.

అన్నపూర్ణ భర్తమాటకు ఎదురు చెప్పదు. భర్తను ఎదిరించి ఏ పనీ చెయ్యదు. అందుకే ఆమెకళ్ళఎదుట కొడుకును అంతలా కొడుతున్నా భర్తను వారించడం కాని, అడ్డుపడడం కాని చెయ్యలేదు. కొడుకు ఒంటిమీద పడ్డ ప్రతిదెబ్బ తన ఒంటిమీద పడ్డట్టు విలవిల్లాడుతూ అలా చూస్తూ నిల్చుంది.ఆ సమయంలో అడ్డుకుంటే అతని




కోపం రెట్టింపై మరో నాలుగు దెబ్బలు ఆ పసివాడు అదనంగా తినాల్సి వస్తుందని ఆమెకు తెలుసు.

భర్త పెరట్లోకి వెళ్ళడం చూసి గబగబ వీధి గుమ్మంలోకి వెళ్ళిచూసింది. ఆ వరకే కేశవ సందుమలుపు తిరుగుతూ కనిపించాడు.

కేశవ వయస్సు పన్నెండేళ్ళు. ఎనిమిదవ క్లాసు చదువుతున్నాడు. కుర్రాడు ఎంతో చురుకైనవాడు. చదువులోనూ ఆటల్లోనూ ఫస్ట్! సెవెన్త్ క్లాస్ కామన్ పరీక్షల్లో స్టేట్ ఫస్ట్ వచ్చాడు. కేశవ, సింహాలు మాస్టారి రెండో కొడుకు. పెద్దకొడుకు వినాయకరావు బి.యస్సీ. యూనివర్శిటీ ఫస్ట్ వచ్చి గోల్డ్ మెడల్ సంపాదించాడు. అయితే పై చదువుకు స్తోమతలేదు. రెండేళ్ళుగా నిరుద్యోగి.

సింహాలు మాస్టారి అసలు పేరు వరాహనరసింహం. అతన్ని చిన్నప్పుడు

అందరూ "సింహాలూ!" అనిపిలిచేవారు.

పెద్దయ్యాక కూడ అదే పేరు చెలామణి అయి తరువాత సింహాలు మాస్టారుగా స్థిరపడింది.

పొందూరు ఖద్దరు పంచె, మోచేతులు దిగిన కంటిమెడ లాల్చీ, మెడలో కండువా చేతిలో కేన్ బెత్తం,సింహాలు మాస్టార్ని చూస్తే చాలు అందరికీ హడలే! అతని శిష్యులంతా ఎంతో ప్రయోజకులయ్యారు. చదువు విషయంలో ఎవరినీ స్పేర్ చెయ్యరు. ఆడ మొగ విచక్షణ చూపరు.

ఉదయం ఆరుగంటల నుండీ తొమ్మిది గంటలవరకూ, సాయంకాలం ఆరుగంటలనుండీ రాత్రి తొమ్మిది గంటల వరకూ ఆయన ఇంటివద్ద ట్యూషన్ చెప్తారు. ఆయన వద్ద ట్యూషన్‌కి సీటు సంపాదించటమంటే ఇంజనీరింగ్, మెడిసిన్ సీటు లభించినంత సంతోషిస్తారు.

"ఏమిటమ్మా! ఇక్కడ నిలుచున్నావ్? ఎవరి కోసం ఎదురుచూస్తున్నావ్?" అన్న వినాయకరావు మాటలకు తృళ్ళిపడింది అన్నపూర్ణమ్మ.

ఆసమయంలో తల్లి ఎప్పుడూ వీధి గుమ్మంలో నిల్చుని వుండడం వినాయకరావు చూడలేదు. వారి ఇంటికాంపౌండ్‌లో దక్షిణం వేపో గది వుంది. అందులో ఒక కుర్చీ, టేబుల్, బ్లాక్ బోర్డ్ డజను బెంచీలు వున్నాయి. రోజూ ఆ టైమ్‌లో సింహాలు మాస్టారు పిల్లలకు ట్యూషన్ చెప్తారు. అందువల్ల అన్నపూర్ణమ్మ అటుపక్కకు రాదు.

కొడుకు ప్రశ్నకు సమాధానమివ్వకుండా మౌనంగా ఇంట్లోకి నడిచింది.

"ఏరా! అలా ఊరంట తిరక్క నీ తమ్ముడి చదువు విషయం కాస్త చూడ కూడదూ?" అంటూ గద్దించేరు సింహాలు మాస్టారు ఇంట్లో అడుగు పెట్టిన పెద్దకొడుకును చూసి.

"అదేమిటి నాన్నగారూ నేను రోజూ వాడిని కూర్చోబెట్టి చదివిస్తున్నాను"

"నన్ను నమ్మమంటావ్! వాడు రెండు నెలలుగా స్కూల్‌కి వెళ్ళటం లేదుట! ఆ విషయం నీకు తెలుసా?" అని అడిగారాయన.

"వాడు స్కూల్‌కి వెళ్ళకపోవడమేమిటండీ! మీకెవరో రాంగ్‌గాచెప్పేరు!"

"అలాగేం! చెప్పింది ఎవరో కాదు! వాడి క్లాస్ టీచర్ కోదండం!" అన్నారాయన.

తండ్రి మాటలకు షాక్ అయ్యేడు వినాయకరావు. కేశవ అల్లరి చిల్లరగా తిరిగే రకం కాదు. బుద్ధిమంతుడు. తెలివైనవాడు. ఏ విషయమైనా ఒకమారు చెప్తేచాలు గ్రహిస్తాడు. రోజూ వాడిని కూర్చోబెట్టి అన్ని సబ్జెక్ట్సు చదివిస్తున్నాడు. వినాయకరావుకు అంతా అయోమయంగా వుంది.



"ఏంటోయ్ ! కేశవా ఈ వేళప్పుడు ఇటు ఎటువెళ్తాన్నావ్!" అన్న మాటలకు ఒక్కసారిగా తృళ్ళిపడి పేవ్‌మెంట్ పక్కనే ఆగిన స్కూటర్ మీద వున్న వ్యక్తిని చూసేడు కేశవ.

"ఏం లేదు మావయ్యా! ఊరకనే అలా వెళ్తున్నా!" అన్నాడు తలవంచుకుని.

త్రివిక్రమరావుకి వాడి వాలకం చూసి ఏదో అనుమానంవచ్చింది. "సరే! స్కూటరెక్కు మా ఇంటికి వెళ్దాం" అన్నారు.

కేశవ కాస్త తటపటాయించి మరేం మాట్లాడకుండా స్కూటర్ ఎక్కి కూర్చున్నాడు.

త్రివిక్రమరావు వాడిని తన ఇంటికి తీసుకొని వెళ్ళారు. ఆయన సింహాలు మేస్టారి బావగారు, చెల్లెలు కనకలత భర్త.

భర్త వెంట స్కూటర్ మీద వచ్చిన మేనల్లుడిని ఆప్యాయంగా పలకరించబోయి వాడి వాలకం చూసి "ఏమయిందండీ వాడికి? మోచేతిమీద ఆ తట్లేవిటి" అంది కనకలత.

"ఏమో లతా! నేను ఆఫీసునుండి వస్తూంటే వీడు రోడ్డుమీద ఎయిమ్‌లెస్‌గా వెళ్ళడంచూసి అనుమానం వచ్చి ఇలా వెంట తీసుకుని వచ్చేను. లోనికి తీసుకొని వెళ్ళు" అన్నారు.

కనకలత మేనల్లుడిని ఇంట్లోకి తీసుకొనివెళ్ళి మోచేతుల మీద, వీపుమీద వున్న దెబ్బలకు ఆయింట్‌మెంట్ రాసింది.

'పసివాడు అనే జాలి లేకుండా ఎన్ని దెబ్బలు కొట్టాడో చూడండి రాక్షసుడు!' అని కంటతడి పెట్టుకుంది కనకలత.

భర్తకూ, వాడికీ టిఫెన్, కాఫీ ఇచ్చింది.

రాత్రి భోజనాలయిన తరువాత మేనల్లుడిని దగ్గర కూర్చోబెట్టుకుని "ఏం జరిగిందిరా? మీ నాన్న నిన్ను ఎందుకు అంతలా కొట్టేడు" అని అడిగింది.

"స్కూల్‌కి వెళ్ళడంలేదని..."

"అదేమిట్రా! స్కూలుకి ఎందుకువెళ్ళడంలేదూ? చదువుకోకపోతే ఎలారా? ఎందుకూ పనికిరాని వాడివైపోతావు మీ అన్నచూడు! ఎంతో బుద్ధిగా చదువుకొని ఫస్ట్‌ర్యాంకులో పాసైగోల్డ్‌మెడల్ సంపాదించేడు అవునా?" అంది.

"ఏం లాభం అత్తయ్యా? పై చదువులకు పోలేడు రెండేళ్ళయినా ఉద్యోగం లేదు. నాన్నగారు రోజూ వాడిని తిడుతున్నారు."

"చదువుంటే ఈరోజు కాకుంటే రేపైనా మంచి జాబ్ వస్తుంది. చదువులేందే ఏ ఉద్యోగం వస్తుంది" అన్నారు త్రివిక్రమరావుగారు.

"అందుకే మావయ్యా! నేను సంపాదన చూపే వృత్తివిద్య నేర్చుకుంటున్నాను...'

"వృత్తివిద్యా...." అన్నారు ఆశ్చర్యంగా.

"అవును మావయ్యా! మాస్టర్జీ ఆటోమొబైల్ వర్క్‌షాప్‌లో మెకానిజం నేర్చుకుంటున్నాను రెండునెలల నుండీ. అన్నయ్యలా డిగ్రీ పుచ్చుకొని నిరుద్యోగిగా తిరిగేకంటే అది మంచిదే కదా!"

మాస్టర్జీ ఆటోమొబైల్ ఇంజనీరు. అతనికి ఊర్లో పెద్ద ఆటోమొబైల్ వర్క్‌షాప్‌వుంది. మంచి గుడ్ విల్ ఉంది. కార్లూ, స్కూటర్లూ రిపేర్ చెయ్యడం. సర్వీసింగ్ వంటి జాబ్స్ చేస్తారక్కడ.

అతను పని నేర్చుకోవాలనే పట్టుదల, ఇంట్రస్టున్న అరడజను కుర్రాళ్ళను సెలెక్ట్ చేసి వారికి స్కూటర్లూ, కార్లూ మెకానిజంలో మంచి శిక్షణ ఇస్తాడు. అతని వద్ద పనినేర్చుకున్న వారు సొంత వర్క్‌షాప్స్ పెట్టుకొని బాగా ఆర్జిస్తున్నారు. ఈ విషయం అందరికీ తెలిసిందే!

మేనల్లుడి నిర్ణయాన్ని మనసులోనే అభినందించి "అయినా అట్లాంటి పెద్ద వర్క్‌షాపుల్లో నీలాంటి వాళ్ళకు వాళ్ళు వర్క్ నేర్పుతారా?

నీలాంటి వాళ్ళచేత క్లీనింగ్ పన్లుచేయిస్తారు. లేకుంటే రెంచ్‌లు, స్పేనర్లు అందించమంటారు" అన్నారు త్రివిక్రమరావు.

"ఇక్కడ అటువంటి పన్లుఏవీ మాచేత చేయించరు మావయ్యా! ముందు వారం రోజులు మాకు స్కూటర్, మోటార్‌బైక్ రకరకాల వాటిల్లో ముఖ్యమైన పార్ట్స్, వాటిపని, ఎసంబ్లింగ్ గురించి అర్థమయేట్లు చెప్తారు. వాటిగురించి మేము పూర్తిగా తెలుసుకున్నామో లేదో టెస్ట్ చేస్తారు. తరువాత మాకు కావల్సిన టూల్స్‌కిట్ వారే కొని ఇస్తారు.

ఎవరి టూల్స్ వారే ఉపయోగించుకోవాలి. రిపేర్‌కి వచ్చిన వెహికల్ వారు దగ్గరుండి మాచేత రిపేర్ చేయిస్తారు. ఆ విధంగా మేము ఎంత వరకూ పనినేర్చుకున్నామో, ఎంత క్విక్‌గా, నీట్‌గా చేసేమో చూస్తారు.

అవసరమైన సూచనలు ఇస్తారు. మేము చేసే పనిని బట్టి మేము రిపేర్ చేసిన వెహికిల్స్ ఛార్జీలలో ఒకటిబై నాలుగు బిల్ ఎమౌంటు మాకు నెలాఖర్న లెక్కకట్టి ఇస్తారు. ఆ విధంగా పనినేర్చుకుంటూ సంపాదన చేయవచ్చు మావయ్యా!

గత నెలలో నా పనికి జీతంగా పన్నెండు వందల రూపాయలు వచ్చింది ఇదుగో చూడు ఈరోజు సాయంత్రమే నాకు ఇచ్చేరు" అంటూ నిక్కరు జేబులోంచి పన్నెండు వంద రూపాయలనోట్లు తీసి చూపించేడు కేశవ.

అది చూసిన కనకలత తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. మెచ్చుకోలుగా మేనల్లుడిని చూస్తూ ఏమో చెప్పబోయింది.

"అత్తయ్యా! స్కూల్‌కి వెళ్ళడంలేదని నాన్నగారు నన్ను ఇంట్లోంచి బైటకు వెళ్ళగొట్టేరు. స్కూలుకు వెళ్ళి నిరుద్యోగిగా చేసే చదువు చదవాలని నాకు లేదు. సంపాదన ఇచ్చే చదువు చదువుకుంటాను. మరి నీ దగ్గర నన్ను ఉండనిస్తావా.

నీకు ఈ డబ్బు ఇచ్చేస్తాను. నాకు నెలనెలా వచ్చే జీతం కూడా నీకే ఇచ్చేస్తాను. నన్ను నీదగ్గర మీ ఇంట్లో ఉండనివ్వవా?" బొంగురుపోయిన గొంతుకతో అన్న మేనల్లుడి . ాటలకు చలించి పోయింది కనకలత.

('స్వాతి', సెప్టెంబరు 2000) ✪

# దేవుడి ఏజెంటు

మహాదేవమ్మ మహా భక్తురాలు. రోజూ ఉదయాన్నే లేచి స్నానం చేసి దేవుడికి దీపారాధన, పూజ చేయందే మరే పనీ చెయ్యదు. నిత్యం లలితా సహస్రం, లక్ష్మీ సహస్రనామం, వెంకటేశ్వర సుప్రభాతం ఎంతో నిష్టతో పారాయణ చేస్తుం. మహాదేవమ్మ వయస్సు పైబడ్డ మనిషి కాదు, మూడు పదుల వయస్సునిండని మగువ.

మహాదేవమ్మ భర్త సుందరశివయ్య, అతను గవర్నమెంటు ఆఫీసులో గుమాస్తా. ఏ విధమైన పైరాబడి లేని సీటు అతని . చేతికి వచ్చిన జీతంతోతృప్తిపడే మనిషి అతను. జల్సాలు, షోకులు, షికార్లజోలి  న్నడూ పోడు. అతనికి అన్నివిధాలా తగిన ఇల్లాలు మహాదేవమ్మ. దుబారా ఖర్చులు చేయకుండా ఎంతో పొందికగా, సమర్ధ వంతంగా సంసారం చక్కదిద్దుతోంది.

వారి ఏకైక సంతానం శ్రీనివాస్. శ్రీనివాస్‌కి ఆరుసంవత్సరాల వయస్సు. వయస్సుని మించిన తెలివితేటలు గల చురుకైన కుర్రాడు. రెండో తరగతి చదువుతున్నాడు. ఏ విషయమైనా ఒక్కమారు చెప్తేచాలు. విని జ్ఞాపకముంచు కుంటాడు. బుద్ధిమంతుడు. క్లాసులో ఫస్ట్‌ర్యాంక్ తెచ్చుకుంటున్నాడు.

శ్రీనివాస్‌కి కూడా ఆ పిన్న వయస్సులోనే దైవభక్తి అలవడింది. ఉదయాన్నే తన తల్లితోనే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి పట్టులాగు తొడుక్కుని దేవుడి మందిరం ముందు కూర్చుంటాడు. తల్లి నేర్పిన శ్లోకాలు, పద్యాలు గడగడా చదువుతాడు. తల్లిపూజ ముగిసేవరకూ చేతులు కట్టుకుని కూర్చుంటాడు. హారతి కళ్ళకద్దుకుని దేవుడికి నివేదన చేసిన బెల్లంముక్కో, పటిక పంచదారో, ఎండుద్రాక్షపండో ప్రసాదం చేతిలో వేస్తే కళ్ళకద్దుకుని నోట్లో వేసుకుని బయటకు వస్తాడు. మడిలాగు మార్చుకుని స్కూలు యూనిఫారం వేసుకుని టిఫిన్ తిని పాలు తాగి స్కూల్‌కి వెళ్తాడు.

నాలుగు నెలల క్రితం శ్రీనివాస్‌కి జబ్బుచేసింది. రెండురోజులు పిల్లవాడికి ఒంటిమీద తెలివిలేదు. భార్యాభర్తలు ఎంతో భయపడ్డారు. డాక్టర్ వచ్చి చూసి ఇంజక్షన్



ఇచ్చి వెళ్ళాడు. మహదేవమ్మ ఆ రెండురోజులూ భోజనం చెయ్యలేదు. తల్లి మనసు ఎంతో తల్లడిల్లింది.

"స్వామీ! ఏడుకొండలవాడా! పిల్లవాడికి జబ్బు నయమైతే నీ కొండకు వచ్చి నూటొక్క రూపాయలు నీ హుండీలో వేస్తాను!" అని మొక్కుకుని పసుపుగుడ్డలో నూటొక్క రూపాయలు మూటకట్టి దేవుని మందిరంలో ఉంచింది.

ముడుపు ప్రభావమో, లేక డాక్టరుగారి మందు ప్రభావమో తెలియదు గానీ, శ్రీనివాస్‌కి జబ్బు తగ్గి మామూలు మనిషి అయ్యాడు. మహదేవమ్మ ఆనందానికి అంతులేదు. అయితే నాలుగు నెలలు గడిచినా ఏడుకొండలవాడి కొండకెళ్ళడం పడలేదు.



ఇచ్చి వెళ్ళాడు. మహదేవమ్మ ఆ రెండురోజులూ భోజనం చెయ్యలేదు. తల్లి మనసు ఎంతో తల్లడిల్లింది.

"స్వామీ! ఏడుకొండలవాడా! పిల్లవాడికి జబ్బు నయమైతే నీ కొండకు వచ్చి నూటొక్క రూపాయలు నీ హుండీలో వేస్తాను!'' అని మొక్కుకుని పసుపుగుడ్డలో నూటొక్క రూపాయలు మూటకట్టి దేవుని మందిరంలో ఉంచింది.

ముడుపు ప్రభావమో, లేక డాక్టరుగారి మందు ప్రభావమో తెలియదు గానీ, శ్రీనివాస్‌కి జబ్బు తగ్గి మామూలు మనిషి అయ్యాడు. మహదేవమ్మ ఆనందానికి అంతులేదు. అయితే నాలుగు నెలలు గడిచినా ఏడుకొండలవాడి కొండకెళ్ళడం పడలేదు.

కొడుకు ఏ విషయం అడిగినా వాడికి అర్థమయ్యేటట్టు ఎంతో ఓపికతో చెప్తుంది మహదేవమ్మ.



భోగిపండుగనాడు శ్రీనివాస్ ఉదయాన్నే లేచి తలంటుపోసుకుని కొత్తబట్టలు వేసుకుని వీధిలో పిల్లలంతా వేసినభోగీమంట చూడటానికి వెళ్ళాడు. మహదేవమ్మ స్నానం చెయ్యడానికి బాత్రూమ్‌లోకి వెళ్ళింది. ఆమె స్నానం చేసి బయటకు వచ్చేసరికి వంటింటిగుమ్మం దగ్గర కొడుకు పట్టులాగూ వేసుకుని నిల్చుని ఉండటం చూసి ఆశ్చర్యపోయింది.

"ఏరా! భోగీమంట చూడటానికి వెళ్ళలేదా? కొత్తబట్టలు అప్పుడే ఎందుకు మార్చేశావు?" అని అడిగింది.

"దేవుడికి మన ముడుపులు మడిలాగూ వేసుకుని వెళ్ళి ఇచ్చి వస్తున్నాను. ఇదుగో, ప్రసాదం కూడా తెచ్చాను!" అంటూ పిడికిలితో తెచ్చిన మసిబూడిదను చూపించాడు సంతోషంతో.

"ఏమిట్రా నువ్వంటున్నది? నాకేం అర్థం కావడంలేదు. మడి లాగూతో వెళ్ళి దేవుడికి ముడుపులివ్వడమేమిటి?"

"అదేనమ్మా.... నాకు జబ్బుచేసినప్పుడు ఏడుకొండలవాడికివ్వాలని పసుపుగుడ్డలో మూటకట్టి దేవుడి మందిరంలో ఉంచావు కదా! అది దేవుడికి త్వరగాఇవ్వాలి. లేకుంటే కోపం వస్తుందన్నావు. మరి దేవుడి ఏజెంటు అగ్నిహోత్రుడని చెప్పావు కదా! ఏ దేవుడికివ్వాల్సిన వస్తువునైనా అతనికిస్తే అతను ఆ వస్తువును జాగ్రత్తగా ఆ దేవుడికి అందజేస్తాడని చెప్పావు కదా! అందుకని నువ్వు ఏడుకొండలవాడి కోసం కట్టిన ముడుపును ఏజెంట్ అగ్నిహోత్రుడికిచ్చి దానిని జాగ్రత్తగా ఏడుకొండలస్వామికివ్వమని చెప్పాను!" అన్న కొడుకు మాటలకు మూర్ఛపోయింది మహదేవమ్మ.

('ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక', సెప్టెంబరు 2000) ✪

# కనకాభిషేకం

"సిత్తం! అదే తవకు మనవి సేస్తన్నానండి!"

"పారా, పలుగూ పట్టే సేతల పలకా, బలపం ఎట్టి కూకొబెట్టేరండి!"

"నీకు అబద్ధవండి! నాకు నిజవండి"

"మా వూర్ల ఎవురికీ అచ్చురం ముక్క పోల్తి తెల్దండి"

"మరి యీ పొద్దునువు పరీచ్చ సేయండి. సిన్నా పెద్దా, ఆడామొగా అందరూ అచ్చురాలు గడగడ సదివీగలరండి! సెకసెక రాసి సూపీగలరండి"

"ఆ పెగ్న మాది గాదండి! కుర్ర మేట్టరుదండీ! ఆరి తరిపీదండి"

"అవునండి! ఆరి బలివి నేకుంటే మావు మల్లీ బడిసదువుకి మొగ్గు సూపవండి! మొడ్డిసే వోరివండి!"

"ఎండాకాలం పొలం పనులు మాకు కుసింత వెసులుబాటు. దినాపు సందేల రాంమందిరం కాడ వూరి జనాలు సేరి కబుర్లాడతకూకుని అవుపడతారు"

"ఓ పొద్దు ఆ బావురెండు సేతల మూపున బేగులు విడుకుని గేమంల అడుగెట్టినారండి"

స్టూడెంట్ కుర్రాడి నాగ అగపడ్తన్నారండి! సినేమా ఈరో నాగున్నారండి! మడిసి ఏ వంతు జబరుగాదండి. అరిపిగున్నా సీమ్మిరపకాయండి- సురకత్తినాటోరండి"

"ఆరి దుక్కు మావందరం నివ్వెరబోయి సూసినావండి"

"సేతల బేగులు కిందెట్టి 'అందరికీ దండం' అన్నారండి"



"ఎవురు బాబూ తవరు? మందేవూరు? సుట్టరికాని కొచ్చినారేంటి? ఎవు రింటికి?"

"నా పేరు రావనాదం, మేట్టరుజ్జోగం, పట్నుండొస్తన్న వూర్ల వుండడానికి యిల్లు గావాల" సెప్పేరు.

"పట్నం బాబువా? మేట్టరుజ్జోగవా! మరి మాగేమంల బడినేదు కదా మేట్టరెందుకూ!" కర్రి ఎంకటేసు యిగట వాడేడు.

ఆ బాబు ఏటనుకోనేదు నవ్వీసినారు. ఆ యిసయం నాకు ఎరికే! నాను బడిసూపమన్నా నేటి? నానుండే దానికి కుసింత సోటు సూపమన్నాను. అసిరి నాయుడుగోరు దరమదాతలు అరికాడ కెల్తే తలదాసుకొను సోటీడతారని మాపట్నంల సెవిత వొచ్చిన! ఆసిరినాయుడు..."

"నానే బాబు" అని అరిని అసిరినాయుడు ఆరింటికి తోలుకు ఎల్లేరు.

"మరోసిటంల అసిరినాయుడు ఆరెనక కుర్రమేట్టరు గోరు గోడకు కొట్టిన

బంతినాగ రాం మందిరం కాడకు తిరిగొచ్చేసినారు. వూర్ల అడ, మొగ, సిన్నా, పెద్దా జనాలురాంమందిరం కాడకు రావాలని అసిరినాయుడు కబురంపీసినాడు"

"అసిరినాయుడు వూర్లమోతుబరు. ఆరి మాటకు తిరుగునేదు. వూర్లజనాలు రాంమందిరం కాడ కొచ్చేసినారు. అందరినీ కూకోమని సెప్పి - "ఈ బావు రావనాదం మేట్టరుగోరు. పట్టనం నుంచి వొచ్చినారు. యీరు సెప్పేదోటో నెమ్మిన యినండి మీకే బోదవుద్ది" అన్నారు.

"రావనాదం గోరు అందరికీ దండవని" నాను వూర్ల మీ అందరినీ సిన్నా, పెద్దా, అడ, మొగ - మల్లీ బడికి తోలుకెల్లి సదువు సెప్పడానికొచ్చినాను. సదువుకుంతే నాబవేటో, అచ్చరం ముక్కరా పోతే నట్టవేటో యిడమర్చి బోదసేసేరు"

"మీరు మీ యవసాయం పనులు, సేతిపనులు, కూలిపనులు దినావు పొద్దోయి సేసుకోండి. మీ సెయితీరుబాటు టయాంల ఓసిటం యిటుదుక్కు వొచ్చినారంతే మీకు అచ్చరాలు నేరిపి సదువు సెవతాను. ఇందాక నాను వూర్ల కాలెట్టగానే ఓ పెద్దాయన సక్కటి పెస్న ఏసేరు. వూర్ల బడినేదు కదా మరి మేట్టరెందుకు! సదువు సెప్పడానికి మేట్టరు సదువుకునే శిస్సులు గావాలి. ఆరు ఏడ కూకొని సదూకుంతే అదే బడి!"

"ఎనకటి దినాల్ల యీ బడులు నేవండి! ఏ సెట్టు కిందో, ఏ యింటి సూరు కిందో, సదువు సెప్పేవోరు. అంచాత వూర్లొపెతీ యిల్లూ బడే! యీ పొద్దు యీసిటం నుండీ పెద్దోలందరికీ సదువు మొదలు సేద్దాం. ఏవంతారు" అన్నారు రావనాదంగోరు.

"సీ! సీ! యీ వొయసుల మాకు సదువేటి? మావు సదువుకొని ఉజ్జోగాలు సెయ్యాలా?" అని మొగోలందరూ అడ్డెట్టీబోనారు.

"మేట్టరు బాబు వొగ్గనేదండి! ఆరి పట్టు ఉడుం పట్టండి. ఆ మట్టున మేట్టరు గోరు ఆడోల్ల దుక్కు తిరిగి అమ్మా! మీవూర్ల మొగోల్లందరూ మాకు యీ వొయసుల సదువొద్దు అనీసినారు యిన్నారు గదా! మరి మీరేవంతారు.

"సదువుకోడానికి వొయసు అడ్డేటి? అదో సాకు! తవలాటోరు మాకాడ కొచ్చి పైసా కర్సు నేకుండా పలక, బలపం, పుత్తకాలు సప్లీసేసి మా తీరిక టయాంల సదువు సెవతావంతే సంబరపడాల! సాకులు సెప్పడవేటి? గాపోతే వూర్ల మొగోల్లకు సదువుకోను సిన్నతనం. యీ వొయసుల సదువు నామోసీ! అంచాత ఆరు సదువుకోసం

మల్లీ బడికి మీకాడికినారు. వూర్ల మా ఆడోల్లందరం, పిల్లలు వత్తాం. మరి మొగోల్లు ఏటిసెయ్యాల! యింటికాడ కూకొని కూడువండి మాకెడతారు. ఏవంతారు" అనీసినారు.

"ఆడోల్లు అంత మాటన్నాక మొగొల్లకు పౌరుసం రాదేటండీ! కీలెరిగి వాతెట్టీసినారు గదండీ!"

"ఆ మట్న వూర్లజనాలు సిన్నా,పెద్దా, ఆడామొగామల్లీ బడికి సదువుకి ఎగబడ్డారండి! యిక కట్టవంతా రావనాదం గోరిదేనండి."

"ఆ బావుకు ఇసుగు యిరావం నేదండి. సక్కగ బోద సేసేరండి! వూర్లజనాలు పోటీ బడి అచ్చరాలురాయను, సదవను నేర్సీసుగున్నారండి. ఈ పొద్దుగేమంల సదువురానోడు నేడండి"

"ఓ పొద్దు రావనాదం మేట్టరు గోరు వూర్ల జనాలకి కబురంపినాడండి. అందరినీ కూకోబెట్టి - "మన పెబుత్వం వోరు "అందరికీ సదువు", మల్లీ బడికి", "అచ్చర యిజయం", "వయోజన యిద్దె" అట్టాంటి పదకాలు సేసి నాలాటోరిని పెతీగేమం సదువు నేర్పమని అంపిత్తున్నారు. మరి మీ వూర్ల నానొచ్చిన పనైపోనాది. మీరంతా సక్కగ అచ్చరాలు సదవను, రాయను తొందరగా నేర్సీసుగున్నారు. అంచాత నన్ను యింకో ఊరు ఎల్లమని ఆర్డరేసినారు. నాను ఈ యాలే ఎల్లిపోతన్నాను" అన్నారు.

"సెప్పొద్దండీ! మావెంతో దిగులెట్టీసుగున్నావండి! మా యాదస్తుగ రావనాదం మేట్టారికి సిరుకానుకియ్యాలని తీర్మానం సేసి ఊ' లాడతన్నావండి!"

"ఆ బాబు ఎట్టా పసిగట్టేసినారో నాను కట్నాలు కానుకలూ వొల్లను. నా డూటీ నాను సేసినాను! నాను కోరేదేంటే మీకు తీరిక టయాంల మీ సుట్టుపక్కల గేమాల్ల సదువు రానోరికి అచ్చరాలు సదవను, రాయను నేర్పండి. అదే మీరు నాకు సేసిన "కనకాభిసేకం" అంత సంతోసం. అట్టాగని మాటియ్యండి సాలు అనేసినారండి'
' "మా వంతా నివ్వెర బోనావండి!"

('ఆంధ్రప్రదేశ్', డిసెంబరు 2000) ✪

# ఆరగింపు!

శ్రీమదిఖిల మహీమండల మండన ధరణీధర మండలా ఖండలస్య, నిఖిల సురాసుర వందిత వరాహ క్షేత్ర విభూషణస్య...." శ్రీనివాస గద్య గోవిందా చార్యుల గొంతు మైక్‌లో వినిపించగానే భక్తులంతా ఆలయం వైపు పరుగులు తీస్తారు. హారతి కళ్ళకద్దుకుని తీర్థ ప్రసాదాలు తీసుకునేందుకు.

ధనుర్మాసంలో భక్తుల తొక్కిడి మరీ ఎక్కువగా వుంటుంది. ఆలయ ధర్మకర్త జానకిరామయ్య గారు భక్తులకు ప్రసాదం పంపిణీ కార్యక్రమం స్వయంగా పర్యవేక్షిస్తారు. ధనుర్మాసంలో ప్రసాదాలు అందరికీ అందేలా చూస్తారు.

సుమారు రెండు వందల సంవత్సరాల క్రితం ఆ వేంకటేశ్వరస్వామి వారి ఆలయాన్ని జానకిరామయ్యగారి పూర్వీకులు కట్టించేరు. నిలువెత్తుగల వేంకటేశ్వర, పద్మావతీ విగ్రహాలు ప్రతిష్ఠ చేసి, నిత్యపూజలకూ, ధూపదీప నైవేద్యాలకూ, అర్చకులకు పనివారలకూ జీతభత్యాలకు ఏ లోటు రాకుండా నిధులు ఏర్పాటు చేసేరు. పర్వదినాలలో జరగబోయే ప్రత్యేక పూజలకూ, ఏటా జరగబోయే శ్రీనివాస కల్యాణానికి హుండీ కలెక్షన్ కూడ వినియోగిస్తున్నారు.

గర్భగుడి ముందు విశాలమైన మండపం, కల్యాణ మండపం, వంటగది, అర్చకుని నివాసగృహం, వగైరాలు తదుపరి ధర్మకర్తలు కట్టించేరు. ఆలయ ప్రాంగణంలో వివిధ రకాల పూలమొక్కలు నాటించి వాటి రక్షణ కొరకు తోటపని వానిని నియమించేరు.

విగ్రహ ప్రతిష్ఠ జరిగిన నాటినుండీ వంశపారంపర్య అర్చకులు గోవిందాచార్యుల పూర్వీకులే. వారు ఆలయ ధర్మకర్తలకు గురువులు, గోవిందా చార్యులది శ్రావ్యమైన



గొంతు. అతను పూజ చేస్తున్నా, సుప్రభాతం చదువుతున్నా, శ్రీనివాస గద్య వినిపిస్తున్నా శ్రోతలు పరవశం చెందుతారు.

గోవిందాచార్యులు గొప్పలౌక్యుడు. అతని లౌక్యం ప్రసాదాల పంపిణీలో కనిపిస్తుంది. హారతి పళ్ళెంలో భక్తులు వేసే దక్షిణలను బట్టి వుంటుంది. దక్షిణ ఎక్కువగా వేసేవారికి చక్రపొంగలి, పులిహోర వంటి ప్రసాదాలు, మిగిలిన వారికి పంచదార పలుకులు అందుతాయి. నిత్యం అతనికి హారతి పళ్ళెంలో దక్షిణ రెండువందల రూపాయలకు తగ్గదు. శుక్ర,శనివారాల్లోనూ, పర్వదినాల్లోనూ రాబడి నాలుగైదు రెట్లుంటుంది. అందువల్ల గోవిందాచార్యులు ఎన్ని యిబ్బందులు వచ్చినా, అర్చకత్వం డ్యూటీకి నాగా పెట్టడు. తెలివిగా సమయస్ఫూర్తితో నెట్టుకొస్తున్నాడు.

అయితే యీ యేడు అనుకోని విధంగా గోవిందాచార్యులకు ధనుర్మాసంలో ఆటంకం వచ్చింది. అతను పదకొండు దినాలు గర్భగుడిలో అర్చనాకార్యక్రమాలు నిర్వహించడానికి వీల్లేదు.

"మంచి రాబడి సమయంలో ఆటంకం వచ్చింది." అని ఎంతో చింతించేడు.

తాత్కాలికంగా పదకొండు దినాలూ ఎవరినైనా అర్చకునిగా నియమిస్తే అతనికి రోజుకి వందరూపాయల జీతం, హారతి పళ్ళెంలో వచ్చే దక్షిణలో సగభాగం, రో జుకి రెండు పావుల కట్టడుల భత్యం వగైరాలు యిచ్చుకోవాలి! అంటే సుమారు మూడు వేల వరకూ ఖర్చు!

"గోవిందాచార్యులు ఎన్నో విధాలుగా ఆలోచించి చివరకు గర్భగుడిలో పూజలకు తన మేనల్లుడు శ్రీనివాసాచారిని పెట్టాలి!" అనుకొని ఆ విషయం జానకిరామయ్య దంపతుల చెవిన వేసేడు.

"నేను మండపంలో మైక్ ముందు కూర్చుని మంత్రాలు చదువుతాను! గర్భగుడిలో పెరుమాళ్ళ పూజాకార్యక్రమం క్రియలు నా మేనల్లుడు శ్రీనివాసాచారి జరుపుతాడు" అని చెప్పేడు.

శ్రీనివాసాచారి వయస్సు 12 సంవత్సరాలు. మనిషి బొద్దుగా వుంటాడు. కాన్వెంట్‌లో సెవెన్త్‌క్లాస్ చదువుతున్నాడు. గత ఏడాదే వాడికి ఉపనయనం చేసి శంఖు, చక్రాలు వేయించిన సంగతి ధర్మకర్తకు తెలుసు. అందువల్ల జానకిరామయ్యా గారు అభ్యంతరం చెప్పలేదు.

గోవిందాచార్యులు ఎంతో సంతోషించి వెంటనే శ్రీనివాసాచారిని రప్పించి వాడికి పెరుమాళ్ళ పూజా కార్యక్రమ విధులు చెప్పేరు. ముఖ్యంగా భక్తులకు తీర్థం యిచ్చేటప్పుడూ, శఠగోపం తలపై తాకించేటప్పుడూ చెప్పవలసిన మంత్రం వాడిచేత వల్లెవేయించేడు. శ్రీనివాసాచారి మంచి చురుకైన వాడు. మేనమామ చెప్పిన విషయాలు గుర్తుంచుకున్నాడు.

మర్నాడుదయాన్నే శ్రీనివాసాచారి స్నానాదులు ముగించుకుని పట్టుపంచె కట్టుకున్నాడు. నుదుట మూడు నామాలూ దిద్దుకున్నాడు. గోవిందాచార్యులు వాడి చేత గుళ్ళో పెరుమాళ్ల నిర్మాల్యం విసర్జింపచేసి పుష్పమాలలతో అలంకరింపజేసేడు. తను మండపంలో మైక్ ముందు కూర్చొని నిదానంగా మంత్రాలు చదువుతూ పూజాకార్యక్రమం జరుపుతున్నాడు.

ఆసరికి వంటవాడు ప్రసాదాలు చక్రపొంగలి, పులిహోర, దధ్ధోజనం తెచ్చి గర్భగుడిలో వుంచేడు.

గర్భాలయం గుమ్మం ముందు తెరవేయమని చెప్పి, ప్రసాదాలలో కొంత

భాగం తీసి వేరే వెండి పళ్ళేలలో వుంచి సంప్రోక్షణ చేసి వాటిని అరగింపు చేయమన్నాడు.

గోవిందాచార్యులు జేగంట మ్రోగించటం మొదలుపెట్టాడు.

ధర్మకర్త జానకిరామయ్యగారు కుటుంబ సమేతంగా వచ్చి మండపంలో కూర్చున్నారు. ఊర్లోపెద్దలూ, భక్తులూ చాలమంది వచ్చేరు.

"అరగింపు అవుతున్నది! అవగానే తెరతీసి హారతిచ్చి తీర్థప్రసాదాలు యిస్తాడు. పిల్లాడికి క్రొత్త! అందువల్ల పూజా కార్యక్రమం కాస్త నిదానంగా నెమ్మదిగా జరుగుతోంది. రేపటినుంచి అలవాటై తొందరగానే చేస్తాడు!" అన్నాడు వినయంగా గోవిందాచార్యులు జేగంట మోత ఆపి.

"మాకు తొందరేమీలేదు! పూజ నిదానంగానే జరగనీయండి!" అన్నారు జానకిరామయ్యగారు చిరునవ్వుతో.

"చిత్తం! చిత్తం!" అని రెండు నిముషాలు మరలా జేగంట మ్రోగించి.

"అరగింపు అయిందిరా! శ్రీనివాసా!" అన్నాడు.

"చక్రపొంగలి, పులిహోరా అరగింపయింది మామయ్యా! దద్ధోజనమే మిగిలింది!' అన్నాడు శ్రీనివాసాచారి గర్భగుడిలోంచి

"ఎంతసేపురా! త్వరగా కానీ! ధర్మకర్తగారు..."

"ఎలా కానిచ్చేది మామయ్యా! యింక నా పొట్టలో ప్లేస్ లేదు! కడుపు నిండిపోయింది! దోద్దజనం మరి అరగింపు చెయ్యలేను!" అన్న శ్రీనివాసాచారి మాటలకు అంతా నిర్ఘాంతపోయేరు!

('మహతి', అక్టోబర్-డిసెంబర్ 2000) ✪

# గిల్టీఫీలింగ్

"బావుందే నీ చదువు! రోజుకో పెన్సిలు, పుస్తకం ఇలా ఏదో ఒకటి పారవేసుకుంటూ కొత్తవి కొనడం!" అంది పావని చిరాగ్గా.

"నేనేం పారవేయలేదు మమ్మీ! ఇంట్లోనే మర్చిపోయాను. రాయడానికి పెన్సిల్ లేకుండా క్లాసుకు వెళ్తే టీచరు కొడతారు. అందుకని సునీత మేజర్ అంకుల్ షాపులో కొత్త పెన్సిల్ ఇప్పించింది. రేపు డబ్బులు తెచ్చియిచ్చేస్తానని చెప్పేను" అంది మున్నీ.

"ఏం జరిగిందోయ్! మున్నీనెందుకు అలా ప్రతి చిన్న విషయానికి సతాయిస్తావ్!" అన్నాడు అభినవ్ కూతుర్ని కిస్ చేస్తూ.

మున్నీకి ఆరు సంవత్సరాల వయస్సు. లోటస్ కాన్వెంట్‌లో సెకెండ్ క్లాస్ చదువుతోంది. మున్నీ అభినవ్ పావనిల ఏకైక కుమార్తె. అభినవ్ ఆవూరు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చి మూడు నెలలైంది.

"ఏం చేసిందో మీ ముద్దులపట్టీనే అడగండి! మీరలా ముద్దు చేయబట్టే అది మాట వినకుండా మొండిగా తయారైంది" అంది భర్తకు కాఫీ కప్పు అందిస్తూ.

"నేనేం తప్పుపని చెయ్యలేదు డాడీ! స్కూల్‌కి పెన్సిల్ తీసుకెళ్లడం మర్చిపోయేను. రాసేందుకు పెన్సిల్ లేకుంటే టీచర్ కొడతారు. అందుకని కొత్త పెన్సిల్ కొనుక్కున్నాను...."

"గుడ్! మంచిపని చేసేవు!" అన్నాడు మెచ్చుకుంటూ.

"మీ అమ్మాయి చేసే ప్రతి పనినీ మీరలా సపోర్ట్ చేయడంవల్లే దానికి నామాటంటే ఖాతరు లేదు. ఉదయం స్కూల్‌కి వెళ్లేముందు స్కూల్‌బేగ్‌లో అన్నీ వున్నాయో లేదో చెక్ చేసుకోమని రోజూ చెప్తున్నాను. స్కూల్‌టైమ్ అయేవరకూ



పక్కమీంచి దిగదు. ఆ తరువాత నేను లేటు చేస్తున్నానని ఒకటే ఉరుకులూ పరుగులూ..."

"అవునోయ్! రాత్రి ఏదో రాయాలని మున్నీ బేగ్‌లోంచి నువ్వు పెన్సిల్ తీసేవుకదా అది తిరిగి బేగ్‌లో పెట్టలేదా?" అన్నాడు కేజువల్‌గా.

పావనికి ఏదో జ్ఞాపకం వచ్చి పద్దు పుస్తకం తెరిచి అందులో మున్నీ పెన్సిల్ చూసి చిన్నబోయింది. రాత్రి పద్దు రాయడానికి పెన్ను కనిపించకపోతే మున్నీ బేగ్‌లోంచి పెన్సిల్ తీసి రాసి దానిని పద్దు పుస్తకంలోనే వుంచేసింది. పావనికి రోజూ యింటి ఖర్చులు పద్దురాయడం అలవాటు. తప్పు చేయడమేగాక అనవసరంగా కూతుర్ని చీవాట్లు వేసినందుకు గిల్టీగా ఫీలైంది.

"అదికాదండీ! మీరు ఎవరివద్దా ఏ వస్తువూ అరువుతేవద్దంటారు. మరి మున్నీ ఈ రోజు మిలట్రీ మేజర్ అంకుల్ షాపులో పెన్సిలు, రెండు రోజుల క్రితం కాపీ రైటింగ్ పుస్తకం... ఇలా రోజుకొకటి అరువు తెస్తోంది"

"ఫర్వాలేదు. డబ్బులు రేపు తీసుకొని వెళ్లి ఇచ్చేయమను. ఆ మేజర్ అంకుల్ ఎవరో మంచివాడు కనుకనే అరువిచ్చేడు. లేకుంటే పిల్లలకు ఎవరూ అరువివ్వరు. తెలుసా!" అని స్నానానికి బాత్‌రూమ్‌లోకి వెళ్లేడు.

'అవును. అదీ నిజమే! లేకుంటే మున్నీ ఈరోజు టీచర్‌చేత దెబ్బలు తినేది!' అనుకుంది పావని. దెబ్బల విషయం గుర్తు రావడంతో ఆమె మూడ్ ఆఫ్ అయింది. చేదు జ్ఞాపకం ఎన్నాళ్ళయినా ఎన్నేళ్లయినా ఇంకా వెన్నాడుతూనే ఉంది. గిల్టీ ఫీలింగ్ మనసుని వణికిస్తూనే ఉంది.

పావని సెవెన్త్‌క్లాస్ చదువుతున్నప్పుడు జరిగిన సంఘటన-పావని అన్న రాఘవ, బావ అభినవ్, వినోద్ ముగ్గురూ మంచి స్నేహితులు. ముగ్గురూ టెన్త్ పరీక్షకు వెళ్లేరు. వినోద్‌కి చిన్నతనంలోనే తండ్రి పోయేడు. వినోద్ అన్న వినయమ్ ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ కుటుంబ బాధ్యతలు చేపట్టి తమ్ముడిని చదివిస్తున్నాడు. వినోద్ చదువులో ఫస్ట్.

ఆరోజు టెన్త్ రిజల్ట్స్ పేపర్లో వచ్చేయి. వినోద్‌కి స్టేట్ ఫస్ట్ ర్యాంకు వచ్చింది. ఉదయాన్నే పేపరు చూసిన రాఘవ, అభినవ్ తాము ఫస్ట్‌ర్యాంక్ వచ్చినందుకు ఎంతో సంతోషించేరు. వినోద్ వాళ్లు పేపరు తెప్పించుకోరు. అందువల్ల వినోద్‌కింకా ఈ శుభవార్త తెలియదు కనుక వాడిని చిన్నగ ఆట పట్టిద్దామనుకున్నారు.

రాఘవ పావనిని పిల్చి "చెల్లాయి నువ్వు వినోద్ యింటికి వెళ్లి వాడు పరీక్షలో ఫెయిల్ అయ్యేడని చెప్పు. నమ్మకం లేకుంటే ఈ పేపరు వాడికిచ్చి చూసుకోమను!" అని చెప్పి పంపేడు. పావని తిరిగి వచ్చేక తాము వెళ్లి వాడిని సర్ప్రైజ్ చెయ్యాలనుకున్నారు.

పావని అమాయకంగా పేపరు తీసుకొని వినోద్‌వాళ్ల యింటికి వెళ్లి తలుపు తట్టింది. వినయ్ తలుపుతీసి "ఏం పావనీ ఇంత ఉదయాన్నే వచ్చేవ్" అన్నాడు. "వినోద్ లేడా? వినోద్ పరీక్ష ఫెయిల్ అయ్యేడుట! మా అన్నయ్య, బావ చెప్పమన్నారు వాడికి! నమ్మకం లేకపోతే ఇదుగో పేపరు చూడండి" అంది పావని.

"ఇంకెందుకమ్మా చూడడం! మీరంతా చూసి చెప్తున్నారు చాలు. ఇ చూసేదేంటి?" అని "వినోద్, వినోద్" అని గర్జించాడు.

వినోద్‌కి గతరాత్రి నుండీ ఒళ్లు నొప్పులు, కొద్దిగా జ్వరం. ఇంకా పక్క నుంచి లేవలేదు. వినయ్ పిలుపు విని తృళ్లిపడి లేచి గబగబా వచ్చేడు.

"దొరగారికింకా తెల్లారలేదా! మూడు పూటలా కపునిండా మెక్క పడుకోవడం, ఇంక పనేంవుంది? ఒళ్లు కొవ్వెక్కి చదువు సంతకెళ్లింది" అని తీసుకొని తమ్ముడిని ఎడాపెడా చితబాదేడు.

"రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించి పెడుతూంటే చదువు స ఎగ్గొట్టి వూరంట బలాదూర్‌గా తిరగడం!"

వినోద్ సమాధానం చెప్పబోతే మరో నాలుగు దెబ్బలు వేసి వీధిలోనికి

"పోరా పో! పోయి వీధులంట ముష్టెత్తుకుని బ్రతుకు. ఇక నేను నీకు తిండి పోషించలేను" అని భళ్లున తలుపులు మూసేడు వినయ్.

వినోద్‌ని వాళ్లన్న చావకొట్టడం చూసిన పావని భయపడి యింటికి పరుగె వెళ్లి జరిగిన విషయం రాఘవకూ, అభినవ్‌కూ చెప్పింది.

పావని చెప్పిన విషయం విన్న రాఘవ, అభినవ్ షాక్ అయ్యేరు. జరుగుతుందని వారేమాత్రం ఊహించలేకపోయారు. దాంతో భయపడి వారం రో వినోద్ యింటివైపు వెళ్లలేదు. పావనికి జడుపు జ్వరం వచ్చి వారంరోజులు పలవరింతలు. వినోద్ దెబ్బలు తిని ఇల్లు విడిచి వెళ్లిపోయేడన్న విషయం తెల్సు ఎంతో విచారించేరు. తరువాత వినోద్ విషయం వారికి తెలియలేదు.

పావని పసి హృదయంలో ఆ సంఘటన బలంగా నాటుకుంది. అప్పుడప్పు ఆమెకు ఆ సంగతులు గుర్తుకొచ్చి కలత చెంది మూడ్ ఆఫ్ అవుతూంటుంది కారణానే ఆమె చదువు టెన్త్‌తో ఆపివేసింది. అభినవ్‌తోనే వివాహమైంది.

"ఏంటోయ్! మళ్లీ మూడ్ ఆఫ్ అయిందా?" అన్నాడు అభినవ్ పరధ్యాన్నంగా కూర్చుని వుండడం చూసి.

పావని ఉల్కిపడి లేచి కిచెన్‌లోనికి వెళ్లింది. అభినవ్ భార్య వెళ్లినవంక నిట్టూర్పు విడిచేడు.

ఓరోజు పావని పేరంటంలో నిర్మలని కలిసింది. మాటల సందర్భంలో వాళ్ల పిల్లలు, చదువులు, హోంవర్క్ విషయాలు దొర్లేయి.

"నాకు మా సునీతను కూర్చోబెట్టి హోంవర్క్ చేయించడం, చదివించడం పని తప్పిందండీ!" అంది నవ్వుతూ నిర్మల.

"అదేవిటి! వాళ్లడాడీ చదివిస్తారా?"

"అయ్యో రాత! ఆయనకంత ఓపిక ఏదీ! అదంతా ఆ మహా మనీషి! మిలట్రీ మేజర్ అంకుల్ చలువండీ! మావారు రోజూ ఆఫీసుకు వీళ్ల కాన్వెంట్ మీదుగా వెళ్లాలి. వారు ఆఫీసుకు వెళ్తూ సునీతను స్కూలు వద్ద దింపి వెళతారు. స్కూలు నాలుగు గంటలతోసరి.

మావారి ఆఫీసు 5 గంటలవరకూ. సునీత, మరో పదిమంది పిల్లలూ మేజర్ అంకుల్ షాప్‌లో కూర్చుంటారు. పేరెంట్స్ కోసం వెయిట్ చేస్తూ. మేజర్ అంకుల్‌కి పిల్లలంటే ప్రాణం. అతను వారందరినీ కూర్చోపెట్టి వాళ్లచేత హోంవర్క్ చేయించి చదివిస్తాడు. మంచి కథలూ కబుర్లూ చెప్పి వారిని ఎంటర్‌టైన్ చేస్తాడు."

"పాపం! అతనికి నా అన్నవాళ్లెవరూ లేరుట! వార్‌లో అతని కుడికాలు పోతే ఆర్టిఫిషియల్ లెగ్ పెట్టుకున్నాడు. లోటస్ కాన్వెంట్ స్కూల్ కట్టిన స్థలం అతనిదేనట! గవర్నమెంట్ వారతనికి ఇచ్చింది. స్కూల్‌కి డొనేట్ చేసేడు. స్కూల్ గేటు నానుకొని తనో చిన్న డాబాయిల్లు కట్టుకుని అందులో వుంటున్నాడు. స్కూల్ మేనేజింగ్ కమిటీ మెంబర్. అయినా అతను స్కూల్ అడ్మినిస్ట్రేషన్‌లో ఎన్నడూ జోక్యం చేసుకోలేదు. అతను స్కూల్ అవరణలో కాలుపెట్టేది సంవత్సరంలో రెండు పర్యాయాలు. ఆగస్ట్ 15న, జనవరి 26న. ఆరోజున పిల్లలందరికీ చాక్‌లెట్స్ పంచుతాడు"

"పిల్లలకు కావల్సిన స్టేషనరీ సామన్ల షాపు యింట్లోనే పెట్టేడు. అదైనా కాలక్షేపానికి. టైమ్‌పాస్ కోసం! బీద పిల్లలనెందరినో తన డబ్బుతో చదివిస్తున్నాడు. వారికి స్కూల్ ఫీజు, యూనిఫామ్, బుక్స్ వగైరా అంతా అతనే ఇస్తాడు. మావారు కేంప్‌కి వెళ్తే మా సునీతను స్కూల్‌కి నేనే తీసుకొని వెళ్లి, మరలా తీసుకొచ్చేదాన్ని. అప్పుడు అతడినిచూసి మాట్లాడేను. ఎంతో మర్యాదస్తుడు!" అంది నిర్మల.

మేజర్ అంకుల్ గురించి సేకరించిన వివరాలన్నీ భర్తకు చెప్పింది పావని. ఇప్పుడు ఆమెకు మేజర్ అంకుల్ మీద సదభిప్రాయం కల్గింది.

ఈ సంవత్సరం మున్నీ బర్త్‌డే ఘనంగా చేయాలని, బర్త్‌డే పార్టీకి మున్నీ క్లాస్ పిల్లల్ని, టీచర్స్‌ని కూడ పిలవాలనుకున్నారు అభినవ్, పావని.

"మేజర్ అంకుల్ని కూడ పిలుద్దా"మని అంది మున్నీ.

వారు కాదనలేకపోయేరు. మర్నాడు అభినవ్ భార్యను కూతుర్నీ తీసుకొని వెళ్లేడు. స్కూటర్ ఆగగానే మున్నీ పరుగు పరుగున షాప్‌లోనికి వెళ్లి "మేజర్ అంకుల్! మేజర్ అంకుల్! రేపునా బర్త్‌డే. నిన్ను పార్టీకి పిలవడానికి మమ్మీ డాడీ వచ్చేరు!" అంది.

"అల్లాగా" అని మున్నీ చేతిలో ఫైవ్‌స్టార్ చాక్‌లెట్ బార్ పెట్టి మున్నీ చేయి పట్టుకొని బయటకు రాబోయేడు.

"వినోద్! నువ్వా మేజర్ అంకుల్‌వి" అని అభినవ్ ఆనందం పట్టలేక అతడిని వాటేసుకున్నాడు.

"అభినవ్! ఈవిడ పావని చెల్లాయి కదూ!" అన్నాడు వినోద్.

"అవున్రా! పావనే. మా అమ్మాయి మున్నీ" అన్నాడు అభినవ్.

వారిరువుర్నీ అలా చూస్తూ నిర్ఘాంతపోయింది పావని.

**('ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక' జనవరి 2001)** ✪

# వసతి

"సిస్టర్స్ లేరని అనుకోకు తమ్ముడూ! నేనున్నాను. ఆడపడుచు పెత్తనానికీ, లాంఛనాలకు, మర్యాదలు జిపించుకునేందుకు!" అంది శ్యామల చనువుగా.

"నా తల్లే! ఎంత చల్లని కబురు చెప్పేవు!" అన్నారు అన్నపూర్ణమ్మగారు చిన్న కోడలు వేపు చూసి నవ్వుతూ.

'మరే! తోటి కోడలు తోడుండొద్దా?' అన్నాడు జనార్దన్.

'ఎలా కుదుర్తుంది బావగారూ! అక్క యింటికి పెద్ద కోడలు కదా! అందువల్ల ఆడపెళ్లివారి తరపునే వుండనీయండి' అంది.

'పల్లె సీమలు స్వచ్ఛమైన గాలి, నీరు, వెలుతురు ప్రకృతి అందాలకు నిలయాలు మాత్రమే కాదు. అప్యాయత, అభిమానం, అనురాగం, ప్రేమ, దయాగుణాలకు పల్లెవాసులు పట్టుకొమ్మలు' అనుకున్నాడు రాజశేఖర్

రాజశేఖర్‌ది చక్కటి పర్సనాల్టీ. కంప్యూటర్స్ ఇంజనీర్.

హైదరాబాద్‌లో జాబ్ చేస్తున్నాడు. అతనికి తల్లీతండ్రీ తోబుట్టువులు లేరు. వైజాగ్‌లో పెద్ద యిల్లు వుంది. తండ్రి మిగిల్చిన డబ్బుతో చదువుసాగించేడు. చదువు ముగియగానే జాబ్ వచ్చింది. ఎప్పుడూ ఒంటరితనంతో సతమతమవుతున్న అతనికి వారి అప్యాయత, అభిమానం పన్నీరు జల్లులూ వుంది. జనార్దన్, రాజశేఖర్ కజిన్ నందకిషోర్ క్లాస్‌మేట్స్. యిద్దరూ మంచి స్నేహితులు. నందకిషోర్ ద్వారా యీ సంబంధం వచ్చింది. అతని బలవంతం వల్లే యీ పెళ్ళి చూపులకు వచ్చేడు రాజశేఖర్.

మంజుల మంచి అందకత్తె. టెన్త్‌పాసైంది. శివరామశర్మ గారికి యిద్దరు కొడుకుల తరువాత అపురూపంగా పుట్టిన ఆడపిల్ల.



శివరామశర్మ గారికి రాయవరంలో ఏభై ఎకరాల మాగాణిపొలం, పది ఎకరాల మామిడి, కొబ్బరి తోటలున్నాయి. నాలుగు ఎకరాల్లో కాయకూరలు, వాణిజ్య పంటలూ పండిస్తున్నారు. నీటి సదుపాయం వుంది. గ్రామంలో అర ఎకరం స్థలంలో పాత కాలపు పెద్ద మండువా ఇల్లు వుంది. ఆ యింటికి ఆధునిక సదుపాయాలు సమకూర్చేరు. ఆరు జతల వ్యవసాయ పశువులు, నాలుగు పాడి ఆవులున్నాయి. ఆయన పెద్ద కొడుకు జనార్దన్, రెండోవాడు శంకర్. ఇద్దరూ ఎగ్రికల్చర్ బిఎస్సీ చదివి చక్కగా వ్యవసాయం చూసుకుంటూ తండ్రికి విశ్రాంతినిచ్చేరు. ఇద్దరికీ మేనరికాలు చేసారు.

పెద్దకోడలు శారద. రెండో కోడలు శ్యామల. ఇద్దరు కోడళ్లూ అత్త మామలను ఎంతో అభిమానంతో చూస్తూ వారికి సేవ చేస్తున్నారు.

శివరామశర్మ గారి బావమరుదులిద్దరూ వారి భార్యలను వెంటబెట్టుకుని
చ్చేరు.

"వీరు మా పెద్దబావమరిది రామ్మూర్తిగారు ఆవిడ జానకమ్మ గారు మా
ద్ద కోడలు శారద తల్లిదండ్రులు, వారు లక్ష్మణమూర్తిగారు ఆవిడ అనసూయమ్మ
రు మా చిన్న కోడలు శ్యామల తల్లిదండ్రులు. వారుండేది ప్రక్క గ్రామంలోనే
లుదూరం. వారికీ ఏభై ఎకరాల మాగాణీ వుంది" అని శివరామశర్మ వచ్చిన వారిని
జశేఖర్‌కి పరిచయం చేశారు.

"చిన్న మావయ్యా! మా మరదలు శ్యామల కట్న కానుకలు లాంఛనాలు
ందుకోవచ్చని తను ఆడపడుచునని డిక్లేర్ చేసుకుంది! మరి నీ సంగతేంటి?"
న్నాడు జనార్దన్ నవ్వుతూ.

'అట్లాగైతే మా అమ్మాయి నాకు వియ్యం కుడి హోదా కల్పించిందన్నమాటే
దా! యిక కాసుకోండి!' అన్నారు లక్ష్మణమూర్తి మందహాసంతో.

పెళ్ళి కూతుర్ని తీసుకుని వచ్చి కూర్చోబెట్టిన రెండు నిముషాలకు 'ఎంతసేపు
ిద్దరూ అలా మౌనంగా కూర్చుంటారు. తమ్ముడూ అమ్మాయిని ఏవైనా అడుగు'
ంది శ్యామల.

రాజశేఖర్ కాస్త తటపటాయించేడు.

'సరే మా తమ్ముడు మొహమాటపడుతున్నాడు! నేనే అడుగుతా నీ
రేంటమ్మాయి?' అంది శ్యామల.

'మంజుల' అంది నెమ్మదిగా.

'కాస్త బిగ్గరగా చెప్పమ్మా! రాలిన ముత్యాలు ఏరడానికి అన్నదమ్ములిద్దరూ
డీగానే వున్నారు భయం లేదు... ఏం చదివేవు?'

'టెన్త్'

'వంట చెయ్యగలవా?'

'గలను'

'సంగీతం క్లాసికల్, లైట్ మ్యూజిక్'

'రాదు'

'పోనీ పల్లె పదాలు, జోల పాటలు ఏవీ రావా... ఏం సోద్యం! రేపు బిడ్డను తొట్టెలో వేస్తే...'

'చాల్లే యిక నీ వాగుడు ఆపు! బావుండదు!' అని కూతుర్ని మందలించ బోయింది అనసూయమ్మ.

'పర్వాలేదమ్మా! యిదో వేడుక! మనం పిల్లల సదాలకు అడ్డుపడకూడదు! మనం వారితో ఎంజాయ్ చెయ్యాలి!' అన్నారు శివరామశర్మగారు నవ్వుతూ.

'మా అబ్బాయిని ఏవైనా అడగాలనుకుంటే అడుగు' అన్నారు లక్ష్మణ మూర్తిగారు.

'అడగడానికేముందీ! మా తమ్ముడి వివరాలన్నీ యీవరకే అన్నదమ్ములిద్దరూ చెల్లెలి చెవిలో శంఖం ఊదినట్లు చెప్పేరు' అంది శ్యామల.

ఇరువురూ ఒకర్నొకరు యిష్టపడ్డారని విని పెద్దలందరూ సంతోషించేరు.

'బావగారూ! యిక మిగిలిన విషయాలు కూడ మాట్లాడేసుకుంటే ముహూర్తం నిర్ణయించుకోవచ్చు' అన్నారు లక్ష్మణమూర్తి గారు వియ్యకుండి హోదా ప్రదర్శిస్తూ.

'అబ్బే నాకు అటువంటి...' అంటూ ఏమో చెప్పబోయేడు రాజశేఖర్

'నువ్వూనూరుకో తమ్ముడూ! నాన్నగారికి అంతా తెలుసులే' అంది శ్యామల. 'బావగార్ని ఆటపట్టిస్తున్నారంతే' అని మెల్లగా చెప్పింది.

శివరామశర్మ గారు చిరునవ్వు నవ్వి పెద్ద కొడుకు వేపు చూశేరు.

'దాందేం వుంది మావయ్యా! మీ అన్నదమ్ములిద్దరూ మీ అమ్మాయిలకు ఎలా జరిపించారో మేమూ మా చెల్లెలుకి అలాగే జరిపిస్తాము' అన్నాడు జనార్దన్ హుందాగా.

'అల్లాగైతే మీరు కనీసం ఒక ఏడాదైనా ఆగాల్సి వుంటుంది మీ చెల్లెలి పెళ్లి ముహూర్తానికి' అంది శ్యామల.

'ఈ లిటిగేషన్ ఏంటి?' అన్నాడు జనార్దన్ విస్మయంగా.

'అదంతే బావగారూ! మా నాన్నగారూ, పెదనాన్నగారూ కన్యాదానాలు 40 కేజీల బంగారంతో చేసేరు. మీ బంగారం ప్రస్తుతం బరువు 38 కేజీలే!' అంది.

ఆమె మాటలు ముందు అర్థం కాక ఆశ్చర్యపడి తరువాత అర్థం చేసుకుని అందరూ బిగ్గరగా నవ్వేరు.

'పో వదినా!' అంది మంజుల ఎరుపెక్కిన బుగ్గలతో.

'నేనింకా ప్రొబేషన్‌లో వున్నాను. లీవ్ మూడు, నాలుగు రోజుల కన్నా ఎక్కువ దొరకదు' అని చెప్పేడు రాజశేఖర్.

'అతనికి అనుకూలంగా వుండేవిధంగా ముహూర్తం నిర్ణయించేరు శివరామశర్మగారు.

'బాబూ! నాదో చిన్న రిక్వెస్ట్! నిన్ను పెళ్లి కొడుకుని చెయ్యడం వేడుక మాయింట జరిపిద్దామనుకుంటున్నాం. అక్కడ నుండి అందరం పెళ్లికి తరలివద్దాం! మాకు మొగ పిల్లలు లేరనే లోటు తీరుతుంది' అన్నారు లక్ష్మణమూర్తి గారు.

వారి ఆప్యాయతకు రాజశేఖర్ చలించిపోయేడు.

'తప్పకుండా బాబాయిగారూ! అంతేకాదు మన సైడున కావల్సిన ఏర్పాట్లన్నీ మీరే చూడాలి! మనీ ఎంత అవసరమో..'

'మనీ గురించి నువ్వేమీ వర్రీ అవకు! ఏర్పాట్లన్నీ నేను చేస్తాను కదా!' ఎంతో ఆనందంగా అన్నారు లక్ష్మణమూర్తిగారు.

రాజశేఖర్‌వారి కోరిక మేరకు అక్కడ నుండి నేరుగా వారింటికి వెళ్లాడు. వారిది ఉమ్మడి కుటుంబం! అన్నదమ్ములిద్దరూ కలిసే వుంటున్నారు. వారిదీ పెద్ద మందువాయిల్లే. రామ్మూర్తిగారు సమితి ప్రసిడెంట్. ఆయనకు గొప్ప పలుకుబడి వుంది.

వెడ్డింగ్ కార్డులు రాజశేఖర్ తన అభిమాన పుత్రుడని వేయించేరు లక్ష్మణమూర్తి గారు.

రాజశేఖర్ జాబ్ కన్ఫర్మ్ అయింది. సతిని తీసుకురావడానికి హైదరాబాద్‌లో వసతి కుదర్లేదు. మంజుల ప్రతి ఉత్తరంలోనూ యింటి విషయం గుర్తు చేస్తోంది. చెల్లెలి కాపురానికి అవసరమైన సామాగ్రి ఒక లారీ లోడ్ సమకూర్చి పెట్టేరు అన్నదమ్ములు. ఆడవారంతా హైదరాబాద్ చూడాలని ఉబలాటపడుతున్నారు.

వసతి కుదరగానే వారందరినీ హైదరాబాద్ తీసుకొచ్చి వారికి సాలార్ జంగ్ మ్యూజియం, రామోజీ ఫిల్మ్‌సిటీ, చార్మినార్, గోల్కొండ ఫోర్ట్, వగైరా చూపిస్తానని

రాజశేఖర్ ప్రామిస్ చేసాడు. అయితే అతను, అతని ఆఫీస్ కోలీగ్స్ ఎంత ప్రయత్నిస్తున్నా మంచి యిల్లు అద్దెకు  కుదరలేదు.

రామ్మూర్తిగారు హైదరాబాద్ సమితి పనిమీద వెళ్తూ జనార్దన్‌ని కూడా వెంట తీసుకొని వెళ్లేరు. రాజశేఖర్ ఆఫీసుకు రెండు కిలోమీటర్ల దూరంలో కొత్తగా నిర్మిస్తున్న ఫ్లాట్స్ చూసేరు. అవి వారం రోజుల్లో పూర్తవుతాయి. వాటి వివరాలు సేకరించేరు. రెండు బెడ్‌రూమ్స్, ఒక డ్రాయింగ్ రూమ్,  కిచెన్, ముందూ వెనకా బాల్కనీలు, ఎటాచ్డ్ బాత్ ఫ్లాట్ నమూనా ఫోటోలు తెచ్చి అందరికీ చూపించాడు జనార్దన్.

'హైదరాబాద్‌లో అద్దె యింట్లో యిబ్బందిపడే కంటే సొంత యిల్లుండడం మంచిందని, క్రొత్త యింట్లో పాలు పొంగించి క్రొత్త కాపరం పెట్టడం మేలు' అని పెద్దలందరూ నిర్ణయించేరు.

'అయితే రాజశేఖర్‌కి యీ విషయం ముందుగా చెప్తే అతడంగీకరించడు. అతను అసలే మొహమాటస్తుడు! అందుకని యిల్లు మంజుల పేర తీసుకుంటే అతను కాదనలేడు' అనుకుని అన్నదమ్ములిద్దరూ బేంక్ డ్రాఫ్ట్ తీసుకుని హైదరాబాద్ వెళ్ళి ఫ్లాట్ చెల్లెలిపేర కొన్నారు. ఈ  శుభవార్త రాజశేఖర్‌కి చెప్పాలని ఎంతో సంతోషంతో అతని ఆఫీస్‌కి వెళ్ళేరు.

బావమరుదులిద్దరూ సడన్‌గా ప్రత్యక్షమవడంతో రాజశేఖర్ ఆశ్చర్యపడి వారిని సాదరంగా రిసీవ్ చేసుకుని

'మీకో గుడ్ న్యూస్! నాకు ప్రమోషన్‌మీద వైజాగ్ ట్రాన్స్‌ఫరైంది! యిప్పుడే ఆర్డర్ తీసుకున్నాను. రిలీవింగ్ ఆర్డర్‌కూడా కలెక్ట్‌చేసుకున్నా. రేపే వైజాగ్‌లో జాయిన్ అవాలి! వైజాగ్‌లో సొంత యిల్లుంది కనుక వసతి ప్రాబ్లమ్ లేదు! అన్నిటికంటే ముఖ్యమైన విషయం అందరికీ దగ్గరగా వుండొచ్చు కదా!' అని ఎంతో సంతోషంతో అన్న అతని మాటలకు అవాక్కయ్యేరు అన్నదమ్ములు ఇద్దరూ.

('ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక', 24 ఫిబ్రవరి 2001) ✪

# వింత ఘటన!

"అమ్మగోరూ! అమ్మగోరండీ! ఆ మిల్లీవోడి దాక్షికం యిన్నారా! సార్జీలు పెంచీసినాడు. కేజీకి రూపాయి ఎగస్ట్రా ఏసీసినాడు! అదేటంటే నానేటి సేయను కరెంట్ సార్జీలు పెరిగినాయి తెల్దేటి? రెండు కేజీలకీ అదనంగా మరిరెండు రూపాయలొట్టు గొత్తేనే పిండాడతన్నాడండి!" అంది కొండమ్మ.

"సర్లే! యింద రెండు రూపాయలు. తీసుకొని వెళ్ళి త్వరగా మర పట్టించుకొనిరా! అవతల బోల్డు పనులున్నాయి" అంది వినీల.

"సిటంలో పారొత్తానండి!" అంటూ వెళ్ళింది కొండమ్మ.

వినీల వెనుదిరిగి కిచెన్ వేపు వెళ్ళబోయేసరికి-

"అమ్మగోరూ పాలండి!" అన్న పాలవాడి కేక విని పాలగిన్నె తీసుకొని వీధిగుమ్మంలోకి వచ్చింది.

పాలవాడు రెండు పూటలా గేదెను ఇంటి ముందుకు తోలుకొని వచ్చి పాలు పితికి పోస్తాడు. వాడు గేదె వద్ద కూర్చొని పాల చెంబు గాల్లో తల క్రిందులుగా త్రిప్పి చూపించి పాలుపితికి తెచ్చేడు.

"అమ్మగోరూ! యీనెల కాడ్నుంచీ నీటరుకి రూపాయి ఎగస్ట్రా అవుద్దండి!' అన్నాడు పాలు కొలిచి గిన్నెలో పోస్తూ.

"అదేమిటోయ్! సడెన్‌గా ఒకేమారు రూపాయి పెంచేసేవు..."

"నానేటి పెంచీనేదండీ! ఆ మిల్లీవోడు, సావుకారు పసువుల దానాలు, తవుడు, సిట్టూ, పొట్టూ, నూకలు దరలు పెంచేసి నారండి! అదేటని మావు నిలదీస్తే మా వేటి



సేసేది? కరెంట్ సార్జీలు పెరిగినాయికదా! ఎరికనేదేటి? అంతన్నారండి! అమ్మగారూ నాను రూపాయే యేసినాను గాని డెయిరీవోల్లు పేకెట్టుకి రూపాయి ఏస్తారు సూడండి! అయిను పెట్టెల్ల ఎట్టేవిగదండీ!" అన్నాడు ఎంతో ఉదారత ప్రకటిస్తున్నట్లు.

వినీల పాలవాడితో ఏమాత్రం ఆర్గ్యూ చెయ్యతల్చుకోలేదు.

"వాడు ఎన్నో సంవత్సరాలుగా నమ్మకంగా యింటికి గేదెను తోలుకొని వచ్చి పాలుపిండి పోస్తున్నాడు. వానొచ్చినా వరదొచ్చినా ఎన్నడూ నాగాపెట్టడు. తను వద్దంటే చాలు అతడి వద్ద వాడిక పెట్టుకుందికి ఎంతో మంది ఎదురు చూస్తున్నారు" అనుకుంది.

ఉదయం రెండు లీటర్లూ, సాయంత్రం లీటరు రోజుకి మూడు లీటర్లపాలు తీసుకుంటోంది వినీల.

"సర్లేగానీ!" అంది. నెలకు పాలకే అదనంగా తొంభై రూపాయలు చెల్లించాలి అన్న భావన ఆమె గుండెలో రాయి పడినట్లైంది.

"పోనీ పాలు తగ్గిద్దామంటే అసలు సరిపోవు. అందరికీ రెండు పూటలా చిక్కటి పెరుగుండాలి" అనుకుంది.

"మమ్మీ! నా పోకెట్ మనీ యీ నెల నుండీ మరో యాభై రూపాయలు పెంచాలి! మాకేంటీన్లో రేట్స్ పెంచేరు. కరెంట్ ఛార్జీలు పెరిగేయని" అన్నాడు వినీల పెద్దకొడుకు విజయ్.

"కరెంట్ ఛార్జీలకూ మీ కేంటీన్ రేట్స్‌కీ సంబంధమేమిట్రా!" అంది ఆశ్చర్యపోతూ.

"ఏమిటి మమ్మీ! ఏం తెలియనట్లు అడుగుతున్నావ్! కేంటీన్లో కిచెన్ పరికరాలు పప్పురుబ్బడానికి గ్రైండర్ వగైరా అన్నీ కరెంట్ వల్లే కదా పనిచేస్తాయి!"

"అయితే రేపట్నించి నీకూ టిఫెన్ బాక్స్‌లో పెట్టి యిస్తాను"

"ఏమిటి మమ్మీ! టిఫెన్ బాక్స్ తీసుకొని క్లాసకి వెళ్తే మా ఫ్రెండ్సంతా నవ్వుతారు" అన్నాడు విజయ్ ఉక్రోషంతో.

"ఎందుకు నవ్వుతారురా? మీ డాడీ, తమ్ముడు, చెల్లెళ్లూ తీసుకొని వెళ్తున్నా రుగా.'

"డాడీ సంగతి వేరుమమ్మీ! వాళ్ల ఆఫీసులో అందరూ టిఫెన్ బాక్స్‌లు తెచ్చుకుంటారు. పైగా డాడీ ఆఫీసుకి స్కూటర్‌మీద వెళ్తారు. నేను బస్సు రద్దీలో కాలేజీకి వెళ్లాలి. ఇక తమ్ముడు, చెల్లాయిల స్కూల్స్ చాలా దగ్గర"

"మరేం ఫర్వాలేదు! నువ్వా ఓ బేగ్ కొనుక్కొని అందులో అన్నీ వేసుకొని వెళ్లు! బస్సులో యీజీగా వుంటుంది"

"కాన్వెంట్ పిల్లల్లా కాలేజీకి భుజాన్న బేగ్ తగిలించుకుని వెళ్తారేంటి? ఆఫ్టరాల్ ఫిఫ్టీరూపీస్ కోసం అంతలా ఆర్గ్యూ చేస్తున్నావ్! పోనీలే నాకసలు పోకెట్ మనీయే అవసరం లేదు!" అంటూ విసురుగా బుక్స్ తీసుకొని వెళ్లిపోయేడు విజయ్.

ఉదయం రెండు లీటర్లూ, సాయంత్రం లీటరు రోజుకి మూడు లీటర్లపాలు తీసుకుంటోంది వినీల.

"సర్లేగానీ!" అంది. నెలకు పాలకే అదనంగా తొంభై రూపాయలు చెల్లించాలి అన్న భావన ఆమె గుండెలో రాయి పడినట్లైంది.

"పోనీ పాలు తగ్గిద్దామంటే అసలు సరిపోవు. అందరికీ రెండు పూటలా చిక్కటి పెరుగుండాలి" అనుకుంది.

"మమ్మీ! నా పోకెట్ మనీ యీ నెల నుండీ మరో యాభై రూపాయలు పెంచాలి! మాకేంటీన్లో రేట్స్ పెంచేరు. కరెంట్ ఛార్జీలు పెరిగేయని" అన్నాడు వినీల పెద్దకొడుకు విజయ్.

"కరెంట్ ఛార్జీలకూ మీ కేంటీన్ రేట్స్‌కీ సంబంధమేమిట్రా!" అంది ఆశ్చర్యపోతూ.

"ఏమిటి మమ్మీ! ఏం తెలియనట్లు అడుగుతున్నావ్! కేంటీన్లో కిచెన్ పరికరాలు పప్పురుబ్బడానికి గ్రైండర్ వగైరా అన్నీ కరెంట్ వల్లే కదా పనిచేస్తాయి!"

"అయితే రేపట్నించి నీకూ టిఫెన్ బాక్స్‌లో పెట్టి యిస్తాను"

"ఏమిటి మమ్మీ! టిఫెన్ బాక్స్ తీసుకొని క్లాస్‌కి వెళ్తే మా ఫ్రెండ్సంతా నవ్వుతారు" అన్నాడు విజయ్ ఉక్రోషంతో.

"ఎందుకు నవ్వుతారురా? మీ డాడీ, తమ్ముడు, చెల్లెళ్లూ తీసుకొని వెళ్తున్నారుగా.'

"డాడీ సంగతి వేరుమమ్మీ! వాళ్ల ఆఫీసులో అందరూ టిఫెన్ బాక్స్‌లు తెచ్చుకుంటారు. పైగా డాడీ ఆఫీసుకి స్కూటర్‌మీద వెళ్తారు. నేను బస్సు రద్దీలో కాలేజీకి వెళ్లాలి. ఇక తమ్ముడు, చెల్లాయిల స్కూల్స్ చాలా దగ్గర"

"మరేం ఫర్వాలేదు! నువ్వో ఓ బేగ్ కొనుక్కొని అందులో అన్నీ వేసుకొని వెళ్లు! బస్సులో యీజీగా వుంటుంది"

"కాన్వెంట్ పిల్లల్లా కాలేజీకి భుజాన్న బేగ్ తగిలించుకుని వెళ్తారేంటి? ఆఫ్టరాల్ ఫిఫ్టీరూపీస్ కోసం అంతలా ఆర్గ్యూ చేస్తున్నావ్! పోనీలే నాకసలు పోకెట్ మనీయే అవసరం లేదు!" అంటూ విసురుగా బుక్స్ తీసుకొని వెళ్లిపోయేడు విజయ్.

"ఆడపిల్లలు వంటపని, ఇంటిపనీ చెయ్యకపోతే ఎలా! రేపువారు అత్తవారింటికి వెళ్లాక ఏపనీ చేతకాదని, మీ అమ్మ మిమ్మల్ని ఇలాగే పెంచిందా! అని నన్నాడిపోసుకుంటారు" అని భర్తతో వినీల పలుమార్లు వాదించింది.

"చేపపిల్లకి యీదడం, పక్షిపిల్లకి ఎగరడం, ఆడపిల్లకి వంటపని, ఇంటిపని రావడం అబ్బురవేంకాదు. వాటంతటవే వస్తాయి. రేపు పెళ్ళయ్యాక వారికి యీ పన్లు ఎలాగూ తప్పవు! అంతవరకూ వారిని హాయిగా వుండనిద్దూ!" అంటూ భార్యను సమాధానపరుస్తుంటాడు లోకేశ్వర్.

అయితే వద్దన్నా వినకుండా సుధీర్ తల్లికి అన్ని పనులూ సాయం చేస్తుంటాడు.

రాత్రి డిన్నర్ అంతా ఒకే మారు చేస్తారు. కరెంటు ఛార్జీల పెంపు వల్ల పెరిగిన ఇంటి బడ్జెట్ సుమారుగా మూడువేల రూపాయలు అని లెక్కకట్టి తేల్చుకుంది వినీల.

డిన్నర్ టేబిల్ వద్ద ఖర్చుల వివరాలన్నీ భర్త, పిల్లలతో కేజువల్‌గా చెప్పింది.

"కరెంటు ఛార్జీల పెంపు మమ్మీకి పెద్ద షాకే!" అన్నారు పిల్లలు.

"మమ్మీ షాక్ ఎబ్జార్బర్ కదా! అందువల్ల అన్ని షాక్‌లూ మీ మమ్మీకే మరి!" అన్నాడు లోకేశ్వర్ నవ్వుతూ.

"అవునోయ్! మరి షాక్ ట్రీట్‌మెంట్" అన్నాడు భార్య నుద్దేశించి.

"రేపు తీసుకుంటాను!" అంది వినీల నవ్వుతూ.

మర్నాడుదయం బాత్‌రూమ్‌లోకి వెళ్లి విమల కెవ్వుమని కేకవేసింది.

"ఏం ప్రమాదం జరిగిందో" నని అంతా బాత్‌రూమ్ వద్దకు వెళ్లేరు.

"ఏమయిందమ్మా!" అన్నాడు లోకేశ్వర్ ఆత్రుతతో.

"నీళ్లు చల్లగా వున్నాయి డాడీ! ఎలా పోసుకోను?" అంది విమల బాత్‌రూమ్‌లోంచి.

లోకేశ్వర్ భార్య వేపు చూసేడు.

"అవునండీ! గీజర్ పాడైంది. ఎలక్ట్రీషియన్ యివాళ వచ్చి చూస్తానన్నాడు"

అని భర్తతో చెప్పి 'ఇవాల్టికి చల్లనీళ్లు పోసుకుని త్వరగా బయటకు రా!" అంది వినీల.

"పోనీ గ్యాస్ స్టౌ మీద కాసిన్ని నీళ్లు పడేయాల్సింది!" అన్నాడు లోకేశ్వర్.

"స్టౌ కాళీగా లేదండీ! ఎనిమిది గంటలుదాటింది వంట యింకా సగమైనా అవలేదు. యింకా టిఫెన్ చెయ్యాలి" అంది.

"మమ్మీ, మేం కూడా చల్లనీళ్లే పోసుకోవాలా?" అన్నారు మిగిలిన ముగ్గురు పిల్లలూ.

"అంతేకదా! లేకుంటే స్టోర్‌రూమ్‌లో బోయిలర్ వుంది. బయటకు తీసి వెలిగించుకోండి వేడినీళ్లు కావాల్సిన వాళ్లు" అంది వినీల సౌమ్యంగా.

ఆరోజు సాయంత్రం లోకేశ్వర్, పిల్లలూ ఇంటికి వచ్చి చూసేసరికి వారి యిల్లంతా ఎంతో విశాలంగానూ, కొత్తగానూ కనబడింది. టీవీ, రికార్డ్‌ప్లేయర్, ఎయిర్‌కూలర్స్, వాషింగ్ మిషిన్, గ్రైండర్ వగైరా లేవీ వాటి ప్లేసెస్‌లో లేవు.

స్టోర్‌రూమ్‌లో మూలపడవేసిన బోయిలర్ రుబ్బురోలు, అమాందస్తా లాంటి పరికరాలు బయటకొచ్చేయి.

"మీ మమ్మీ షాక్ ట్రీట్‌మెంట్‌కి బిగ్‌డోస్ తీసుకుందే!" అన్న తండ్రి మాటలకు అంతా ఏడవలేక నవ్వేరు.

**('ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక', ఏప్రిల్ 2001)** ✪

# అర్హత

"ఏయ్ మంజూ! నువ్వింకా లేవలేదూ! యిప్పుడు టైమ్ ఎంతో తెలుసా? తొందరగా లేచివెళ్లి బ్రష్ చేసుకో! ఏవండోయ్! మిమ్మల్నే మీ స్నానానికి వేడి నీళ్లు టవల్ బాత్ రూమ్‌లో పెట్టేను. త్వరగా వెళ్లండి. లేకుంటే నీళ్లు చల్లారిపోతాయి! మంజూ లేచిందో లేదో ఓ మారు చూసి మరీ వెళ్లండి!" అంది యామిని కిచెన్‌లోంచి

భార్య హెచ్చరిక విని ఉలిక్కిపడ్డాడు అరవింద. చేతిలో పేపర్ టీపాయ్ మీద పడవేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్లేడు. కూతుర్ని బలవంతంగా నిద్రలేపి వాష్‌బేసన్ వరకూ నడిపించుకవెళ్లి-

"త్వరగా బ్రష్ చేసుకో నీ స్కూల్‌కి టైమ్ అవుతోంది!" అని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు అరవింద.

"మమ్మీ! నా బ్రష్ కనిపించటం లేదు!"అంది మంజు.

"రేక్‌లోనే వుంటుంది చూడమ్మా! నాకు యివతల పోపు మాడిపోతోంది!"

"చూసేను మమ్మీ! దొరకలేదు!" అంది మంజు బిగ్గరగా.

యామిని చేతిలోపని వదలివచ్చి చూసేసరికి కూతురు వాష్ బేసిన్ ప్రక్కగోడను అనుకొని కళ్లుమూసుకొని నిల్చుని వుంది. కూతుర్ని ఆ పోజులో చూసిన యామినికి నవ్వాగలేదు. రేక్‌లోంచి బ్రష్ తీసి దానిమీద పేస్ట్ వేసి కూతురి బుగ్గతట్టి చేతిలో బ్రష్, టంగ్ క్లీనర్ వుంచింది.

"శుభ్రంగా బ్రష్ చేసుకొనిరా! నీకు హార్లిక్స్ కలుపుతున్నా" అని కిచెన్‌లోకి వెళ్లింది.



అరవింద ఓ కంపెనీలో మేనేజర్‌గా జాబ్ చేస్తున్నాడు. యామిని సైన్స్ టీచర్. మంజుల ఏకైక కుమార్తె. మంజులకు వయసు ఆరు సంవత్సరాలు. రోజా కాన్వెంట్‌లో థర్డ్ క్లాస్ చదువుతోంది. ఎంతో తెలివైన పిల్ల. క్లాస్‌లో ఫస్ట్ ర్యాంకు వస్తోంది.

యామినికి ఉదయంపూట పని ఒత్తిడి చాల ఎక్కువ. రోజు ఉదయం నాలుగు గంటలకు లేచి కాఫీ, టిఫెన్స్, వంటా చేసి లంచ్ బాక్స్‌లు ముగ్గురివీ రడీ చేస్తుంది. ముగ్గరూ ఉదయం ఎనిమిది గంటలకు టిఫిన్ తిని యిల్లు వదిలి మరలా సాయంత్రం ఐదుగంటలకు వస్తారు. రాత్రి వంటపని ముగియగానే యామిని కూతురి చేత హోమ్‌వర్క్ చేయించి చదివిస్తుంది. మర్నాడు క్లాసులో చెప్పబోయే లెసన్స్ ముందుగానే చెప్పి కూతుర్ని ప్రిపేర్ చేసి పంపుతుంది.

అయితే మంజుల ఉదయంపూట ఎంతో బద్ధకంగా వుంటుంది. దాంతో తల్లిని బాగా విసిగిస్తుంది. ఆమెకు స్నానం చేసే వరకూ నిద్రమత్తు వదలదు. అన్నీ చేతికి అందివ్వాలి. తల్లి వెన్నంటి తరిమితే కాని ఏ పనీ చురుకుగా చేయదు.

యామినికి ఎంతో ఓర్పూ, నేర్పూ, సహనం వున్నాయి. ఆమెకు పని ఒత్తిడి

ఎంతవున్నా, కూతురు ఎంత విసిగించినా ఆమె సహనం ఎన్నడూ కోల్పోదు. కూతుర్ని కొట్టడం తిట్టడం, కసరడం వంట పనులు ఎన్నడూ చేయదు. ఆమెకు పిల్లల సైకాలజీ బాగా తెలుసు. ఆ వయస్సు వారిని కొట్టినా తిట్టినా ప్రయోజనం వుండదు. పైగా వారు ఎంతో మొండివారిగా తయారవుతారని ఆమె భావన. పిల్లలను సాధ్యమైనంత వరకూ మంచి మాటలతోనే వారికి ఏ పని చేయవచ్చో ఏ పని చేయకూడదో తెలియ చెప్పాలి.

అంతే కాదు పిల్లలు చేసే ప్రతి చిన్న మంచి పనిని మెచ్చుకోవాలి. దాంతో వారికి ఒక విధమైన సెల్ఫ్ కాన్ఫిడెన్స్ వచ్చి మంచి పనులే చేయాలనే కుతూహలం వారిలో పెరుగుతుంది. వారు చేసే పనులు తల్లిదండ్రులు, యితరులూ మెచ్చుకోవాలనే తాపత్రయం వారికి కల్గుతుంది.

యామిని అభిప్రాయానికి అద్దం పడుతుంది. రోజా కాన్వెంట్ స్కూల్, వూర్లో ఆ స్కూల్ బ్రాంచ్‌లు అరడజనువున్నాయి. క్రమశిక్షణకు ఎంతో విలువనిస్తారు. అందులోపని చేసే వారంతా ట్రైన్డ్ టీచర్స్ అవడం మరొక విశేషం.

ప్రతి క్లాస్‌లోనూ ఫస్ట్ ర్యాంక్ వచ్చిన స్టూడెంట్‌కువారు ఏటా పేరెంట్స్‌డే ఫంక్షన్‌లో బహుమతులిచ్చి ప్రోత్సహిస్తారు. అంతేకాక వారి ఆరు బ్రాంచ్ స్కూల్స్‌లో ఫస్ట్ ర్యాంక్ సాధించిన వారికి కూడ ప్రైజ్‌లు యిస్తున్నారు.

ఎల్.కె.జీ మొదలు యిప్పటి వరకూ మంజులకు ప్రతి యేడూ క్లాస్ ఫస్ట్ ర్యాంక్ బహుమతులు వస్తున్నాయి. మంజుల తల్లిదండ్రులకు అదెంతో గర్వకారణంగా వుంది. మంజులను టీచర్స్, స్టూడెంట్స్‌ఎంతో అభిమానంగా చూస్తారు.

రోజా కాన్వెంట్ స్కూల్లో యీ ఏడు సిటిజన్‌షిప్‌ట్రైనింగ్ అని ప్రతి క్లాసులోనూ ప్రవేశపెట్టేరు. అందులో కూడా ఫస్ట్ ర్యాంక్ స్టూడెంట్‌కి ప్రైజులివ్వాలని నిశ్చయించారు.

పిల్లలకు గుడ్‌హేబిట్స్, చక్కటి క్రమశిక్షణ నేర్పాలని వారి సంకల్పం. అందులో భాగంగా పిల్లలు వేకువనే నిద్రలేచి ఎవరికి వారే తమ తమ పనులు స్వయంగా చేసుకోవడం నేర్పిస్తారు. ఉదయం బ్రష్ చేసుకోవడం, స్నానం చేయడం, నీట్‌గా డ్రస్ వేసుకోవడం. స్కూల్ బ్యాగ్‌లో అవసరమైన బుక్స్, పెన్సిల్, ఇరేజర్ వంటివన్నీ, ఇంకా లంచ్ బాక్స్, వాటర్ బాటిల్, నేప్‌కిన్ అవీ వున్నాయో లేదో స్కూల్‌కి

వెళ్లేముందూ, స్కూల్ నుండి యింటికి తిరిగి వచ్చే ముందూ చెక్ చేసుకోవడం స్కూల్‌కి రెగ్యులర్‌గా టైమ్ ప్రకారం రావడం, హోంవర్క్ కరెక్ట్‌గా చేసి చూపించడం, క్లాసులో పాఠాలు శ్రద్ధగా వినడం, అందరితోనూ స్నేహంగా వుండడం, పెద్దలతో గౌరవంగా మాట్లాడడం వంటివి నేర్పిస్తారు.

అంతేకాదు నీతి సూత్రాలను చిన్న చిన్న జానపద కథల ద్వారా బోధిస్తారు. "నాన్నా!-పులి!" "ఆవూ-పులి!" కథలు చెప్పి ఎప్పుడూ నిజమే చెప్పాలి. అబద్ధం ఆడరాదని, "నాలుగు ఎద్దులూ-సింహం" కథ చెప్పి ఐకమత్యమే బలం అని, "సింహం- చిట్టెలుక" కథ చెప్పి అందరితో స్నేహితంగా వుండాలని యిలా ఒక్కొక్క నీతికి కథలు చెప్పి బోధిస్తున్నారు.

ఆ విధంగా బాల్యంలో కథల ద్వారా నేర్పిన నీతులు వారి మనస్సులో బలంగా నాటుకొని అవి వారి జీవితాంతం గుర్తుంటుంది.

సంవత్సరం పొడుగునా పై విషయాలన్నీ నిశితంగా పరిశీలించి వారి మొత్తం ఆరు యూనిట్స్‌లో ఫస్ట్ వచ్చిన వారికి పేరెంట్స్ డే ఫంక్షన్‌లో ప్రైజ్ యివ్వాలని నిశ్చయించారు.

ఈ విషయం తెలుసుకున్న స్టూడెంట్స్‌లోను, వారి పేరెంట్స్‌లోనూ కాంపిటేషన్ పెరిగింది. ప్రతి వారూ యీ ప్రైజ్ తమ బిడ్డకే రావాలని పిల్లలకు యింటివద్ద ట్రైనింగ్ యివ్వడం మొదలుపెట్టేరు. దాంతో పిల్లలో చురుకుతనం, ఉత్సాహం, నీట్‌నెస్ వగైరా ద్విగుణీకృతమైంది.

అందరూ ఎదురుచూస్తున్న ఆ శుభదినం పేరెంట్స్ డే రానే వచ్చింది. రోజా కాన్వెంట్ మెయిన్ బ్రాంచ్ స్కూల్ ఆవరణలో ఫంక్షన్ ఏర్పాటు చేసారు. టీచర్స్, స్టూడెంట్స్, వారి పేరెంట్స్, పురప్రముఖులూ ఫంక్షన్‌కి వచ్చారు.

అరవింద, యామిని కూతురు మంజులను తీసికొని వచ్చారు.

వేదికమీద సంస్థ మేనేజింగ్ డైరెక్టర్, ప్రిన్సిపాల్, ఆరు బ్రాంచ్‌ల హెడ్ మాస్టర్స్ వున్నారు.

పలువురి ప్రసంగాల అనంతరం ప్రైజ్ డిస్ట్రిబ్యూషన్ కార్యక్రమం మొదలైంది. పిల్లలూ పెద్దలూ అందరూ ఎంతో ఆతృతతో ఎదురు చూస్తున్న కార్యక్రమం అదే!

థర్డ్ క్లాస్‌లో ఫస్ట్ ర్యాంక్ ప్రైజ్, ఆరు యూనిట్స్‌లో ఎక్కువ మార్కులు వచ్చి ఫస్ట్ ర్యాంక్ ప్రైజ్‌లు రెండు మంజులకే వచ్చాయి. మంజుల వేదిక మీదకు వెళ్లి రెండు ప్రైజులూ తీసుకొని వచ్చింది.

ఎమ్.డి. గారు మైక్ ముందుకు వచ్చి "పిల్లలలో మంచి ప్రవర్తన, గుడ్ హేబిట్స్ పెంపొందించాలని సిటిజన్‌షిప్ ట్రైనింగ్ మా విద్యా సంస్థలలో యీ యేడు నూతనంగా ప్రవేశపెట్టాము. గుడ్ హేబిట్స్‌లో టాప్ ర్యాంక్ సాధించిన స్టూడెంట్ 'మంజుల' థర్డ్‌క్లాస్ విద్యార్థిని" అన్నారు. మంజులకు ప్రైజ్ రావడం అందరూ హర్షించారు

మంజుల నెమ్మదిగా అడుగులు వేస్తూ వేదిక మీదకు వెళ్లి ఎమ్.డి. గారి ఎదుట నిల్చుంది. ఆయన ప్రైజ్ అందివ్వబోయారు. కాని మంజుల ప్రైజ్ అందుకోలేదు. ఏమో చెప్పబోయింది.

ఎమ్.డీ. గారు అందరినీ నిశ్శబ్దంగా వుండమని మైక్ మంజుల ముందుంచారు.

"చెప్పమ్మా భయంలేదు!" అన్నారు.

"నాకు గుడ్ హేబిట్స్ ఏమీలేవండీ! అన్నీ బ్యాడ్ హేబిట్సే! ఉదయాన్నే తొందరగా నిద్రలేవను. బ్రష్ చేసుకునేందుకు అన్నీ మమ్మీ అందివ్వాలి! మమ్మీ నాకు స్నానం చేయించాలి. డ్రస్ వెయ్యాలి, నా స్కూల్ బ్యాగ్ రడీ చెయ్యాలి. నా చేత హోమ్ వర్క్ చేయించి చదివించాలి! మా మమ్మీని రోజూ విసిగిస్తాను. నా వెంటపడి తరిమితేకాని నేను ఏ పనీ చురుకుగా చెయ్యను. నిజం చెప్పాలని మాకు సిటిజన్‌షిప్ క్లాసులో చెప్పారు. అందుకే నేను నిజం చెప్పాను" అన్న మంజుల మాటలకు అందరూ నిర్ఘాంతపోయారు.

**(తెలుగు విద్యార్థి, ఏప్రిల్ 2001)** ✪

# కావమ్మగారి కంటి ఆపరేషన్ !

"కంట్లో చిన్న నలుసు పడితే చాలు బాధతో విలవిల్లాడిపోతామే! అట్లాంటిది కత్తులతో ఆపరేషన్ చేసి సూదులతో కుడితే ఇక ఆ బాధ భరించగలమా!" అన్నారు కావమ్మగారు దిగులుతో.

"ఏంటి నాన్నమ్మా! నువ్వు ప్రతీ చిన్న విషయాన్ని ఎంతో ఎగ్జాజిరేట్ చేసి చెప్తావు! డాక్టర్లంతా తెలివి తక్కువవాళ్లా లేక పేషెంట్లు వెర్రివాళ్ళా! నొప్పి ఏమాత్రం తెలియకుండా వుండాలని ముందుగా మత్తుమందు ఇంజక్షన్‌చేసి ఆ తరువాతే ఆపరేషన్ చేస్తారు తెలుసా?" అంది అవంతి.

"మత్తు మందు ప్రభావం ఎంత సేపుంటుందే! వాళ్ళ ఆపరేషన్ అయేంత వరకే కదా? తరువాత బాధ అనుభవించేది ఎవరు? అయినా నాకు తెలియక. అడుగుతున్నాను! ఆపరేషన్ తప్ప వేరే మార్గం లేదా? మందులు లేవా? అనిల్ అన్ని లక్షలు ఖర్చుచేసి అమెరికాలో అయిదు ఏళ్లు డాక్టరీ చదివేడు కదా! ఆ మాత్రం ఆపరేషన్ లేకుండా కాస్తంత మందిచ్చి తగ్గించలేడా? విడ్డూరం కాపోతే!"

"ఆపరేషన్ దేనికి అవసరమో, దేనికి కాదో నిర్ణయించవలసింది డాక్టరు! నువ్వా నేనూ కాదు! అదీకాక కేటరాక్ట్ ఆపరేషన్ చాలా సింపుల్ ఆపరేషన్! రెండు నిమిషాల పని! కంట్లో ఏర్పడ్డ పొరను తీసివేస్తారు! అన్నయ్య ఈ విషయాలన్నీ చిలక్కి చెప్పినట్టు చెప్పాడు. వాడు ఎదురుగా వున్నంత వరకూ "బాబీ! బాబీ!" అని ఇచ్చకాలు ఆడుతావు! అన్నయ్య అవతలకు వెళ్ళగానే మమ్మల్ని వేధిస్తావు!" అంది అవంతి.



"పెద్దావిడతో ఏమిటే ఆ గొడవ! అత్తయ్యా! అనిల్‌కి నేను చెబుతాను. మీరేమీ వర్రీ అవకండి!" అంది మహేశ్వరి అత్తగారితో.

"అదీ! నువ్వు కాస్త గట్టిగా చెప్పుతల్లీ వాడికి! నామాట వాడు అసలు వినిపించుకోవడం లేదు! ఈ కాలం డాక్టర్లు ప్రతీచిన్న దానికీ ఆపరేషన్లు అంటున్నారు! నువ్వూ చూస్తున్నావుకదా! మొన్నటికి మొన్న ఎదురింటి వారమ్మాయికి కాన్పు నొప్పులు ప్రారంభం అవగానే నర్సింగ్ హోమ్‌కి తీసుకుని వెడితే వెంటనే పొట్టకోసి బిడ్డను బయటకు తీసేరు! అంతేకాని సజావుగా కాన్పు అవనిచ్చేరా? పాపం ఆ అమ్మాయి కూర్చోలేక, పడుకోలేక ఎంత బాధపడుతోందో!"

అత్తగారి అమాయకత్వానికి నవ్వుకుంది మహేశ్వరి. 'ఎదురింటి వారమ్మాయికి కడుపులో బిడ్డ అడ్డం పడిన విషయం ఆవిడకు తెలియదు! చెప్పినా అర్థం చేసుకోదు!'

అనుకుంది మహేశ్వరి.

కావమ్మగారి వయస్సు 70 సంవత్సరాలు. మంచి దృఢకాయం. ఇంత వరకూ ఆవిడ ఎన్నడూ ఇంజక్షన్ కూడా చేయించుకోలేదు. ఆవిడకు ఒక పన్ను కూడా కదలలేదు. ఆరోగ్య సూత్రాలు చక్కగా పాటిస్తారు.

ఆవిడ మనవడు అనిల్ మంచి పేరున్న కంటి డాక్టర్. అమెరికాలో అయిదు సంవత్సరాలు కంటి జబ్బులు నయం చేయడంలో స్పెషలైజ్‌చేసి వచ్చేడు. 20 బెడ్స్ వున్న నర్సింగ్ హోమ్ కట్టించేడు. అందులో ఆధునిక పరికరాలన్నీ సమకూర్చేడు. నలుగురు అసిస్టెంట్స్‌ను వేసుకుని అన్ని రకాల కంటి జబ్బులూ ట్రీట్‌చేసి నయం చేస్తున్నాడు.

కావమ్మగారికి ఈ మధ్య ఎడం కన్ను సరిగా కనిపించడం లేదు. చూపు మందగించిన విషయం మనవడికి చెప్పి "కంట్లోకి చుక్కల మందేదైనా ఇమ్మని" అడిగేరు.

అనిల్ ఆవిడ కళ్ళు టెస్ట్ చేసి 'కేటరాక్ట్ వుంది! అది చుక్కల మందు వల్ల నయం కాదు! ఆపరేషన్ చేస్తాను" అన్నాడు.

"ఆపరేషన్ అన్న మాట వినగానే ఆవిడకు భయం కలిగి ఇక ఇంట్లో అందరినీ వేధిస్తోంది" అని తెలుసుకున్న అనిల్ ఆవిడ భయం పోగొట్టడానికి కేటరాక్ట్ ఆపరేషన్ ప్రక్రియంతా విడియో టేప్ ద్వారా లోగడ తీసినది ఆవిడకు చూపించి ధైర్యం చెప్పేడు.

వీడియో చూసిన తరువాత ఆవిడకు మరొక విధమైన భయం పట్టుకుంది. ఆపరేషన్ చేసే పేషెంట్‌కి హాస్పటల్ డ్రస్సు వేసి మత్తు మందు ఇంజక్షన్ ఇవ్వడం, ఆపరేషన్ చేయవలసిన కన్ను చుట్టూ మార్క్ చేసి రెండో కంటికీ, ముఖానికీ ముసుగు వేసి ఆపరేషన్ థియేటర్‌లోకి పంపడం ఆవిడకు నచ్చలేదు.

"ఉరికంబం ఎక్కించేవాడికి మల్లే ముసుగు వెయ్యడం ఏమిటి? నేను నిద్రపోయే సమయంలో కూడా ముఖంమీంచి కప్పుకోను! అలా కప్పుకుంటే నాకు ఊపిరాడదు. నేనసలు ఆపరేషన్ యించుకోను" అన్నారు.

"కేటరాక్ట్ ఆపరేషన్ చాలా చిన్నది! చేయించుకోకుంటే గుడ్డితనం వచ్చి ఎంతో

బాధపడాలి! మరే భయం లేదు  చేయించుకో''మని ఆమెకు ఇంట్లో వారంతా నచ్చచెప్పేరు.

"అయితే నాకు ముసుగు వెయ్యకూడదు. కంటి చుట్టూ మార్కు వేయకూడదు. ఆపరేషన్ అయిన వెంటనే ఇంటికి వచ్చేస్తాను. హాస్పిటల్ దుస్తులు వేసుకోను. ముఖ్యంగా నాకు కంటి ఆపరేషన్ పెద్ద డాక్టర్ (వయస్సులో పెద్దాయన) చేత మాత్రమే చేయించాలి!'' అని షరతులు పెట్టేరు.

భాస్కరానికి తల్లి ఆవేదన అర్థమైంది. "నిన్న మొన్నటి వరకూ ఆమె అడ్డాలలో పెరిగిన బిడ్డ నేడు ఊర్లో పేరు మోసిన డాక్టర్ అన్న విషయం ఆవిడ నమ్మలేక పోతోంది!''అనుకున్నాడు.

ఆవిడ ఆపరేషన్ చేయించుకునేందుకు అంగీకరించడమే చాలు! ఎన్ని షరతులు విధించినా వాటన్నిటిని ఒప్పుకున్నాడు భాస్కరం.

డాక్టర్ భీమశంకరంగారి వయస్సు 50 సంవత్సరాలు. ఆయన గవర్నమెంట్ హాస్పిటల్లో సర్జన్. మనిషి ఎంతో నెమ్మదస్తుడు. హస్తవాసి మంచిది. భాస్కరం ఆయనతో తన తల్లి కంటి ఆపరేషన్ విషయం మాట్లాడేడు.

"అదేమిటండీ! మీ అబ్బాయి డాక్టర్ అనిల్ ఊర్లో మంచి పేరున్న ఐ స్పెషలిస్ట్! ఫారిన్ రిటన్డ్! పైగా అతని నర్సింగ్ హోమ్‌లో లేటెస్ట్ ఎక్విప్‌మెంట్స్ అన్నీ వున్నాయి! అట్లాంటిది మీ మదర్‌కి అతి సింపుల్ కేటరాక్ట్ ఆపరేషన్ నేను చేయడమేంటి? అయినా అందుకు మీ అబ్బాయి అంగీకరించాలి కదా! అతనిని అవమానించినట్టవుతుంది'' అన్నారు భీమశంకరంగారు.

"మా అబ్బాయికి నేను నచ్చచెప్పి ఒప్పిస్తాను. అంతే కాదు వాడిచేత మీకు ఫోన్ చేయిస్తాను.

మీలాంటి అనుభవజ్ఞులు ప్రక్కన వుంటే చాలు మా అమ్మగారికి కాస్త ధైర్యంగా వుంటుంది! కాదనకండి ప్లీజ్!'' అని రిక్వెస్ట్ చేసేడు  భాస్కరం.

డాక్టర్ భీమశంకరంగారు ఇక కాదనలేక పోయారు. కావమ్మగారికి కంటి ఆపరేషన్  అనిల్ నర్సింగ్‌హోమ్‌లో డాక్టర్ భీమశంకరం గారు చెయ్యడానికి అంగీకరించిన విషయం భాస్కరం కొడుకుకు చెప్పి సమాధానపరిచేడు.

డాక్టర్ అనిల్ పెద్ద మనసుతో ఆవిడ భయం అర్థం చేసుకుని నాయనమ్మకు ఎన్నో విధాల ధైర్యం చెప్పి "ఆవిడ కోరిన విధంగా, ఆవిడకు నచ్చిన రీతిలో కంటి ఆపరేషన్ చేయించి వెంటనే ఇంటికి తీసుకుని వచ్చేస్తా" నని చెప్పేడు.

ఆపరేషన్ డేట్ ఫిక్స్ చేసి ఆ రోజు ఉదయాన్నే ఆవిడను తన కార్లో నర్సింగ్ హోమ్‌కి తీసుకుని వెళ్ళేడు అనిల్. కూడా ఆవిడ కొడుకూ, కోడలూ వెళ్ళారు.

మనవడి నర్సింగ్ హోమ్ చూడడం అదే ప్రథమం. అంతకుముందు ఎన్ని పర్యాయాలు పిలిచినా ఆవిడ చూడడానికి వెళ్ళలేదు. ఆ నర్సింగ్ హోమ్ కట్టడానికి కావమ్మగారు ఆవిడకు పుట్టింటి వారు పెట్టిన నగలూ, కోనసీమలో నాలుగు ఎకరాల కొబ్బరితోట అమ్మి సొమ్ము మనవడికిచ్చేరు.

నర్సింగ్ హోమ్ వద్ద వున్న సుమారు వందమంది జనాన్ని చూసి ఆవిడ ఆశ్చర్యపోయేరు.

"ఏవిట్రా బాబీ! ఇంత మంది జనం వున్నారు!" అన్నారు.

"వాళ్ళందరూ కళ్ళు టెస్ట్ చేయించుకుందికి వచ్చిన వాళ్ళు నాన్నమ్మా! అన్నాడు అనిల్.

ఆవిడను లోనికి తీసుకుని వెళ్ళి ప్రిపేర్ చెయ్యమన్నాడు అనిల్. డాక్టర్ భీమశంకరంగారికి ఆ రోజు ఉదయం గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఇన్స్‌పెక్షన్ వుండి రావడం కుదరదని అనిల్‌కి ఫోన్ చేశారు. అయితే అనిల్ ఆ విషయం ఆవిడకు చెప్పలేదు. ""ఆయన ఆపరేషన్ థియేటర్లో వున్నారని" చెప్పేడు.

కావమ్మగారిని రెడీ చేసి ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకుని వెళ్ళేరు.

అనిల్ థియేటర్‌లో అడుగు పెట్టే సరికి "లోగడ కళ్ళు డొనేట్ చేస్తానన్న వ్యక్తి మరణించేడని అతని కళ్ళు వెంటనే వచ్చి కలెక్ట్ చేసుకోమని" కబురు వచ్చింది.

"మీరు వెళ్ళి ఆపని చూడండి సార్! మేము మీ నాయనమ్మగారి ఆపరేషన్ వర్క్ చూస్తామని" అతని అసిస్టెంట్స్ అనిల్‌ని పంపించేరు.

వారు కావమ్మగారికి కంటి ఆపరేషన్ చేసి ఇంటికి పంపించి వేశారు. ఆవిడ ఇంటికి వచ్చేక ఒక గంటలో స్థిమితపడ్డారు.

"చూసేవా నాన్నమ్మా! ఇంత చిన్న విషయానికి నువ్వెంతో భయపడిపోయి నానా రభసా చేసేవు! అవునూ నీకు కేటరాక్ట్ వున్నది. ఎడం కన్ను కదా! మరి నీ కుడి కంటికి బేండేజి వేసుందేమిటి! అంది అవంతి.

కావమ్మగారు కుడి కంటి బేండేజీని తడువుకుని గొల్లుమన్నారు!.

('సుప్రభాతం వీక్లీ' 21 ఏప్రిల్ 2001) ✪

# బుద్ధావతారం

"నే చెప్పలేదూ! రాఘవమ్మ ఎంతో అదృష్టవంతురాలని. ఈ టైమ్‌లో ఎంత తీరుబడిగా కూర్చుందో చూడు" అంది కామేశ్వరమ్మ.

"కాదా మరి. చేస్తున్న పూజలు, వ్రతాలు, దానధర్మాలు ఊరకనేపోవు. అందుకే ఆవిడకు ఉత్తమురాలైన కోడలు వచ్చింది. అత్తగారిని కూర్చోబెట్టి చక్కగా సేవలు చేస్తోంది" అంది సుందరలక్ష్మి నవ్వుతూ.

"ఏమిటి ఉదయాన్నే నామీద దండయాత్రా?"

"దండయాత్ర కాదు వదినా. ఉన్నమాటే అనుకుంటున్నాం. ఈ వేళప్పుడు నువ్వు పనుల వత్తిడితో బిజీగా వుంటావేంటో అని సుందరలక్ష్మి అంటే అదేంలేదు అన్నాను" అంది కామేశ్వరమ్మ.

"ఏం చేయను. మా కాదంబరి నన్ను ఏ పనీ ముట్టుకోనీయదు. చేసినన్నాళ్ళూ చేసారు ఇక హాయిగా విశ్రాంతి తీసుకోమంది" అంది రాఘవమ్మ.

"అంతటి అదృష్టం అందరికీ వస్తుందా వదినా, నాకూ ముగ్గురు కోడళ్ళున్నారు. ఏం లాభం. వారికి కూడా చాకిరీ నేనే చేయాలి. వారు ఒక్క పనికూడా చేయరు" అంది కామేశ్వరమ్మ కాస్త విచారంగా.

రాఘవమ్మ, కామేశ్వరమ్మ, సుందరలక్ష్మి మంచి ఫ్రెండ్స్. ముగ్గురూ ఒకే వయస్సువారు. ఒకే వీధివారు. తరచూ కలుసుకుని ఒకరి కష్టసుఖాలు మరొకరికి చెప్పుకుంటుంటారు. వారు ముగ్గురూ మధ్యతరగతి కుటుంబీకులే.

"మరేం లేదు వదినా, మా తమ్ముడు ఎల్‌టీసీ మీద తిరుపతి,కంచి, కాళహస్తి,



మధుర, రామేశ్వరం వగైరా దక్షిణ దేశయాత్రలకు వెళ్తున్నాడు. చార్జీలు కట్టి తీసుకెళ్తాను. నన్నూ రమ్మంటున్నాడు. రేపే ప్రయాణం!''

''అలాగా! మరి చెప్పవేం. చాలా సంతోషం. మంచి అవకాశం. ఆలోచించకుండా బయల్దేరు. అంది రాఘవమ్మ.

''అదికాదు వదినా, వాడైతే ఛార్జీలు కట్టి తీసుకెళ్తాడు సరే కానీ దైవదర్శనం చేసుకుంటూ హారతి పళ్ళెంలో వెయ్యడానికి నా దగ్గర పైసా కూడా లేదు. దైవసన్నిధికి ఉత్తచేతులతో వెళ్ళలేం కదా. దానికి కూడా మా తమ్ముడినే డబ్బులిమ్మనడం

బాగుండదు. మా పెద్దాడిని అడిగితే నెలాఖరు నా దగ్గరేం లేదన్నాడు. చిన్నాడికి ఉత్తరం రాసి డబ్బు తెప్పించుకుందుకు టైమ్‌లేదు. అందుకని నాకో మూడువందలు సర్దుబాటు చెయ్యగలవా? తిరుగు ప్రయాణంలో మా చిన్నాడిని అడిగి తెచ్చి ఇచ్చేస్తాను' ' అంది ఎంతో మొహమాటంతో సుందరలక్ష్మి.

రాఘవమ్మ గొప్ప ఇరకాటంలో పడింది. సహాయం కోరిన వారికి ఎన్నడూ లేదని చెప్పలేదు. తనకు కలిగిన దాంట్లో ఇరుగుపొరుగు వారికి సహాయపడుతుంది. అయితే ప్రస్తుతం ఆవిడ పరిస్థితి వేరుగావుంది. దానధర్మాలకు, పూజలు వ్రతాలకు ఆవిడ ఎప్పుడూ తన సొంతసొమ్మే ఉపయోగిస్తుంది. ఆవిడకు విజయనగరంలో కన్నవారు ఇచ్చిన ఇల్లు వుంది. ఆ ఇంటి అద్దె ఆవిడకు నెలకు నాలుగువందలు వస్తుంది. ఆ సొమ్ము ఆవిడ ఇంటి ఖర్చులకు వినియోగించనవసరంలేదు. కొడుకు గౌతమ్‌కు వచ్చేజీతం ఇంటిఖర్చులకు సరిపోగా రెండువేల వరకూ మిగులుతుంది.

ప్రతినెలా మొదటివారంలోనే వచ్చే మనియార్డరు గత ఆరుమాసాలుగా రావడంలేదు. కారణం తెలియదు. రెండు మూడు నెలలు ఇంటి అద్దె వారు ఏవో ఇబ్బందుల్లో వుండి పంపలేకపోయారని సరిపెట్టుకుని విషయం తెల్సుకుని రమ్మని కొడుకుని పంపించింది. గౌతమ్ విజయనగరం వెళ్లి వచ్చి-

"అమ్మా! వాళ్ళు చాలా ఇబ్బందుల్లో వున్నారు. వచ్చే నెలలో అద్దె అంతా ఒకేమారు పంపిస్తామన్నారు" అని చెప్పాడు.

"నీకు అంతగా డబ్బవసరమైతే చెప్పమ్మా" అన్నాడు.

"ఇప్పుడు నాకేమీ అవసరం లేదురా! నా దగ్గర వుంది" అంది.

అయితే అటు తరువాత మరో మూడు నెలలు గడిచినా వారు ఇంటి అద్దె పంపలేదు. ప్రస్తుతం ఆవిడ దగ్గర పాతిక రూపాయలకంటే ఎక్కువలేవు. కోడలు కాదంబరి ఇంటి పనులు చేపట్టాక కొడుకు జీతం ఆమెకే ఇవ్వమంది. ఇక ఈ విషయంలో కోడలిని అడగడానికి అభిమానం అడ్డు.

వారి సంభాషణంతా విన్న కాదంబరి అత్తగారి పరిస్థితి అర్థం చేసుకుని వారివద్దకు వచ్చింది.

"అత్తయ్యా! ఇవిగో మూడువందలు. వారికివ్వండి" అంది.

రాఘవమ్మ కాస్త తటపటాయించి "నీ చేత్తోనే ఇవ్వ" అంది.

కాదంబరి చేతిలో సొమ్ము అందుకుంది సుందరలక్ష్మి ఆనందంగా.

"నేతిరిగొచ్చిన వెంటనే..."

"ఫర్వాలేదు పిన్నిగారూ. మీరు సంతోషంగా యాత్రలు చేసుకుని రండి. మీకు వీలైనప్పుడు ఇవ్వండి" అంది కాదంబరి.

వారి ముందు తన పరువు కాపాడినందుకు కోడలిని మనసులోనే ఎంతో మెచ్చుకొంది రాఘవమ్మ.

సుందరలక్ష్మి రాఘవమ్మను, ఆమె కోడలిని పలుమార్లు మెచ్చుకుని కామేశ్వరమ్మతో వెళ్లిపోయింది.

"సుందరలక్ష్మి ఎంతో మొహమాటస్తురాలమ్మా. సాధారణంగా ఎవరినీ ఏమీ అడగదు" అంది రాఘవమ్మ కాస్త గిల్టీగా.

"అవునత్తయ్యా. ఆవిడ అభిమానవంతురాలు. అయినా దైవకార్యానికి కాస్త సహాయపడడం మంచిదే కదా. మనం ఇచ్చినది అప్పుగానే కదా!"

"అంతలా ఆలోచించేవారు ఎందరున్నారమ్మా ఈ రోజుల్లో? సినిమాలూ, షికార్లకైతే వందలూ, వేలు వెనుకా ముందు చూడకుండా ఖర్చు చేస్తారుగానీ దానధర్మాలకైతే పైసా వెచ్చించరు. ఏమిటో ఆరునెలలై ఇంటి అద్దె సొమ్ము రావడంలేదు. నా చేతులు విరగ్గొట్టినట్లుంది. పైసా పరకా కాదు. రెండువేల నాలుగువందలు రావాలి. గత పదేళ్లుగా వుంటున్నారని జాలిపడి అద్దెకూడా పెంచలేదు. అయినా వారికా విశ్వాసముందా? ఇంకెవరికిచ్చినా అద్దె ఎనిమిదివందలు వస్తుంది. ఉత్తరాలతో పని జరగదని అబ్బాయిని కూడా ఒక పర్యాయం పంపాను. వాడుత్త అమాయకుడు, నెమ్మదస్తుడు అవడంవల్ల వాళ్లేవో కుంటిసాకులు చెప్పి వీడిని వెనక్కి పంపివేసారు. పోనీ నేవెళ్లి వసూలు చేసుకుని వద్దామనుకుంటే డాక్టరుగారు లోబీపీ వుంది. అది పూర్తిగా కంట్రోల్ అయ్యేవరకూ ప్రయాణాలు వద్దన్నారు" అంది దిగులుగా.

"అత్తయ్య! మీరేం వర్రీ అవకండి. విజయనగరం వెళ్లిరావడం ఎంతసేపు? గంట ప్రయాణం. ప్రతీ అరగంటకి బస్సుంది. రేపు నేవెళ్లి వసూలు చేసుకొస్తాను.

ఉదయం మీ అబ్బాయి పదిగంటలకు భోజనం చేసి ఆఫీసుకి వెళ్లగానే నేబయల్దేరి వెళ్లి అద్దె వసూలు చేసుకుని సాయంత్రం ఐదుగంటలలోపే తిరిగి వచ్చేయ గలను" అంది కాదంబరి నమ్మకంగా.

కోడలిని ఒంటరిగా పంపడానికి రాఘవమ్మ కాస్సేపు తటపటాయించి చివరకు అంగీకరించింది. ఈ పని ఆమె కొడుకువల్ల అవదు. గౌతమ్ చాలా నెమ్మదస్తుడు. కాస్త భయస్తుడు. ఎవరినీ ఎదిరించి మాట్లాడలేడు. చదువుకునే రోజుల్లో అతడ్ని తోటిపిల్లలందరూ బుద్ధావతారం అని గేలిచేసేవారు.

రాఘవమ్మ మర్నాడు కోడలికి విజయనగరంలో తన ఇంటి గుర్తులు చెప్పి చిరునామా ఇచ్చి పంపించింది. కాదంబరి అత్తగారు చెప్పిన చోట కోటవద్ద బస్సు దిగింది. ఎదురుగావున్న బొంకులదిబ్బవేపు నాలుగు అడుగులు వేసింది. అంతలో ఎదురుగా వస్తున్నామె "మీరు...ఏయ్ కాదంబరీ" అని వాటేసుకుంది.

"ఏమిటే అలా చూస్తున్నావు? నన్ను గుర్తుపట్టలేదా? నీరజనే!"

"నువ్వా నీరజా!" అంది కాదంబరి ఆనందంతో.

"నువ్వీ ఊర్లోనే వుంటున్నావా?"

"లేదే. వైజాగ్‌లో వుంటున్నా. ఇప్పుడే బస్సు దిగాను".

"మరి నీ సామాన్లు?"

"అదేం తీసుకురాలేదు. ఈ ఊరికి చిన్ని పనిమీద వచ్చాను. పని చూసుకుని వెంటనే వెళ్ళిపోవాలి.

"ఇంటికి వెళ్లి మాట్లాడుకుందాం పదవే. దగ్గరలోనే మా ఇల్లు వుంది" అని అరడజను సందులు తిప్పి ఓ ఇంటి ముందాగి "ఇదే మా ఇల్లు" అని తలుపు తాళం తీసి లోనికి తీసుకెళ్లింది స్నేహితురాల్ని నీరజ.

"ఒంటరిగా వుంటున్నావా?"

"కాదే జంటగానే! నేనూ నా పదినెలల కొడుకు అరుణ్" అంది పేలవంగా నవ్వి.

"అవునూ ఏమిటే ఈ ఘోరం! మళ్ళీ ఇన్నేళ్ళ తరువాత ఈ పరిస్థితిలో నిన్ను

చూడడం ఎంతో బాధగా వుందే! ఎలా జరిగిందే" కాదంబరికి దుఃఖంతో నోట మాట రాలేదు.

"అమ్మా నాన్న పోయిన తరువాత మా మావయ్యే నన్ను చేరదీసిన సంగతి నీకు తెలుసుకదా. మీరు రాజమండ్రి వెళ్లిపోయిన రెండు రోజులకు మా మావయ్యకు ఈ ఊర్లో పార్ట్‌టైమ్ మ్యూజిక్ టీచర్‌గా జాబ్ వచ్చింది. వెంటనే మేము ఈ ఊరు వచ్చేసాం. తనకున్నది చాలక అప్పుచేసి నా పెళ్లిజరిపించాడు మావయ్య. నేను నాలుగో నెల గర్భవతిగా వుండగా మా వారు సడెన్‌గా పోయారు. మళ్ళీ నేను మావయ్య పంచనే చేరాను. మావయ్య కూడా మూడు నెలల క్రితం జబ్బుచేసి పోయారు. అయితే నేను మావయ్యవద్ద నేర్చుకున్న సంగీతం నన్ను ఆదుకుంది. పదిమంది పిల్లలకు ట్యూషన్ చెబుతున్నా. మిషన్ వుంది కదా జాకెట్స్, లంగాలు, గౌన్లు కుడుతున్నాను"

"అమ్మాయ్ వచ్చావా!" అంటూ ఓ ఆవిడ పిల్లాడిని చంకన వేసుకుని వచ్చింది.

"రా పిన్నీ. ఈవిడ సావిత్రమ్మగారు. పొరుగింట్లో వుంటున్నారు. ఈమె నా చిన్ననాటి స్నేహితురాలు కాదంబరి. వీడు నా సుపుత్రుడు" అంటూ పరిచయం చేసింది.

"ఏవమ్మా బాగున్నావా? ఎప్పుడొచ్చావ్? మా నీరజ నిన్నూ, మీ అమ్మగారినీ తలవని రోజుండదు. మీ అమ్మగారి మమత, ఆప్యాయతల గురించి పలుమార్లు చెప్పింది. పాపం నీరజకు కష్టాలన్నీ ఒకేమారు వచ్చాయి"

"నాకూ ఇప్పుడే తెలిసిందండీ. మేం కలుసుకుని పదేళ్ళయింది"

"అమ్మాయిా మీరూ మాట్లాడుకుంటూ వుండండి. నేవెళ్లి పిడికెడు బియ్యం అత్తెసరు పెడతాను" అంది సావిత్రమ్మ.

"వద్దండీ. నేను భోజనం చేసే వచ్చాను" అంది కాదంబరి.

కాదంబరికి ఇల్లంతా చూపించింది. నీరజ. అది పాత కాలపు రెండు గదుల డాబా ఇల్లు. కిచెన్, బాత్రూమ్‌లు వున్నాయి. ముందూ వెనుకా కొద్దిగా ఖాళీ జాగా వుంది. పెరట్లో బావి, కొబ్బరి, మామిడి మొక్కలున్నాయి. కూరకాయ పాదులున్నాయి. ఇంట్లో విలువైన సామాన్లు లేక పోయినా వున్న సామాన్లు నీట్‌గా అమర్చబడి వున్నాయి.

"ఇల్లు ఇండిపెండెంట్‌గా వుండి చాలా బాగుందే" అంది కాదంబరి.

"సొంతిల్లు అనుకునేవ్. అద్దె కంపే బాబూ. పదేళ్ళయి ఇందులోనే వుంటున్నాం. సావిత్రమ్మగారే మాకు చవగ్గా అద్దెకిప్పించారు. ఓనర్స్ విశాఖలో వుంటున్నారు. చాలా మంచివారు. పదేళ్ళయి అద్దె పెంచలేదు. మేము దీనికి నాలుగువందలే ఇస్తున్నాం. మేము ఖాళీ చేస్తే దీనికిప్పుడు వెయ్యి రూపాయలపైనే రెంట్ వస్తుంది తెలుసా? అంతేకాదే ఆరుమాసాల అద్దె బాకీ!" అంది పేలవంగా నవ్వి.

"అదేమిటే! ఇంటి గలవాళ్ళూరుకున్నారా?"

"మావయ్యకు జబ్బుచేసి మూడు నెలల రెంట్ పంపలేకపోయాం. విషయమేంటో తెలియక ఓనర్‌గారి కొడకు ఓ రోజు ఉదయమే వచ్చాడు. అతను రావడానికి గంటముందే మా మావయ్య కన్నుమూసారు. చేతిలో పైసా లేదు. ఆ సమయంలో అతను తోబుట్టువులా నన్నాదుకున్నారు. నాకు ఎంతో ధైర్యం చెప్పి ఓదార్చారు. మావయ్య అంత్యక్రియలు జరిపించాడు. నాకు మిగిలిన ఆస్తి ఈ కుట్టుమిషన్. అది అమ్మివేసి డబ్బు ఇచ్చేస్తానన్నాను. అతను అంగీకరించలేదు.

"చెల్లెమ్మా! నాకు తోబుట్టువులులేరు. నన్ను నీ అన్నగా భావించు. అద్దె విషయం ఇకమీదట ఆలోచించకు. అమ్మకు నేను సర్దిచెబుతానని" ఓదార్చి భరోసా ఇచ్చి వెళ్లాడు. కష్ట సమయంలో వచ్చి ఆదుకున్న ఆ పుణ్యాత్ముడు గౌతమ్ రుణం ఎన్ని జన్మలకైనా తీరదు" అంది నీరజ చేతులు జోడించి.

నీరజమాటలకు కాదంబరి మేను పులకించింది.

"తన భర్త చేతకాని శుద్ధ బుద్ధావతారం కాదు, కష్టాల్లో ఇతరులను ఆదుకునే కరుణారస హృదయుడైన గౌతమ బుద్ధావతారం" అని మనస్సులోనే ఎంతో మెచ్చుకుంది.

**(ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక, మే 2001)** ✪

# కాశీపట్నం చూడరబాబు

"మహాదేవమ్మ గొప్ప తపస్విని దైవసాక్షాత్కారం పొందిన పుణ్యచరిత! పరుల కష్టసుఖాలలో పాలుపంచుకొని వారికి తరుణోపాయం సూచించగల ప్రాజ్ఞి!" అని ప్రజల నమ్మిక.

"ప్రజలలో దైవభక్తిని పెంపొందింపచేయాలన్నదే ఆమె ఆశయం! ఆమెకు స్వార్థ చింతన ఏమాత్రం లేదు. ఎల్లవేళలా ఇతరుల బాగోగుల కొరకు తపించే మనిషి!" అని ఆమె భక్తులు ప్రచారం చేస్తున్నారు.

"ఎవరి ఇష్టదేవతను వారు నిర్మల మనస్సుతోనూ, నిశ్చలభక్తితోనూ ఆరాధిస్తే వారు దైవానుగ్రహం పొందుతారు. అంతేకాదు దైవసాక్షాత్కారం తప్పక లభిస్తుంది" అని మహాదేవమ్మ ప్రబోధిస్తుంది.

ఆమె బోధనలలో గురికుదిరి ఆమె ఆదేశానుసారం నిశ్చల భక్తితో తమ ఇష్టదైవాన్ని ఆరాధించి సాక్షాత్కరింపచేసుకున్నవారున్నారు. దేశంలో పలు ప్రాంతాలలో ఆమె భక్తులున్నారు.

మహాదేవమ్మ వయసు 50 సంవత్సరాలు. ఆమెకు తెలుగు, సంస్కృతం అరవం, హిందీ, ఇంగ్లీషు భాషలు వచ్చు. ఆమె నిరంతరం తపోదీక్షలో వుంటుంది. అయితే ఆమె సన్యాసిని కాదు. కాషాయ వస్త్రాలు ధరించదు. రుద్రాక్షమాలలు వేసుకోదు. చేతిలో తులసిపూసల జపమాల ఉంటుంది. ఆమె సంసార స్త్రీ. ఆమెకు భర్తా పిల్లలూ ఉన్నారు. అయితే ప్రస్తుతం ఆమె వారికి దూరంగా ఆశ్రమంలో దైవధ్యానంలో, తపోదీక్షలో ఉంటోంది. ఆమెకు ఆ ఆశ్రమం రామదాసు కట్టించి యిచ్చేడు.

రామదాసు ప్రముఖ పారిశ్రామికవేత్త. గొప్ప ధార్మికుడు. హనుమద్భక్తుడు.



ఆయన నగరిలో తన ఇష్టదైవం హనుమంతుడికి ఆలయం కట్టించేడు. స్వామికి నిత్యధూపదీప నైవేద్యాలకు, పూజలకు తగిన ఏర్పాట్లు చేసేడు.

ఆయన ఓ పర్యాయం మహాదేవమ్మ గురించి విని ఆమె దర్శనం చేసుకున్నాడు. ఆమె శక్తి సామర్థ్యాలు కళ్లారా చూసేడు. మంత్రోపదేశం పొందేడు. అతనికి ఆమె ప్రభావంతో ఇష్టదైవ సాక్షాత్కారం లభించింది.

ఆమె దైవాంశ సంభూతురాలు. ఎన్నో కఠిన పరీక్షలకు గురిచేసి కాని ఎవరినీ నమ్మదు. ఆమె అనుగ్రహం పొందినవారు కొద్దిమంది మాత్రమే! అటువంటిది ఆమెకు

తమపై అనుగ్రహం కలిగినందుకు ఎంతో సంతోషించేరు రామదాసు అతని భార్య ఆదిలక్ష్మి.

మహాదేవమ్మకు తమ కృతజ్ఞతలు తెలియజేసుకోవాలనుకున్నారు. ఆమె కొరకు ఊరు మొదట్లో నేషనల్ హైవే ప్రక్కన మూడు ఎకరాల స్థలం కొని అందులో అన్ని సదుపాయాలతో చక్కటి ఆశ్రమం కట్టించేరు. విశాలమైన ప్రార్థనా మందిరం, పూజామందిరం, పై ఊర్ల నుండి వచ్చే భక్తుల వసతి కొరకు కాటేజీలు కట్టించేరు. ఆశ్రమం చుట్టూ ఎత్తైన కాంపౌండ్ వాల్ నిర్మించి ఆశ్రమంలో పలురకాల పూలమొక్కలు, పండ్ల చెట్లు నాటించి వాటి సంరక్షణకు పనివారిని నియమించేరు.

ఆశ్రమ ప్రవేశద్వారం వద్ద వరుసగా వినాయకుడు, కుమారస్వామి, శివపార్వతులు, లక్ష్మీనారాయణులు, రామాలయం, హనుమంతుని గుడి కట్టించేరు. వాటికి నిత్యధూప, దీప, నైవేద్య పూజల కొరకు తగు ఏర్పాట్లు చేసేరు. వారికి యితర పారిశ్రామికవేత్తలు, నగరంలోని వ్యాపారప్రముఖులు చేయూతనిచ్చేరు. ఆశ్రమ నిర్వహణకు ఒక కమిటీని నియమించి ఏ లోటూ రాకుండా చూస్తున్నారు.

రోజూ ఆశ్రమానికి వచ్చి పోయే భక్తుల అవసరాల కొరకు ఆ ప్రాంతంలో ఎన్నో దుకాణాలు, హోటళ్లు వెలిసేయి. అక్కడ పెద్ద కాలనీ ఏర్పడింది. టాక్సీస్టాండు, ఆటోస్టాండు తయారయింది. సిటీ బస్సులు ప్రతి పది నిముషాలకూ తిరుగుతున్నాయి.

ప్రార్థనా మందిరంలో భక్తులు మూడు పూటలా ఓంకార మంత్రజపం భజనలు చేస్తున్నారు. మహాదేవమ్మ వారికి ఆధ్యాత్మిక విషయాలు బోధిస్తోంది. భక్తుల మంచిచెడ్డలను వ్యధలను స్వయంగా తెలుసుకొని వారికి తగిన సూచనలు, సలహాలు ఇస్తున్నాది. ఆమె ప్రవచనాలు వినడానికి భక్తులు దూరప్రాంతాలనుండి వస్తున్నారు.

మహాదేవమ్మకు ప్రచారం, పబ్లిసిటీ ఏ మాత్రం కిట్టదు. ఆమె తన ఫోటోకాని, ఆశ్రమం ఫోటోలుకాని ఎవరూ తీయకూడదని మొదటే శాసించేరు.ఆమె ఆజ్ఞను అందరూ స్ట్రిక్ట్‌గా పాటిస్తున్నారు. ఆశ్రమంలోనికి ఎవరూ కెమేరాలు, వీడియో కెమేరాలు, ఇతర ప్రచార సాధనాలు తీసుకొని రాకుండా ప్రధాన ద్వారం వద్ద భక్తులను నిశితంగా పరీక్షించి లోనికి పంపుతున్నారు.

రామదాసు కొడుకు రాఘవేంద్ర, కోడలు వైదేహి ఇరువురూ డాక్టర్లే. వారు సుమారు 5 సంవత్సరాలు ఉన్నత వైద్య విద్య కొరకు విదేశాలు పర్యటించి అనుభవం

పొంది వచ్చేరు. వారి కొరకు రామదాసు అన్ని హంగులు, అధునాతన వైద్య పరికరాలు కల నర్సింగ్ హోమ్ నిర్మిస్తున్నారు. నర్సింగ్‌హోమ్ తుది మెరుగులు రాఘవేంద్ర స్వయంగా చూస్తున్నాడు.

వైదేహి కూడ మావగారి వలె గొప్ప భక్తురాలు. ఆమెకు దైవ చింతన బాల్యంలోనే బలపడింది. మహాదేవమ్మ మహిమలు వింది. మావగారు మహాదేవమ్మకు కట్టించి యిచ్చిన ఆశ్రమం చూసింది. వైదేహికి ఆశ్రమం నచ్చింది. అక్కడి ప్రశాంత వాతావరణం ఆమెను ఎంతో ఆహ్లాదపర్చింది. ఆమె అత్తగారి వెంట రోజూ ఆశ్రమానికి వెళ్లి దైవ ప్రార్థనలో పాల్గొంటున్నాది. మహాదేవమ్మ బోధనలు వింటున్నాది. నర్సింగ్‌హోమ్ పని ప్రారంభిస్తే ఆమెకు అసలు లీజర్ దొరకదు. అందువల్ల ఆమె ప్రస్తుతం ఎక్కువ టైమ్ ఆశ్రమంలోనే గడుపుతోంది.

వైదేహి భక్తి భావనకు దైవచింతనకు మహాదేవమ్మ మిక్కిలి సంతోషించింది.

తన కోడలికి కూడా దైవ సాక్షాత్కారం కల్గజేయమని ఆదిలక్ష్మి పదేపదే మహాదేవమ్మను బలవంతం చేస్తోంది. ఆమె మాట కాదనలేక చివరకు తన తపశ్శక్తితో వైదేహికి దైవ సాక్షాత్కారం లభింపజేయడానికి మహాదేవమ్మ అంగీకరించింది. నీ యిష్టదైవం ఎవరో చెప్పు? నా తపశ్శక్తితో నీకు దైవసాక్షాత్కారం కలుగజేస్తాను!" అంది మహాదేవమ్మ ఓ రోజు వైదేహితో!

ఆమె మాటలకు విస్మయం చెంది వైదేహి.

"నా ఇష్టదేవత రుద్రకాళీ!" అంది వైదేహి చిరునవ్వుతో.

ఆ జగన్మాత రౌద్రరూపం ఎంచుకున్నావేం తల్లీ! సౌమ్య రూపాలు ఎన్నో వుండగా! లలితా పరమేశ్వరి, రాజరాజేశ్వరి..."

"రుద్ర కాళీయే నా ఇష్టదేవత!" అంది వైదేహి దృఢంగా.

"సరే మంచిది! రేపు ఉపవాసముండి రాత్రి 8 గంటలకు శుచిగారా!" అంది మహాదేవమ్మ.

మహాదేవమ్మకు తమ కోడలుపై కల్గిన అనుగ్రహానికి ఎంతో ఆనందించేరు రామదాసు, ఆదిలక్ష్మి. పిన్న వయస్సులోనే వైదేహికి దైవసాక్షాత్కారం కలుగబోతున్న దని వారు సంతోషించి, ఆ శుభవార్త వెంటనే బంధువులకు మిత్రులకు తెలియజేసేరు.

మర్నాడు వారందరూ వైదేహితో ఆశ్రమానికి వచ్చేరు.

సాయంకాల పూజా కార్యక్రమాలన్నీ త్వరగా ముగించింది మహాదేవమ్మ. వైదేహిని తన పూజామందిరంలోనికి తీసుకొని వెళ్లి కూర్చోబెట్టింది. ఇతరులెవరూ లోనికి రాకుండా తలుపులు మూసింది. గదిలో జీరో వాట్ బల్బ్ వెలుగుతోంది.

మహాదేవమ్మ వైదేహికి రుద్రకాళీ మంత్రం ఉపదేశించి జపించమని తనూ ధ్యానంలో కూర్చుంది.

అర్థగంట తరువాత మహాదేవమ్మ వైదేహి వద్దకు వచ్చి ఆమె తలమీద చేయి వుంచి-

"కొద్దిక్షణాలలో నీ ఇష్టదైవం రుద్రకాళీ నీ ముందు ప్రత్యక్షమవబోతోంది. భయంకర ఉగ్రరూపిణి... రుద్రకాళీ రూపం నీ కళ్లముందు కనిపిస్తోంది... ధైర్యంగా ఉండు... ఏ మాత్రం భయపడకు..." అని పదే పదే మెల్లగా సజషన్స్ ఇస్తోంది.

పది నిముషాలు గడిచాయి.

వైదేహి కూర్చున్న చోటు నుండి దిగ్గున లేచి వెళ్లి తలుపులు తెరచి లైటు వేసింది.

"సారీ! నువ్వెంత ప్రయత్నించినా నన్ను హిప్నటైజ్ చెయ్యలేవు! ఆ విద్యలో నేను ఆరితేరినదాన్ని. అంతేకాదు నా వైద్య ప్రక్రియలో అదొక భాగం తెలుసా? నీ గురించి నీ మహిమల గురించి మా మావగారు నాకు చెప్పినప్పుడే నీమీద నాకు అనుమానం కల్గింది. నీ రహస్యం బయట పెట్టాలనే నేను వచ్చాను. నీ ట్రిక్స్‌తో అమాయకులని మోసగించగలవేమో కాని నాలాంటి వారిని కాదు! మైండిట్" వైదేహి మాటలు తూటాల్లా తగిలి మూర్ఛపోయింది మహాదేవమ్మ.

మిగిలిన వారందరూ షాక్ అయ్యారు.

"కాశీపట్నం సూడరబాబు! కాలభైరవుడు ఉన్నడు సూడు" అని పాటపాడుతూ ఆశ్రమం గేటు వద్ద తమాషా పెట్టెలో బొమ్మలు చూపెడుతున్న వాడి చుట్టూ పిల్లలు పైసలు చేత పట్టుకొని గుమిగూడేరు.

**('ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక', 9 జూన్ 2001)** ✪

# కానుక

"ప్రసూనమ్మ పుట్టినరోజుకి ఈ సుట్టుమంచి బగుమానం యివ్వాల! ఏటివ్వాల! ఏటిత్తే ఆరి ఓదాకు సరితూగుద్ది?' అనుకుంది మల్లి.

ప్రెసిడెంటు వెంకటాద్రి, సౌభాగ్యలక్ష్మిల ఏకైక సంతానం ప్రసూన. ఆమె ఉమెన్స్ కాలేజీలో డిగ్రీ చదువుతోంది.

ప్రెసిడెంటు వెంకటాద్రికి పేద, ధనిక తారతమ్యం లేదు. కులమత విచక్షణ అంతకన్నా లేదు. అందరినీ ఎంతో అభిమానంతో చూస్తాడు. ఎవరికి ఎప్పుడు ఏ సహాయం అవసరమైనా తప్పక చేస్తాడు.అతడంటే చుట్టుపక్కల గ్రామ ప్రజలకు ఎంతో గౌరవం వుంది.

తండ్రి మంచి గుణాలన్నీ ప్రసూనకు వచ్చేయి. అంతేకాదు ప్రసూన గొప్ప స్నేహశీలి! గ్రామంలో ఆమెకు స్నేహితురాండ్రు చాలామంది వున్నారు. ఆమె అందరి ఇళ్లకూ వెళ్తుంది. ఫ్రెండ్స్‌తో ముచ్చటించి వారి కష్టసుఖాలలో పాలుపంచుకుని చేతనైన సహాయం చేస్తుంది. మంచిసలహాలిస్తూ అందరి మన్ననలు పొందుతోంది.

ప్రతి సంవత్సరం కూతురు పుట్టిన రోజు పెద్ద పండుగలా జరిపిస్తున్నారు. వెంకటాద్రి, సౌభాగ్యలక్ష్మి. ప్రసూన పట్నంలో తన క్లాస్‌మేట్స్, ఫ్రెండ్స్ గ్రామంలో తన ఈడు ఆడపిల్లలు, స్నేహితురాళ్లను స్వయంగా పిలిచి బర్త్‌డేనాడు అందరికీ మంచి విందు ఇస్తోంది యేటా.

ప్రసూన చిన్ననాటి స్నేహితురాలు మల్లి. ఇద్దరూ కలిసి ఆ గ్రామంలోని ఎలిమెంటరీ స్కూల్లో ఐదవతరగతి వరకూ చదువుకున్నారు. ప్రసూనకు ఫ్రెండ్స్ అందరికంటే మల్లి అంటే అభిమానం ఎక్కువ. వారిరువురి స్నేహానికి అంతస్తులు



ఏనాడూ అడ్డురాలేదు. మల్లిని సొంత చెల్లెలులా చూస్తుంది ప్రసూన. అయితే మల్లి ఏనాడూ హద్దుమీరి ప్రవర్తించలేదు.

బర్త్‌డే పార్టీకి వచ్చే ఫ్రెండ్సంతా ఏవో కానుకలు తెచ్చి ప్రసూనకిచ్చి గ్రీటింగ్ చెప్పడం రివాజు. మల్లి ఏనాడూ స్నేహితురాలికి బర్త్‌డే కానుక ఇవ్వలేదు. ఇవ్వగల స్తోమత కూడా లేదామెకు. రోజూ స్నేహితురాలికిచ్చే సన్నజాజి పూల చెండే అనాడూ ఇస్తోంది. ఆ పూలు దొడ్లో పూసినవి.

అయితే గత మూడు నెలలుగా మల్లి కూడా కొద్దో గొప్పో డబ్బు సంపాదిస్తోంది. గ్రామంలో మహిళా ఉపాధి పథకం కింద డ్వాక్రాగ్రూప్ ఒకదానిని ఏర్పాటు చేసేరు. అందులో తయారైన వస్తువులు వెంట వెంటనే మార్కెట్ చేస్తున్నారు.

మల్లికూడా మహిళా ఉపాధి కేంద్రంలో చేరి పని నేర్చుకుంటూ డబ్బు

సంపాదిస్తోంది. అందుకని ఈయేడు స్నేహితురాలి పుట్టినరోజుకు ఏదైనా మంచి కానుక ఇవ్వాలనుకుంది. అయితే ఏమివ్వాలో, ఏ వస్తువు ఆమెకు ఉపయోగంగా వుంటుందో తెలియక తికమక పడుతోంది.

ఆ తరుణంలో మల్లికి డ్వాక్రా గ్రూపులో పనిచేస్తున్న శోభన టీచరు గుర్తుకొచ్చింది. ఆమెను కలిసి విషయం చెప్పింది. శోభన టీచరుకి మల్లి అంటే ప్రత్యేకమైన అభిమానం వుంది. మల్లి చిరుకైన పిల్ల, ఏ విషయమైనా ఒకమారు చెప్తే చాలు గ్రహిస్తుందని అందరితోనూ అంటుంది శోభన. పైగా ఆమెకు మల్లి ఆర్థిక పరిస్థితి తెలుసు.

"చూడు మల్లీ! కొన్న వస్తువులు అందరూ తెచ్చి కానుకగా యిస్తారు. అదేం గొప్ప విషయం కాదు! అయితే ఏ వస్తువైనా నువ్వు నీ చేతులతో తయారుచేసింది కానుకగా యిస్తే ఇచ్చినందుకు నీకు, తీసుకున్నందుకు ఆమెకు ఎంతో తృప్తిగా వుంటుంది. పైగా కొన్నవస్తువుకంటే తయారుచేసుకున్న వస్తువు చవకగా వస్తుంది!

నీ స్నేహితురాలు కాలేజీలో చదువుతోంది అన్నావుకదూ! ఆమెరోజూ కాలేజీకి బుక్సు అవి తీసుకొని వెళ్లేందుకు ఉపయోగపడే షోల్డరు బేగుఫర్ క్లాత్‌తో తయారుచేసి యిస్తే ఎంతో బాగుంటుంది. చూసేందుకు ఎంతో అందంగా వుంటుంది! పైగా అది ఆమెకు రోజూ ఉపయోగపడుతుంది. బేగు మనం బజారులో కొంటే, మూడు, నాలుగు వందలు ఖరీదు చేస్తుంది. అదే మనం తయారుచేసుకుంటే మనకు సుమారు అరవై రూపాయలలో వస్తుంది. షోల్డరు బేగుకి ఫర్ క్లాత్ ముక్కలు రేపు నేను పట్నం నుండి వస్తున్నప్పుడు తెస్తాను. వాటితో బేగు తయారుచెయ్యడం నీకు నేర్పుతాను" అంది శోభన టీచరు.

టీచరు సలహాకు ఎంతో ఆనందించింది మల్లి. ఆవిడకు తన వద్దనున్న నలభై రూపాయలు ఇచ్చింది. మిగిలిన సొమ్ము వచ్చేనెలలో ఇస్తానని చెప్పింది.

మర్నాడు శోభన టీచరు ఫర్ క్లాత్ ముక్కలు, లైనింగ్‌క్లాత్, జిప్పులు, బటన్స్ వగైరా సామాన్లు తెచ్చింది. వాటితో ఫర్ క్లాత్ షోల్డరు బేగు మల్లితో తయారు చేయించింది.

మల్టీకలర్స్‌లో షోల్డరు బేగు చూడ్డానికి ఎంతో అందంగా వుంది. మల్లి

ఆనందానికి అంతులేదు. టీచరుకి కృతజ్ఞతలు చెప్పింది.

శోభన టీచరు బేగుని గిఫ్ట్ పేపర్లో నైస్‌గా పేక్ చేసి మల్లికిచ్చింది.

ప్రసూన బర్త్‌డేనాడు మల్లి వేకువనే తయారైంది. గిఫ్ట్ పేకెట్ తీసుకొని ప్రసూన ఇంటికి బయల్దేరి వెళ్లింది. అందరి వలె స్నేహితురాలికి తనూ ఈయేడు మంచి కానుక ఇవ్వబోతున్నందుకు మల్లికి ఎంతో సంతోషంగా వుంది.

పట్నం నుండి ప్రసూన ఫ్రెండ్స్, క్లాస్‌మేట్స్, గ్రామంలోని స్నేహితురాళ్లు అందరూ వచ్చేసారు. అందరికంటే ఆలస్యంగా వచ్చింది మల్లే.

మల్లి స్నేహితురాలిని గ్రీట్ చేసి పేకెట్ అందించింది.

"ఏమిటే ఇంత లేటుగానా రావటం!" అని ప్రసూన తన ఫ్రెండ్స్ అందరికీ మల్లిని పరిచయం చేసింది.

వచ్చిన కానుకలను సౌభాగ్యలక్ష్మి జాగ్రత్తగా విప్పి వాటిని కూతురుగదిలో పెడుతుంది ప్రతియేడు.

ఈమారుకూడా ఆవిడ అదే చేసింది.

మర్నాడుదయం ప్రసూన కాలేజీకి బయల్దేరుతూ గదిలో ఎదురుగా ఉన్న ఫర్ క్లాత్ షోల్డరు బేగు తీసి అందులో బుక్సు పెట్టుకొని బయటకు వచ్చింది.

ఆరోజు తండ్రికి బదులు అప్పలసూరి రిక్షా తీసుకొని వచ్చాడు. అప్పుడప్పుడు దాలయ్యకు బదులు అతని కొడుకు రిక్షా తేవడం పరిపాటే.

"సెవులపిల్లి ఎంత్రికల్లా అవుపడతందేటమ్మాయి గోరూ తవరి సంచీ?" అన్నాడు అప్పలసూరి ప్రసూన షోల్డరు బేగు చూసి ఎంతో ఆశ్చర్యంగా.

"దీన్ని ఫర్ క్లాత్ అంటారు! దీంతో కుక్కపిల్ల, పిల్లి, కోతి వంటి బొమ్మలు చేస్తారు" అంది ప్రసూన రిక్షాలో కూర్చుంటూ.

"కానండి సంచి సూపరుగుందండి! శానాబాగుంది!"

"అవునా! నీకు అంతగా నచ్చిందా! అయితే యింద తీసుకో!" అని సంచిలో పుస్తకాలు బయటకు తీసి సంచి అప్పలసూరి కందించింది ప్రసూన.

వాడు సంచీ తీసుకునేందుకు జంకేడు.

“ఫర్వాలేదు నేను నీకు దీన్ని కానుకగా యిస్తున్నా తీసుకో!” అని బలవంతంగా యిచ్చింది.

అప్పలసూరి ఆనందానికి అంతేలేదు. దానిని తన మరదలు మల్లికి కానుకగా యిస్తే ‘ఎర్రిబాగుల్ది ఎంత సంబరపడిపోతాదో?’ అనుకున్నాడు.

ఆ సాయంత్రం అప్పలసూరి పరుగుపరుగున మల్లివద్దకు వెళ్లి– “మల్లీ నీకోసం ఏటి దెచ్చినానో సూడు!” అంటూ సంచీ మల్లికివ్వబోయేడు.

బావచేతిలో సంచీ చూసి మల్లి “కెవ్వ్”మంది.

(‘ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక’, ఆగస్టు 2001) ✪

# హైటెక్ వ్యాపారం

"కాన్వెంటెట్టి సూడు కాసుల వొర్సం కురిపిత్తాది!"

"నాను సావెత సెవతన్నా ననుకునేవు అప్పల్సూరి! యాపారానికి ఆలోసన సెప్పమన్నావు సెవతన్నా!"

"నువు సురుకైన వోడివి! సదూకుతోన్నడివి. పదిమందికి కూడు ఎట్టగల కెపేసిటీ గలోడివి! వుజ్జోగాల జోలుపోనేదు"

"పూరవం దనబలివి లేనోడు కుదురుగ్గా సదూకొని వుజ్జోగాలంటూ ఊర్లంట దిరిగేవోరు. ఉన్నోడెవడూ వుజ్జోగాల వూసెల్లేవోరుగాదు"

"మరి యీ పొద్దు ఆటికోసం ఎగబడని వోడు నేడు. అంచాత ఆటికి ఏలంపాట ఎట్టేసినారు. దనబలివి ఉన్నోడు ఆటిల జొరపడతన్నాడు ఎటుసూసినా ఐటెక్కు మగిమ!

"మట్టిల ఇత్తనాలు ఏసీగానే మొలకెత్తీయాల! పూవు, పిందెట్టి పంట సేతల రావోల"

"యాపారంల మదుపులెట్టీగానే నాబాలు సేతికందాల!

"కాసులు గలగలరాలే ఐటెక్కు యాపారాలే ఈకాలంల పెజలకి గావాల"

నా ఎరికన అట్టాంటి కాసులురాలే ఐటెక్కు యాపారాలు రెండున్నాయి. ఓటీ సారా యాపారం! కాన్మెంటు సదువులు! పెజలకు యీ పొద్దు ఆటిమీదున్న మోజు ఏటికీ నేదు! పట్టనంల కూలోడు కూడ ఎసలుబాటున ఆడిపిల్లోడిని ఇంగ్లీసు సదువుకు తొల్తన్నాడు."




"నిచ్చరగా నా కల్లత సూసింది సేవతన్నాను"

మా సిన్నల్లుడు ఇజయసారది -నువు సూడనేదుకదూ?" ఆడు ఎమ్.ఎ సదివి, సదువుల డాట్టరు పట్టాపుచ్చుకున్నాడు తెలుసా? ఆడికి ఆడు సదివిన సోటే వుజ్జోగవిత్తనన్నారు! ఆడు నాను వుజ్జోగం సెయ్యనని మెడ్డేసినాడు.

"ఆడి యిసురుబాటుకు మావందరం నివ్వెరబోయినాం! అదేటి సిత్రం! యీ పొద్దు వింజనీరు సదివినా, డాట్టరు సదివినా, మేట్టరీ సదివినా జనాలు వుజ్జోగాలు నేక రోడ్డంట దిరుగుతన్నారు. మరి నువు సేతల సిక్కిన వుజ్జోగం వొగ్గేసినావేటని నిల్దీసినావు"

"నాను పట్నంల కాన్వెంటు యడతన్నాను! నానే పదిమందికి వుజ్జోగాలిత్తాను!

ఈ పొద్దు కాన్మెంటు సదువుల గిరాకీ మరేటికీ నేదు. పెతివోల్లు ఇంగ్లీసు సదువుల కెగబడతన్నారు! ఆయిసయాలు మీకు తెలవవు!"

"ఇంగ్లీసోడు మన్నొగ్గిసి ఎల్లిపోయినా ఆడిబాసని మనం ఒగ్గడంనేదు!"

"అంచాత కాన్మెంటెడితే కాసుల వొర్సం కురిపిత్తాది!" అన్నాడు.

ఆడిమాట నువు కాదన్నేవు!"

"ఈ పొద్దు అమ్మా! అయ్యా! అనడం నామోసీ! మమ్మీ! పప్పా అనడం పేసను"

"ఆటిని మరి కాన్మెంటుల నేర్పిత్తారు!"

గవొర్మెంటోల్లు యీదికో బడెట్టి సదువుకుందికి పిల్లలకి పుస్తకాలు, పలకలు, బలపాలు, యేసుగుందికి వూనీ పారంలు వుల్చాగా సప్లీచేసినా మద్దేన్నం బోజనవెడతావన్నా యీది బడి దుక్కు ఎవురూ సూడనేదు"

"ఈది బడికి గుంటల్ని దోలితే ఆల్లకి ఏటొత్తాది! ఆడ సదువు ఏటి సెవతన్నారు? బక్కల్ని రాతి పర్రమీదకు దోలుకెల్తే అవేటిమేత్తాయి?" అంతన్నారు జనాలు. అంచాత కాన్మెంటు సదువుకి ఎగబడతన్నారు"

"మా సిన్నల్లుడు పట్నంల ఎట్టిన కాన్మెంటు నానుపోయి సూసొచ్చినా! అల్లుడి పనితనవేటో? సంపాదనేటో తెలవాల గదా! లచ్చల సొమ్ము మదుపెట్టినాను గదా!

సూచ్చవేగాదు మా అల్లుడు అయివరాలు, మతలబులు నాకు సక్కగ బోదసేసినాడు! నాను సూసిందీ, ఇన్నదీ, గెహించిందీ నీకు సేవతన్నాను"

"కాన్మెంటు సదువుల యాపారానికి మదుపులు లవిన్నిగావాల!

"పెసారం సెయ్యాల! నువ్వెంత సెపారం చేసి వూర్ల పెజల్ని ఊదరగొడత అంత పెస్టేజి!

కాన్మెంటు ఎట్టడానికి సక్కని బవనం గావాలి. దానికి ముందూ యెనకా టూడెంట్లు మసల్డానికి లవింత సోటుండాల. గేటు కాడ వోచిమేను ఎట్టాల! మరి టూడెంట్లు కూకోడానికి, కూకొని రాసుకోడానికి సక్కటి బెంచి బల్లలుండాల! పెతీ గదిలోన పంకాలు, టూబులైట్లూ ఎట్టాల! నోవరుకేజీ, అప్పరుకేజీ పిల్లలు ఆడుకోడానికి

యిసాలవైన రెండుగదులు ఆటిల సక్కటి ఆటబొమ్మలు ఎట్టాల! ఆల్ల ఆలనా పాలన సూసేందుకు ఇద్దరు ఆయమ్మలుండాల! ఓం పెదమంగా వొచ్చినోల్లు నీ అంగు ఆర్భాటం సూసి డంగైపోవాల!

"కాన్మెంటు దెరవడానికి నెల్దినాల ముందలే అప్లికేషనన్లు అమ్మజూపాల! ఆటిదర నువ్వెంత ఎక్కువెడితే అంత పెస్టేజి!"

"పేస్టేజిత నువ్వెట్టిన డొనేసను పెతీవోరూ నవ్వుత గడతారు"

మరి టూడెంట్లకి గావొల్సిన పుస్తకాలు, పెనిసిల్లు, కలాలు, బేగులు, బేడ్జీలు, ఆటన్నిటి మీద నీ కాన్మెంటు పేరు అచ్చేయించి ఆటిని నువ్వే సప్లీసెయ్యాల! ఆటి మీద నీకు రూపాయికి రూపాయి నాబం! డొనేసన్లతనీ పెట్టుబడి మదువులు నీగల్లా పెట్టిల సేరిపోతాయి".

"ఇక సదువులు సెప్పడానికి టీచరమ్మల్ని యేసుగున్నావనుకో నీకు రెండిదాల నాబం! ఆరుపిల్లలకి సక్కగ, ఓపిగ్గ బోదసేస్తరు. అంతేకాదు సుట్టుపక్కల పిల్లలకి ఆరే నీకు కర్సునేకుండా పెసారం సేసి పిల్లల్ని దోలుకొత్తారు" నువు వోరం వోరం పిల్లల సదువుల రిపోర్టులు ఆల్లఆయ్యా, అమ్మలకు అంపితే నీ మీద ఆల్లకి గురి కుదురుద్ది"

ఇయన్నీ మా అల్లుడు సేసినాడు. నాను సూసినాను. ఈ పొద్దు ఆడి కాన్మెంటుల సేర్పించడానికి జనాలు ఎగబడతన్నారు. ఎంత డొనేసను ఎట్టినా కడతావంతన్నారు. అంచాత పెతీ తరగతీ రెండేసి సెచ్చన్లు ఎడతాను అంతన్నాడు. తరగతికి నలభైమంది సొప్పున పది తరగతులకీ నాలుగొందల మంది పిల్లల్ని ఎగస్టాగా తీసుగోవొచ్చు"

"సొమ్మకేటి? ఎట్టాగేనా ఒత్తాది! గాని నేను ఒంటరిగా అన్నీ సూసుకోనేక నలిగిపోతన్నాను. నాకు పెస్తుతం మడిసిసాయంగావాల! తగినాతుగ ఆపీసుల గూకొని పెత్తనం సేసేమనోడుండాల! అంతన్నాడు. యీ వోయిసుల అది నా వొల్లగాదు. ఆ బారం నీమీదిడుకుని ఆడియోపారంల జతగూడు! నీ కాడున్న సొమ్మ రెండు లచ్చలూ నీ బాగంగ మదువులెట్టు! నీకు అనుమానం, అభ్యంతరం అయితే సెప్పు బయంనేదు వూర్ల మా బాగార్ల కుర్రాడే సంచిల సొమ్మట్టుగుని రడీగా కూకున్నాడు!"

"నువ్వెట్టిన సొమ్మకి మొప్పంరాదు! గావాలంటే నాను ఆమీ ఇడతాను సరేనా"

"అదీ తెగింపు! బుద్ధిమంతుల లచ్చనం! రేపు పెందిల సొమ్ముట్టుకొనిరా! నానూ నీ కూడ బయలెల్లి మా సిన్నల్లుడికి నిన్ను వప్పగింతెడతా! కారుల బయలెల్దాం!

అః! అట్టాగే! సుబం ఎల్లిరా!"

"బావు! సెలవయ్యగోరూ! సిన్నల్లుడు గోరు రెండు లచ్చల సొమ్ము అరజంటుగా కావాలని కబురం పేరు."

"తవరు అప్పల్సారిగోరికి కాన్మెంటు ఎట్టిసూడు కాసుల వొర్సం కరిపిత్తాది' అని ఐటెక్కు యాపారం అరసేతల సూపి ఆరికాడ వొడ్డీలేని మదుపులు రెండు లచ్చలు సిటంల రాబట్టేసినారు ఐటెక్కు పెసారం సేసి" అన్నాడు సిమ్మన్న నివ్వెరపోయి.

('సుప్రభాతం వీక్లీ', ఆగష్టు 2001) ✪

# మరో మజిలీ

"మొకం సూసి రోగవేటో సెప్పాల. ఏటనుకున్నావ్! వాతగునవా? వాయుగునవా? జలదోసవా? గాలి సోకింది? దిస్టిదోసవా? సేతబడి సేసేరా? పసరు మందేయాలా? కసాయం ఇయ్యాల? మంతరం ఏయాల? తావీదు సుట్టాలా? గాపోతే దిగదుడుపెట్టాలో కానుకోవాల!"

"అంతేగాని నోట్ల గాజు పుల్లెట్టి సెయ్యట్టుగోందే రోగవుందో నేదో సెప్పనేవు గదా! మరి నువు మా గేమాల్ల వైద్దెవేటి సేస్తవ్ కుర్రడాట్టరూ!"

"ఎలచ్చన్ల టయాంల గవన్మెంటోల్లు వోట్లగోసం గేమంల ఆసుపత్తిరి గట్టించీనారు. మరి ఈవారకూ డజనుమంది డాట్టరుబాబుల్ని తోలినారు. ఎవరూ గేమంల మూడు పొద్దులుండనేదు. కారనవేటి?"

"మీరంతా పట్టనంల పుట్టి పెరిగినోరు. పెదపెద్ద సదువులు సదివినోరు. గేమాల్ల ఏటినోల్లుకోవాల? ఏటుందని? ఓ ఇనోదవా? ఇగ్గేనవా? సినేమాల? సికార్లా? ఏడసూసినా పశూల రొచ్చులు, పెంటగుప్పలు, మట్టివోసన!"

"సూడు బాబూ! నువ్వా సిన్నోడిని! సదువుకున్నోడివి. పొట్ట సేతబట్టుకుని మాకాడకొచ్చినావు. గాదనను. అంచాతనానోటి సెవతాను ఇనుకో. నువు ఆసుపత్తిరిల నీడ పట్టున కూకో! నీకాడకొచ్చినోల్లకి నువు వైద్దెం సెయ్యి! రంగునీల్లు యివ్వు. గోలీలు ఇవ్వు. గాదనను. డుబ్ డుబ్ బండేసుకు ఊర్ల కొంపలంట దిరిగితే నాను పల్లకోను" కొత్తగా వచ్చిన డాక్టరు ప్రతాప్‌ని హడలకొట్టాడు మంత్రాల మరిడయ్య.

మంత్రాల మరిడయ్య రెండు తాటిదుంగల మీద తారుడబ్బా నిలేసి దానిమీద కుండ బోర్లించినట్లుంటాడు. కావిరంగు పంచ, బానలాంటి పొట్ట చుట్టూఅరచేతి వెడల్పు తోలుపటకా, మెడలో పూసల దండలు, నుదుట రూపాయి కాసంత



సింధూరం బొట్టు, దండలకి తావీదులు, గిరజాల జుట్టు, ఎర్రటి నిప్పుకణాల్లాంటి కళ్ళు.

చుట్టుప్రక్కల పది గ్రామాలకి మరిడయ్యే వైద్యుడు. మనుష్యులకే కాదు, పశువులకు, పక్షులకు కూడా వైద్యంచేస్తాడు.

మరిడయ్యదంతా వింత వైద్యం. చిన్న చిన్నరోగాలకు సైతం పూనకం వెయ్యందే మందివ్వడు. పెద్ద జబ్బులకైతే రోగి నివసించే గ్రామ దేవత పూనకం, సాధారణ రోగాలకు మామూలు పూనకం వేసి ఆకుపసర్లు, మంత్రించిన విభూది, తావీదు, దిగదుడుపు లాంటివి రోగి ఆర్థిక పరిస్థితిని బట్టి నిర్ణయించి ఇచ్చి డబ్బు వసూలు చేస్తాడు. వాడు చేసిందే వైద్యం. ఇచ్చిందే మందు, ప్రజలకు మరో దారి లేక వాడి

మీదే ఆధారపడ్డారు.

గ్రామీణులకు వారి గ్రామదేవత అసిరమ్మ, బంగారమ్మ, పోలేరమ్మ, నూకాలమ్మ, గొట్టాలమ్మ మొదలైన వాటిమీద ఎనలేని నమ్మకం. ఏటా గ్రామదేవత జాతర ఘనంగా జరిపిస్తారు. ఆ దేవత కరుణవల్ల వర్షాలు సకాలంలో కురుస్తాయని పిల్లాపాపలు ఆరోగ్యంగా వుంటారని, వారి పశువులకు, పక్షులకు రోగాలు రావని, పంటలకు చీడ పీడలు సోకవని వారి నమ్మిక. వారి మూఢనమ్మకాలను సొమ్ము చేసుకోవడమే మరిడయ్యలాంటి వారిపని.

ప్రతి సంవత్సరం గ్రామదేవత జాతర జరపవలసిన తేదీ, టైమ్ మరిడయ్య ఆ గ్రామపెద్దలముందు పూనకం వేసి తెలియజేస్తాడు. అందుకుగాను రైతులు ఇంటికి పుట్టెడు వడ్లు మరిడయ్యకు ఏటా ముట్టచెప్తారు. మరిడయ్య పూనకంలో సూచించిన విధంగా తమ గ్రామదేవత పండుగ జరిపిస్తారు. ఇతర ఖర్చులు గ్రామస్థులు చందాలు వేసుకుని భరిస్తారు. జాతర మరిడయ్య చేతుల మీదనే జరుగుతుంది.

నాలుగు గ్రామాల కూడలిలో మూడేళ్ళ క్రితం ప్రభుత్వం వారు ఆసుపత్రి కట్టించారు. అందువల్ల చుట్టుప్రక్కల కూతవేటు దూరంలో వున్న సుమారు పది గ్రామ ప్రజలకు వైద్య సదుపాయం అందుతుందనే నమ్మకంతో.

అయితే తనకు రాబడి పోతుందని, ప్రజలలో తనకున్న పలుకుబడికి నష్టం వస్తుందనే భయంతో మరిడయ్య వచ్చిన ప్రతి గవర్నమెంట్ ఆసుపత్రి డాక్టర్ని హడలుకొట్టి తరిమేస్తున్నాడు. సాధారణంగా పట్నవాసులు గ్రామరాజకీయాల్లో తల దూర్చరు. సాధ్యమైనంతవరకూ దూరంగా వుంటారు.

ఆసుపత్రిలో అడుగుపెట్టిన ప్రతి డాక్టర్నీ వెళ్ళగొట్టుడమే గాక మరిడయ్య గ్రామ ప్రజలందర్నీ భయపెట్టి వార్నింగ్ ఇచ్చాడు. మందు కోసం ఎవరూ ఆసుపత్రికి వెళ్ళకూడదని, డాక్టర్ని ఇంటికి రప్పించుకోవడం చేయకూడదని, అతనిచ్చిన మందుబిళ్ళలు వాడకూడదని, కాదు లేదని మొండికేసినవారు ఫలితం తప్పక అనుభవిస్తారని, అప్పుడు వారిని ఇక మరి ఎవరూ కాపాడలేరని మరిడయ్య తన శిష్యుల ద్వారా ప్రచారం చేయించాడు.

ఈ పర్యాయం వచ్చిన డాక్టర్ ప్రతాప్‌ని కూడా మరిడయ్య హడలగొట్టేసాడు. నామాట వినకపోతే ఫలితం అనుభవిస్తావని వార్నింగ్ ఇచ్చి వెళ్ళాడు.

మరిడయ్య వార్నింగ్ మౌనంగా విన్నాడు ప్రతాప్. అతడు వెళ్ళినవేపే చూస్తూ కూర్చునేసరికి ఇద్దరు వ్యక్తులు హడావుడిగా వచ్చారు.

"ఏటి భావూ! ఆ మరడయ్య గోడు అలా సిందులు దొక్కుత ఎల్లిపోతున్నాడు. అడు తవకాడకి కాని వచ్చినాడేటి? ఆడితో ఇరోదం ఎట్టుకోకండి భావు. ఆడసలే మంచోడుగాడు" అన్నారు సానుభూతి ప్రదర్శిస్తూ.

"అలాగా ఏం చేస్తాడు?"

"ఆడు సెయ్యానేని పనిలేదండి. ఆడుగాని సేతబడి సేసేడంటే దానికి తిరుగునేదండి. దాని ఇరుగుడు గోసం సివరాకరికి ఆడి కాల్లే వొట్టుగోవాల. తవరు ఊరుకి కొత్తోరు. పసివోరు. తవకి ఆడి సంగతి తెలవదు" అని ఇంకా ఏమో చెప్పబోయారు. అంతలో రామనాథం మాస్టారు రావడంతో వారు మెల్లగా జారుకున్నారు.

రామనాథంగారు ఆ గ్రామం ఎలిమెంటరీ స్కూలు హెడ్‌మాస్టర్. వయస్సు ఏభై సంవత్సరాల కంటే పైనే వుంటుంది. అతనిని చూడగానే గౌరవభావం కలగుతుంది.

"నమస్కారం డాక్టరుగారూ" అన్నారు.

"అయ్యయ్యో పెద్దవారు మీరు నాకు నమస్కరించడమేంటి? రండి ఇలా కూర్చోండి" అన్నాడు ప్రతాప్.

"ఏం పెద్దరికం బాబూ! బడిపంతుల్ని. ఆ మరిడయ్య అతడి మనుష్యులు వచ్చి నిన్ను కూడాభయపెట్టి వెళ్ళారా?" అన్నాడు రామనాథంగారు పేలవంగా నవ్వి.

"హెచ్చరించారు" అన్నాడు ప్రతాప్ చిరునవ్వు నవ్వి.

"అంతే బాబూ! వారి ఆగడాలకు అంతులేదు. గొర్రె కసాయివాడినే నమ్ముతుంది. ఏం చేయగలం? ఈ చుట్టుప్రక్కల గ్రామప్రజలందరూ చదువురాని అమాయకులు. వీరికి మూఢవిశ్వాసాలు, గుడ్డినమ్మకాలు ఎక్కువ. సరిదిద్దడం సాధ్యపడదు." అన్నారు నిట్టూర్చి.

"మీరేమీ వర్రీ అవకండి. మాస్టారూ! సరైన ప్రయత్నం చేస్తే సాధించలేనిదేదీ ఉండదు అని నా నమ్మకం" అన్నాడు ప్రతాప్.

"ఏమైనా నువ్వు కాస్త జాగ్రత్తగా వ్యవహరించు బాబూ!"

రామనాధంగారిని పరీక్షించి మందిచ్చి పంపించేసాడు.

డాక్టర్ ప్రతాప్ మంచి సోషల్ వర్కర్. గొప్ప ధైర్యవంతుడు. అంతేకాదు. అతని తండ్రి విజయ్‌కుమార్ డి.ఐ.జి.

ఆరోజు సాయంత్రం ప్రతాప్ పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ పెద్దిరెడ్డిని కలిసి మాట్లాడాడు. పెద్దిరెడ్డి టెన్త్‌వరకూ చదువుకున్నాడు. గ్రామ ప్రజల మంచి కొరకు, బాగుకోసం పాటుపడే మనిషి.

పెద్దిరెడ్డి ప్రతాప్‌కి అన్నివిధాలా సహకరిస్తానని భరోసా ఇచ్చాడు.

డాక్టర్ ప్రతాప్ పెద్దిరెడ్డిని వెంట తీసుకుని వెళ్లి చుట్టు ప్రక్కల వారి పరిధిలో వున్న గ్రామాలన్నీ పరిశీలించి వచ్చాడు. ప్రజలు నివసించే ఇళ్ళు, వాటి పరిసరాలు, త్రాగునీటి సదుపాయాలు, వనరులు, ప్రజల అలవాట్లు పూర్తిగా అవగాహన చేసుకున్నాడు.

ఓరోజు పెద్దిరెడ్డి తన ఇంటికి గ్రామప్రజలు ఆడ, మొగ అందర్నీ రమ్మనమని కబురు పంపించాడు. అందరూ వచ్చి కూర్చున్న తరువాత వారికి డాక్టర్ ప్రతాప్‌ని పరిచయం చేసాడు.

డాక్టర్ ప్రతాప్ తన పోర్టబుల్ ప్రొజెక్టర్ సహాయంతో వారికి ఆరోగ్య సూత్రాలకు సంబంధించిన ఫిల్మ్‌లు చూపించాడు.

ప్రజలు ఇంటి పరిసరాలలో పెంటకుప్పలు, చెత్త, మురుగునీరు నిలువుండకుండా ఎలా శుభ్రపరచుకోవాలో, అలా చేయకుంటే వాటిపై ఈగలు చేరి అవి రోగక్రిములని ఏ విధంగా చేరవేస్తాయో, వాటివల్ల ఎటువంటి జబ్బులు వచ్చి అవి ఎలా వ్యాప్తి చెందుతాయో ఫిల్మ్ చూపించి వాటి గురించి వివరంగా చెప్పాడు.

దోమలవల్ల మలేరియా, ఫైలేరియా వంటి వ్యాధులు వచ్చి అవి ఇతరులకు ఎలా సోకుతాయో, అవి రాకుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో మరొక ఫిల్మ్ చూపించాడు.

త్రాగేనీరు శుభ్రంగా లేకుంటే అందువల్ల వచ్చే రకరకాలు జబ్బులు, అవి రాకుండా తీసుకోవలసిన ముందు జాగ్రత్తలు, వచ్చిన తరువాత నివారణ కొరకు వాడవలసిన మందులు మొదలైన విషయాలు ఫిల్మ్ చూపించి చెప్పాడు.

ప్రతాప్ చెప్పిన విషయాలన్నీ అందరికీ చక్కగా అర్ధమయ్యాయి. వాటిని అమలు చేస్తామని చెప్పారు.

అదే సమయంలో పెద్దిరెడ్డి కొడుకు అంజిరెడ్డి పదేళ్ళవాడు తండ్రి వద్దకు వచ్చి 'పట్నం వెళ్ళిసినిమా చూసి రావడానికి పాతిక రూపాయలు ఇమ్మ'ని అడిగాడు.,

అంజిరెడ్డి చురుకైనవాడు. ఐదవతరగతి చదువుతున్నాడు. అప్పుడప్పుడు స్నేహితులతో కలసి పట్నం వెళ్ళి సినిమా చూసి రావడం వాడికి అలవాటే. పెద్దిరెడ్డి ఆరోప్రాణం అంజిరెడ్డి. కొడుకు మాట ఎప్పుడూ కాదనడు. వాడు ఏది అడిగితే అది ఇస్తాడు. అయితే ఆ రోజు వాడు అలా మర్యాద లేకుండా గ్రామస్థులు అందరి ఎదుట అడగటం పెద్దిరెడ్డికి ఏ మాత్రం నచ్చలేదు.

'ఇప్పుడు కాదు రేపు పంపిస్తాను' అని ఎంతో సౌమ్యంగా నచ్చచెప్పాడు. అంజిరెడ్డి వినలేదు. డబ్బు వెంటనే కావాలని మంకుపట్టుపట్టాడు. దాంతోపెద్దిరెడ్డికి కోపం వచ్చి డబ్బులివ్వనని కొడుకుని కసిరాడు.

తండ్రి తన మాట కాదన్నాడని అంజిరెడ్డికి రోషం వచ్చింది.

"నాకు వెంటనే డబ్బు ఇవ్వు. నేకుంటే నీకు నాను సేతబడి సేస్తాను" అని బెదిరించాడు.

వాడి బెదిరింపుకు పెద్దిరెడ్డితోపాటు అక్కడున్న గ్రామ ప్రజలు బిగ్గరగా నవ్వారు.

"గొట్టికాయంతనేవు గుంటడివి. నన్ను అదలిత్తావురా. సెయ్యిరా సెయ్యి" అన్నాడు.

తండ్రి మాటలకు వాడికి పౌరుషం వచ్చింది. విసురుగా పెరట్లోకి వెళ్ళి అందరూ చూస్తుండగా చెట్టునుంచి రెండు నిమ్మపళ్ళు కోసుకుని వచ్చాడు. అందులో ఒకటి పిడికిట వుంచి దానిమీద నోటితో గాలి మూడుసార్లు ఊది తండ్రి ముందు నిల్చుని గాల్లో దానిని ముమ్మారు సవ్యంగా త్రిప్పాడు. వాడి చర్యలు అందరూ ఎంతో కుతూహలంగా చూస్తున్నారు.

"నీకు సేతబడి సేసేను" అన్నాడు వాడు గంభీరంగా ఫోజుపెట్టి.

"పోరా నీ మాటెవడు నమ్ముతాడు?" అన్నాడు హేళనగా.

"నువ్వ అట్టాగంటావని ఎరికే. మీ కాడ ఎవురి దగ్గరేనా కత్తి, సాకు వుందా?" అన్నాడు.

డాక్టర్ ప్రతాప్ ఫోల్డింగ్ నైఫ్‌తీసి వాడికిచ్చాడు.

అంజిరెడ్డి తన పిడికిట్లో వున్న నిమ్మకాయను కోయబోయాడు.

"బాబూ! సాకు పదునుగా వుంటాది. సెయ్యి గోసుకోగలవు" అన్నాడు అంజిరెడ్డి మేనమామ గంగిరెడ్డి.

వాడు వినిపించుకోక ప్రయత్నించాడు. కానీ సాధ్యపడలేదు. గంగిరెడ్డి చప్పున వాడి వద్దకు వెళ్ళి "ఇటుదే నాను గోసి పెడతాను" అని వాడి చేతిలోని నిమ్మపండు, చాకు తీసుకుని మెల్లగా రెండు ముక్కలు మధ్యకి కోసాడు. అందులోనుండి ఎర్రటి ద్రవం కారింది. గంగిరెడ్డి వాటిని క్రింద జారవిడిచాడు.

పెద్దిరెడ్డితోపాటు అక్కడవున్న వారంతా కెవ్వుమన్నారు.

ఆడవాళ్లంతా హడలిపోయారు.

"తిరుగునేదు ఇది సేతబడి లచ్చనమే" అని నిర్ధారించారు.

పెద్దిరెడ్డికి ముచ్చెమటలు పట్టాయి. కర్చీఫ్ తీసి చెమటలని తుడుచుకోబోయాడు. చేతులు వణికి కర్చీఫ్ జారి కిందపడింది. అతడు ముందుకు వంగి దానిని అందుకోబోయాడు. అంతలోనే అది అందరూ చూస్తుండగానే భగ్గున మండి బూడిద అయింది.

ఆ దృశ్యం చూసిన తరువాత ఎవరికీ నోటంట మాట రాలేదు. ముమ్మాటికీ అది చేతబడి అని అందరూ ఒప్పుకున్నారు.

విరుగుడు చేయమని అంజిరెడ్డిని వేడుకున్నారు.

"అరేయ్! ఇయిగోరా డబ్బులు. పాతిక కాదు యాభై దీసుకుని తొరగా ఇరుగుడెట్టరా" అన్నాడు పెద్దిరెడ్డి దీనంగా.

"అట్టారా దారికి. నాతో పెట్టుగోకు" అని తండ్రి చేతిలోని ఏభై రూపాయల నోటు అందుకుని దానిని నిక్కరు జేబులో పెట్టుకున్నాడు.

అంజిరెడ్డి రెండో నిమ్మపండు తీసి చేత్తో పట్టుకుని దాని మీద నోటితో

ముమ్మారు గాలి ఊది దానిని తండ్రి చుట్టూ ముమ్మారు అపసవ్యంగా రివర్స్‌లో గాలలిలో త్రిప్పి దానిని కోసి చూడమన్నాడు.

గంగిరెడ్డి దానిని మధ్యకు కోసాడు. అది మామూలు గానే ఉంది. అందరూ సంతోషంతో ఊపిరి పీల్చుకున్నారు.

"మీరందరూ నా బొట్టిడు అంజిరెడ్డి బెమ్మాండంగా సేతబడి సెయ్యిగల్డు.దానికి ఇరుగుడు ఎట్టగలడు" అని ఒప్పుకుంతన్నారా అన్నాడు పెద్దిరెడ్డి.

"మావుకల్లారా సూసింది కాదనగలవేటండీ. నిజివే ఒప్పుకుంతన్నావు అన్నారు నమ్మకంగా.

పెద్దిరెడ్డి, డాక్టర్ ప్రతాప్, అంజిరెడ్డి వెంటనే పక్కున నవ్వారు.

"మీరంతా ఎంత అమాయకులో, మీలో వున్న మూఢనమ్మకం ఎంత బలమైందో మీకు తెలియజేయడానికే ఈ చిన్న నాటకం ఈ కుర్రాడి చేత ఆడించి మీకు చూపించాను."

"వెరీగుడ్ అంజిరెడ్డి. నేను చెప్పినట్లు ఎంతో చక్కగా యాక్ట్ చేసావు. అందరినీ హడలుగొట్టించావు. నీ యాక్టింగ్‌కి మెచ్చుకుని నీకు నేను ఈ పెన్ బహుమతిగా ఇస్తున్నాను" అని ప్రతాప్ అంజిరెడ్డికి పెన్ను ఇచ్చాడు.

వాడు సంతోషంగా దానిని అందుకుని తల్లిదండ్రులకు, అక్కడున్న వారందరికీ దాన్ని చూపించాడు.

"సూడండి. మనవందరం ఎంత తెలివిమాలినోల్లవో, మన్ది ఎంత గుడ్డి ఇసవాసవో మన కల్లముందే ఇప్పుడీసిసూపించేరు డాట్టరు భావు. బొడ్డూడని గుంటడు సేతబడి సెయ్యడవేటి, వానికిరుగుడెట్టవేటని ఒక్కరుకూడా వోదన సెయ్యనేదు. నిజివే అని వొంత పాడినారు. ఈతూరి ఆడు మీకాడకొచ్చి జరావొరిసేస్తే ఆడికి కూడా సొమ్ము సేతిల ఎట్టి దండ వెడతారా?" అన్నాడు పెద్దిరెడ్డి.

గ్రామపెద్దలకిదంతా అయోమయంగా వుంది. కళ్లతో చూసింది కాదనలేకపోతున్నారు.

"చూడండి మంత్రాలు, చేతబడులు అనేవి లేవు. అవన్నీ మీ మూఢ నమ్మకాలు మాత్రమే. మీ అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని మిమ్మల్ని భయపెట్టి నమ్మించి

మీ దగ్గర డబ్బు వసూలు చేస్తున్నారు మంత్రగాళ్ళు. చూడండి ఈ నిమ్మపండు కోస్తే అందులోనుంచి ఎర్రటి ద్రవం వచ్చింది. దానిని చూసి మీరు నెత్తురనుకుని భయపడ్డారు. నిజానికది నెత్తురుకాదు. నా చాకుకి ఈ ఆకుపసరు పూసాను. దానితో నిమ్మపండు కోస్తే ఇలా ఎర్రగా రసాయన ప్రక్రియ చెందుతుంది. ఇక రెండోది క్రిందపడ్డ పెద్దిరెడ్డిగారి చేతిరుమాలు భగ్గున మండడం. భాస్వరం గాలిలో ఉంచితే అది ఈ విధంగా వెంటనే మండుతుంది'' అని అన్నీ వారికి వివరంగా చెప్పి చేసి చూపించాడు. తరువాత అదే విషయం ఫిల్మ్ వేసి చూపించాడు.

దాంతో వారంతా తమ అమాయకత్వానికి, గుడ్డి నమ్మకానికి ఎంతో సిగ్గుపడ్డారు.

''మంత్రాలు, తంత్రాలు, చేతబడులూ అంతా బూటకమే! అవన్నీ పొట్టకూటికోసం సోమరిపోతులు ఆడే నాటకాలు. అమాయకులని హడలుకొట్టించి సొమ్ము చేసుకోవడమే మంత్రగాళ్ల పని! వీటికి సంబంధించిన మరికొన్ని వివరాలు, ఫిల్మ్‌లు మీకు నేను చూపిస్తాను'' అని చెప్పేడు ప్రతాప్.

ప్రతాప్ మాటల్లో గ్రామప్రజలకు ఎంతో గురికుదిరింది. ఇప్పుడు వారిలో ఎంతో చైతన్యం వచ్చింది. అతడు సూచించిన ఆరోగ్య సూత్రాలన్నీ చక్కగా పాటిస్తున్నారు. వారికి కావలసిన సదుపాయాలన్నీ పెద్దిరెడ్డి సమకూరుస్తున్నాడు.

ఆర్థిక ఇబ్బందులు, కుటుంబ బాధ్యతలు, పనుల ఒత్తిడి, యాంగ్జయిటీ మొదలైన వాటివల్ల పేద, మధ్య తరగతి కుటుంబీకులు వారికి తెలియకుండానే హిస్టీరియా అనే మానసిక రోగానికి గురవుతుంటారు. ఇది ముఖ్యంగా ఆడవారిలో ఎక్కువగా వుంటుంది.

''హిస్టీరియాకు గురైనవారి ప్రవర్తన ఎంతో విపరీతంగా వుంటుంది. దానిని మనవారు చూసి 'చేతబడి' అని భయపడతారు. భయం వల్ల ఎన్నో అనర్థాలు కలుగుతాయి. మానసిక రోగాలు వస్తాయి. ఈ మానసిక రోగాలు-హిస్టీరియా ఎన్నో రకాలు- సాధారణంగా ఇష్టంలేని పనులు ఎవరూ చెయ్యరు. తప్పించుకునేందుకు ఎన్నో ప్రయత్నాలు చేస్తారు. అటువంటప్పుడు మనస్సు, మెదడు బలహీనపడి తప్పించుకోవాలనుకునే పని, చేయవలసిన అవయవాలు తాత్కాలికంగా చచ్చుపడిపోతాయి. వాటిలో చలనం వుండదు. భయం వల్ల వచ్చే ఈ జబ్బును 'కన్వర్షన్ సిండ్రోమ్' టెంపరరీ పక్షవాతం అంటారు. అలాగే కొందరికి సడన్‌గా మాట

పడిపోతుంది. ఇటువంటి జబ్బుని 'అఫోనియా' అంటారు. మరికొందరు తమకు నచ్చని వాతావరణం, ప్రదేశాలనుండి బయటపడి దూరంగా పోవాలని తాపత్రయపడి వింతగా ప్రవర్తిస్తారు. అమాయక ప్రజలలోగల మూఢవిశ్వాసాల వల్ల ఇవన్నీ 'చేతబడి' వల్ల వచ్చినవేనని నమ్మి మంత్రగాళ్లను ఆశ్రయిస్తారు. అంతేకాని మానసిక వైద్యులకు చూపించరు" అని చెప్పి వాటికి సంబంధించిన ఫిల్ములు చూపించి వారి అనుమానాలు తీర్చేడు ప్రతాప్.

పట్నం నుండి పశువుల డాక్టర్ని రప్పించి పశువులకు, పక్షులకు సాధారణంగా వచ్చే రకరకాల జబ్బులు, వాటి నివారణ కోసం వాడవలసిన మందులు, తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి వారికి చెప్పించేడు. అంతేకాదు పంటలకు పట్టే రకరకాల చీడలు, వాటి నివారణకు చేపట్టవలసిన సస్యరక్షణ చర్యలు గురించి వివరాలు వారికి చెప్పించి చైతన్యవంతుల్ని చేసేడు డాక్టర్ ప్రతాప్.

గ్రామస్తులంతా ఇప్పుడు ప్రతాప్‌ని తమ పాలిట దైవంగా భావిస్తున్నారు. అతని సూచనలు పాటిస్తున్నారు. ఏమాత్రం నలతగా వున్నా అశ్రద్ధ చేయకుండా అతనిని సంప్రదించి మందులు వాడుతున్నారు. ఆరోగ్య సూత్రాలు చక్కగా పాటిస్తున్నారు. తమ పశువుల్ని, పక్షుల్ని పశువైద్యుడికి చూపించి వాటికి అవసరమైన చికిత్స చేయిస్తున్నారు.

మరిడయ్య వద్దకు ఎవ్వరూ వెళ్లడంలేదు. అతడి మంత్రతంత్రాలు, తావీదులు ఎవ్వరూ నమ్మడం లేదు. అతడి పూనకం ఎవరూ పట్టించుకోవడంలేదు. అతడు ఇన్నాళ్ళూ ఏ విధంగా తమని భయపెట్టి మోసం చేసి డబ్బులు తీసుకున్నాడో గ్రామస్థులు తెలుసుకున్నారు. వాడిని, వాడి శిష్యులను గ్రామంలో తిరగనివ్వడంలేదు. ఇప్పుడు మరిడయ్య ఆదాయం పూర్తిగా పడిపోయింది. దీనికంతకూ కారణం ఆ కుర్రడాక్టరేనని అతనిమీద చాలా కోపం వచ్చింది మరిడయ్యకు. అతనిని మాటలతో బెదిరించి లాభం లేదనుకున్నాడు. ఓ రోజో రాత్రి కాపుకాసి ఒంటరిగా వస్తున్న డాక్టర్ ప్రతాప్‌ని తలపై కర్రతో కొట్టాడు మరిడయ్య.

ప్రతాప్ తలకి గాయమైంది. అటుగా వస్తున్న ప్రజలు ఈ దృశ్యం చూసి మరిడయ్యను వెంటతరిమారు. వాడు చీకట్లో ఎటో తప్పించుకున్నాడు. వారు డాక్టర్ ప్రతాప్‌ని ఇంటికి చేర్చి పరిచర్యలు చేసారు. విషయం తెలుసుకున్న ప్రతాప్ తల్లిదండ్రులు, పోలీసు బలగం తెల్లవారేసరికి ఊర్లో దిగారు.

పెద్దిరెడ్డి వారందరినీ ఇంటివద్ద కూర్చోబెట్టి వారిని సమాధానపరచి తగిన మర్యాదలు చేసాడు. మనుష్యులను నలుమూలల పంపి మరిడయ్యను తీసుకుని రమ్మనమని పురమాయించాడు. చుట్టుప్రక్కల గ్రామ ప్రజలందరూ ప్రతాప్‌ని చూడడానికి వచ్చారు..

ప్రెసిడెంట్ పంపినవారికి మరిడయ్య కొండవాగు ప్రక్క చింతలతోపులో దొరికాడు. వాడికి కలరా సోకడంతో అక్కడవాడు పీనుగులా పడి వున్నాడు. తెలివితప్పి పడివున్న వాడిని మోసుకొచ్చారు.

"ఈడికి గొట్టాలమ్మ సూపిందండి. ఈడు గడియో సిటవో కునికీసేవోడండి" అన్నారు వాడిని మోసుకొచ్చినవాళ్ళు.

డాక్టర్ ప్రతాప్ మరిడయ్యను పరీక్షించి వాడికి ఇంజెక్షన్ ఇచ్చి గ్లూకోజ్ ఎక్కించాడు. మరో గంటకి వాడు గండం నుండి బయటపడ్డాడు.

"తవరు దేవుడే బాబూ. తెలవక తవమీద సేయిచేసుకున్నా నా పేనాలు కాపాడారు. సెమించండి. బాబూ ఇన్నాళ్లూ కూటికోసం నాను ఏసం కట్టిన. నాకు మంతర తంతరాలు వైద్దం ఏటీ తెలవదు. ఈ పొద్దు నుండి అటి జోలెల్లను. తమ పాదాల సాచ్చిగ సెవతన్నాను. కూలిసేసుకు బతుకతను" అని ప్రతాప్ కాళ్ల మీద పడ్డాడు మరిడయ్య.

"ఇంతొరకూ మావందరం గుడ్డి నమ్మకాలత ఎట్టా బతకతన్నావో బోదసేసి మా కల్లు దెరిపించిన దేవుడి నాటి బాబుమీద సెయ్యి సేసుకున్నోడిని ఊరికే ఒగ్గేయడమా! ఈల్లేదు ఆడికి సిచ్చపడాల" అన్నారు గ్రామ ప్రజలు రెచ్చిపోయి.

మరిడయ్య మీద కేసు బుక్‌చేసి వాడిని లాకప్‌లో వేయడానికి పోలీసులు ముందుకొచ్చారు. పెద్దిరెడ్డి ప్రతాప్ వంక చూసాడు.

"ఆగండి మరిడయ్యను మీరు ఏ నేరం మీద అరెస్ట్‌చేస్తారు?" అన్నాడు డాక్టర్ ప్రతాప్.

"అదేమిటి సార్! అతను మీమీద హత్యాప్రయత్నం చేసేడుకదా!" అన్నారు పోలీసులు.

"హత్యా ప్రయత్నమా? ఎవరు చెప్పారు మీకు? నేను మీకు అతనిమీద

ఎలాంటి రిపోర్టు ఇవ్వలేదే?" అన్నాడు ప్రతాప్.

ప్రతాప్ మాటలకు అంతా నివ్వెరపోయారు.

"అదేమిటిసార్! మీ తలకు అంత గాయమైతేను" అన్నాడు ఎస్ఐ.

"ఓ ఇదా? రాత్రి చీకట్లో కాలు స్లిప్ అయి పడ్డాను అంతే!" అన్నాడు చిర్నవ్వుతో.

ప్రెసిడెంట్ పెద్దిరెడ్డి, ప్రతాప్ తండ్రి విజయ్‌కుమార్ కృతజ్ఞతతో అతని వంకచూసారు. "నేరం చేసినవాడిని శిక్షించడం కంటే వాడిలో పశ్చాత్తాపం కలుగజేసి వాడు తిరిగి ఏ నేరం చేయకుండా చేసి వాడిని మంచి మార్గంలో నడిపించడమే గొప్ప విషయం" అన్న డాక్టర్ ప్రతాప్ సిద్ధాంతాన్ని గ్రామ ప్రజలు హర్షించారు.

**('ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక', జూలై 2000)** ✪

# ముందుజాగ్రత్త

"మిస్ మంజులా నాలుగు అర్జంట్ లెటర్స్ వున్నాయి. డిక్టేషన్ తీసుకుంటారా? నా స్టెనో యీరోజు రాలేదు" అంటూ మంజుల సీటు వద్దకు వచ్చి అడిగేడు జూనియర్ మేనేజర్ మాధవరావు.

"చూడండి మిస్టర్! ఆవిడ టైపిస్ట్! స్టెనో కాదు మీ దగ్గర డిక్టేషన్స్ తీసుకోడానికి డ్రాఫ్ట్ రాసి పంపించండి టైప్ చేస్తుంది " అంది సత్యభామ.

మాధవరావు తుళ్ళిపడ్డాడు సత్యభామ మాటలకు.

"అది కాదండీ.., మంజులగారికి షార్ట్‌హేండు వచ్చుకదా! అందుకని అడిగేను..."

"ఆవిడకే కాదు నాకూ వచ్చునిమీకు తెల్సు కదా! మరి నన్నడగ లేదేం?"

"మీరు లోగడ బ్లంట్‌గా చెప్పేరు కదా! నేను టైపిస్ట్‌ని కనుక టైపింగ్ వర్క్ మాత్రమే చేస్తాను. స్టెనోని కాదు కనుక డిక్టేషన్స్ తీసుకోను" అని.

"అవును కదా! ఆవిడ కూడా అంతే! టైపిస్ట్ కనుక డిక్టేషన్స్ తీసుకోదు" అంది కాస్త కటువుగా.

మాధవరావు వదనం చిన్నబోయింది.

"సారీ!" అంటూ తలవంచుకొని తన కేబిన్‌లోకి వెళ్ళిపోయేడు.

మాధవరావు అవస్థ చూసి కొద్దిగా బాధపడింది మంజుల.

మాధవరావుది మంచి పర్సనాల్టీ. ఆడవాళ్ళను ఆకట్టుకొనే అందం, ఎప్పుడూ నీట్‌గా వుంటాడు. బ్రహ్మచారి.

"ఏమిటి సత్యా! మరీ అంత రూడ్‌గా సమాధానం చెప్పేవు..." అంటూ యింకా ఏమో చెప్పబోయింది మంజుల.



"వీళ్ళ సంగతి నీకింకా తెలియదు మంజూ! సమయం దొరికినప్పుడు మనం
ఉపేక్షించకూడదు. లేకుంటే వెధవ్వేషాలు వేస్తారు తెలుసా!" అంది సత్యభామ
ఆవేశంగా.

మంజుల జాబ్‌లో చేరి వారం రోజులే అవడం వల్ల ఆమెకు ఎవరి గురించీ అంతగా తెలియదు కనుక ఆ విషయం మరి ప్రస్తావించలేదు.

మంజుల, సత్యభామ ఒకే యీడువారు. ఒకే వీధిలో వుంటున్నారు, సత్యభామ టెన్త్ పాసయి, టైపూ షార్ట్‌హేండూ పాసయి ఒక ప్రైవేట్ కంపెనీలో టైపిస్ట్ జాబ్ చేస్తోంది. మంజుల బి.కాం, డిగ్రీ పుచ్చుకుని టైపూ షార్ట్‌హేండూ పాసైంది. సత్యభామ పని చేస్తున్న కంపెనీలో మరొక టైపిస్ట్ పోస్ట్ వేకెన్సీ వస్తే ఆ జాబ్ మంజులకి తన పలుకుబడితో యిప్పించింది సత్యభామ.

మంజుల మంచి నాజూగ్గానూ, ఎంతో అందంగా వుంటుంది. సత్యభామ అందకత్తె

కాకపోయినా చురుకైన వ్యక్తి.

ఓ ఆదివారం సాయంత్రం మంజుల తన తమ్ముడు గోపీని తీసుకొని బజారుకి బయల్దేరింది.

దారిలో స్కూటర్ మీద వస్తున్న మాధవరావును, అతని వెనుక కూర్చుని మాధవరావు నడుంచుట్టూ చేతులు వేసి నవ్వుతూ కబుర్లు చెప్తున్న సత్యభామను చూసింది.

సత్యభామ, మాధవరావులు ప్రేమికులని, అయితే తన ప్రియుడి దృష్టి మరో అమ్మాయి మీద పడకుండా ఎంతో నేర్పుతో సత్యభామ కవర్ చేసుకొస్తున్న విషయం గ్రహించిన మంజుల ఆశ్చర్యంగా వాళ్ళవైపే చూస్తూ వుండిపోయింది.

**('ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక', ఆగష్టు 2000)** ✪

# ఆదర్శాలు

పురుషోత్తమరావు గొప్ప ఆదర్శ పురుషుడు. అతని ఆదర్శాల వల్లే ఒక విధంగా అటు బంధువులకూ యిటు స్నేహితులకూ దూరమయ్యేడు.

పురుషోత్తమరావుకు పిత్రార్జితం పుష్కలంగా వుంది. స్ట్రిక్ట్ ఆఫీసర్‌గా పేరుంది.

అతను ఆఫీసరుగా చార్జి తీసుకున్న రోజే స్టాఫ్ అందర్నీ సమావేశపరిచి "ఆఫీసులో అందరూ డిసిప్లేన్ పాటించాలని వర్క్‌టైమ్ ప్రకారం పూర్తవ్వాలని, టైమింగ్స్ రిజిడ్‌గా ఫాలో అవ్వాలని, పార్టీలను ఎవరూ ఎక్కువసేపు ఎంటర్‌టైన్ చెయ్యక వారి పని సత్వరం ముగించి పంపాలని" రూల్స్ పాస్ చేసేడు. అంతేకాదు - ఏ రూపంలోనూ లంచం పుచ్చుకోరాదని, అలా పుచ్చుకున్నవారిపైనా, యిచ్చినవారిపైనా కఠినంగా చర్య తీసుకుంటా" నని చెప్పేడు.

ఒకరోజు ఉదయం పదకొండు గంటల సమయంలో పురుషోత్తమరావు ఆఫీస్‌వర్క్ చూసుకుంటున్న సమయంలో ప్యూన్ వచ్చి-

"సార్! ఎవరో ఆవిడ వచ్చేరు. తవర్ని వెంటనే చూడాలంటున్నారు" అన్నాడు.

వచ్చిన ఆమె వయస్సు సుమారు మూడు పదులలోపే వుంటుంది. చామనచాయ రంగు మనిషి పుష్టిగా వుంది. ముఖంలో మంచి కళ వుంది.

"దండాలండి! యిది తవదే కదండీ!" అంటూ జాకెట్‌లో చెయ్యిపెట్టి చిన్న కార్డ్ తీసి పురుషోత్తమరావు కిచ్చింది.

"ఓ మైగాడ్! ఎక్కడ దొరికిందమ్మాయిది నీకు!" అన్నాడు ఆశ్చర్యంతో.

అది పురుషోత్తమరావు 'బేంక్ క్రెడిట్ కార్డ్'.

"పెట్రోలు బంకు కాడండి! తవ జేబీలోంచి నేలమీద పడిపోనాదండి! తవరు కానుకోనేదు కారెక్కి ఎల్లిపోనారు.."

"థాంక్స్! ఇది ఎంతో విలువైంది! పాపం ఎండలో శ్రమపడి చాలాదూరం నుంచి తెచ్చి యిచ్చేవు!" అని పర్స్‌లోంచి ఇరవై రూపాయల నోటు తీసి ఆమె చేతిలో వుంచి 'టీ త్రాగు' అన్నాడు కృతజ్ఞతతో.

"ఏటి బాబూ! తవరు నాకు నంచం ఎడతన్నారా?" అంది పౌరుషంగా.

ఆమె కామెంట్‌కు పురుషోత్తమరావు షాక్ అయ్యేడు.

"అబ్బే యిది లంచం కాదమ్మా! యిది నేను నీకు..." అంటూ ఏమో చెప్పబోయేడు.

"ఏటేటి? నంచం గాదా! మరి... ఓలమ్మ.. ఓలమ్మ నాను అట్టాంటిదాన్ని అనుకున్నావేటి?" అంటూ విసురుగా బయటకు వచ్చి "సూడండి భావులూ! ఆఫీసరాయన సేతిలో నోటెట్టి ఏటేటో అంతన్నాడు!" అంది బిగ్గరగా.

ఆమె కేకలకి ఆఫీసు స్టాఫ్, అదే ఫ్లోర్‌లో వున్న యితర ఆఫీసుల్లోవారూ ఆమె చుట్టూ మూగేరు.

"ఏమయ్యా! ఎన్నో ఆదర్శాలు వల్లిస్తావ్! ఎంతో నీతి మంతుడని విర్రవీగుతావు! యిదేం పనయ్యా నీకు! చెప్పేవి శ్రీరంగనీతులు..." అని నిలదీసారు.

పురుషోత్తమరావుకి నలుగురిలో తలవంపులైంది.

"స్టాపిట్! నాన్సెన్స్! నిజా నిజాలు తెల్సుకోక ఏమిటి మీరు అంటున్నది! నా బేంక్ క్రెడిట్ కార్డ్ రోడ్డుమీద పడి పోతే యీవిడకు దొరికిందని తెచ్చి యిచ్చింది. ఆమె చేసిన సహాయానికి కృతజ్ఞతతో..."

"నా సేతిల నంచం ఎట్టేనంతావ్!" అంది ఎగతాళిగా.

"ఛా! దాన్ని లంచం అనకూడదమ్మా! బహుమానం, బక్షీస్ అనాలి!" అన్నారు గుంపులో ఒకాయన వ్యంగ్యంగా.

"అవును! కరెక్ట్‌గా చెప్పేరు! యీవిడ ఎండలో ఎంతో శ్రమపడి నన్ను వెతుక్కుంటూ వచ్చి నేను పోగొట్టుకున్న వస్తువు తెచ్చి నాకు యిచ్చినందుకు బహుమానం!"అన్నాడు.

"'ఏటేటీ? పెద్దోల సేతిల యిచ్చేది బగుమానం! బచ్చీసా మరి పుచ్చుకున్న కూలోడి సేతిల అది నంచవా! ఆరికో నీతి మాకో నీతా! ఇనండి భావులూ నాయం!' ' అంది ఆవేశంగా.

"అలా అని ఎవరనగలరు? నేను సంతోషంతో యిచ్చింది లంచం ఎట్లాగవుతుంది బహుమానం గాక!"

అట్టాగేం? మరి నా పెనిమిటి ఆదిమూర్తి ఏ నేరం సేసేడని ఉజ్జోగలం నెల దినాలు సస్పిండు సేసేసినావు? ఆ పెద్దాయన ఎవుడో సంతోషంతో "ఛాయి దాగమని' ' పది రూపాయల నోటు సేతిలో ఎట్టి ఎల్లిపోనాడు. అత్తెరి ఆది కాడు నువ్వు నంచం పుచ్చుకున్నావు! యీ పొద్దు నా కంటపడింది! నాను సూడకుండా ఎందరికాడ నంచాలు పుచ్చుకుంతున్నావో! అని నెలదినాలు సస్పిండు సేసినారు గందా! మరది నంచవైతే యిదేటీ?" అంది ఉక్రోషంగా.

నిజమే! వారం రోజుల క్రితం ఆదిమూర్తికి ఒక కస్టమర్ పదిరూపాయల నోటు యివ్వటం పురుషోత్తమరావు కంట పడింది. ఆదిమూర్తి లంచం తీసుకున్నాడన్న నేరంపై అతడిని నెలరోజులు సస్పెండ్ చేసేడు. అతడి తప్పులేదని ఎందరు ఎన్ని విధాలుగా చెప్పినా పురుషోత్తమరావు వినలేదు.

"అంటే నువ్వు ఆదిమూర్తి భార్యవా!" అన్నాడు పురుషోత్తమరావు తడారిన గొంతుకతో.

**(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక , ఫిబ్రవరి 2000)** ✪

# లక్ష్యం

"తాతయ్యకు ఈ వయసులో ఇంకా ప్రజాసేవ పాలిటిక్స్ ఎందుకుమమ్మీ? చేసినన్నాళ్ళు ప్రజాసేవ చేసారు. ఇక మీదట రెస్ట్ తీసుకోవచ్చుకదా! ఆ పల్లెటూరుని పట్టుకొని పాకులాడ్డం ఎందుకు? మన వద్దకు వచ్చి హేపీగా ఉండొచ్చుకదా!" అన్నాడు శ్రీనివాస్.

"ఆయనకు ఎవరు చెప్పగలరురా? ఎవరి మాటా వినరు. మీ డాడీ లోడగ ఎన్నో పర్యాయాలు చెప్పి చూసేరు. ఆ పొలాలు ఎవరికైనా అమ్మివేయండి! లేదా కౌలుకిచ్చి వచ్చేయమని. వింటేనా? 'నాకా పట్నంలో ఏం తోచదు! పుట్టిపెరిగిన ఊరు వదిలిరాను' అన్నారు. సరే ఆయనకు ఎక్కడ ప్రశాంతంగా ఉంటే అక్కడే ఉండనీ అని మీ డాడీ మరి ఆయనను ఫోర్స్ చెయ్యలేదు" అంది భవాని.

"ఇప్పుడేమో మరి ఈ ఫంక్షనుకి వెళ్ళక తప్పదుకదా?"

"తప్పదురా! మీ తాతగారు మనల్ని నాలుగురోజులు ముందరే రమ్మనమని ఫోన్లో మరీమరీ చెప్పారు. మీ డాడీ కేంప్‌నుంచి రావడానికి మరో రెండు రోజులు పడుతుందిట! అందుకని ముందుగా నిన్ను పంపమని చెప్పేరు. ఎల్లుండి మేమిద్దరం వస్తాం" అంది.

"ముందుగా వెళ్ళి నేనేం చెయ్యాలి మమ్మీ! నాకు ఇక్కడ ఎన్నో పన్లు ఉన్నాయి. నా జాబ్ విషయం ఇంకా ఏదీ డిసైడ్ చేసుకోలేదు! డాడీ రెండు ఆఫర్స్ చూసేరు. రెండూ మంచివే. ఛాయిస్ నీదే అన్నారు. అయినా తాతయ్యకు ఆ పట్టుదల ఏంటి మమ్మీ? పల్లెటూర్లో హాస్పిటల్ కట్టించగానే సరా? అక్కడ డాక్టర్‌గా పని చెయ్యడానికి ఎవరిష్టపడతారు? ఒకవేళ వచ్చినా ఎన్నాళ్ళుంటారు? మమ్మీ నేను ఎగైన్ అండ్ ఎగైన్ చెప్తున్నా. నన్ను ఎవరు ఫోర్స్ చేసినా నేనా ఆ పల్లెటూర్లో ప్రాక్టీస్ చెయ్యను" అన్నాడు.



"సరేరా! నిన్ను మరి ఎవరూ ఫోర్స్ చేయ్యరు. లోడగ నువ్వు నీ ఒపీనియన్ మీ తాతగారికి  చెప్పేవుకదా! నువ్వు ఫారిన్ నుంచి వచ్చి రెండు వారాలైంది. మీ నాయనమ్మగారు నిన్ను చూడాలని ఒకటే ఆరాటపడుతున్నారు. వెళ్ళి పెద్దావిడ వద్ద రెండురోజులుంటే ఆవిడ ఆనందిస్తారు. నువ్వు జాబ్‌లో చేరితే ఎలాగూ వీలవదు" అంది భవాని.

శ్రీనివాస్  తల్లి మాట కాదనలేకపోయాడు. సూట్‌కేసులో బట్టలు సర్దుకున్నాడు. తాతయ్యకు, నాయనమ్మకు ఫారిన్ నుంచి తెచ్చిన గిఫ్టులు తీసుకొని రామవరం బయల్దేరేడు.

గౌరీపతిశాస్త్రిగారు రామవరంలో సమితి ప్రెసిడెంట్. గత ఆరుదఫాలుగా ఆయన ఆ పదవికి ఏకగ్రీవంగా ఎన్నికవుతున్నారు. అందుకు కారణం ఆయన నిస్వార్థ ప్రజాసేవ. రామవరం మేజరు పంచాయితీ. సుమారు పన్నెండు గ్రామాలకు కూడలి.

జాతీయ రహదారి పక్కనే ఉంది.శాస్త్రిగారికి ఈ పన్నెండు గ్రామాల్లో మంచి పలుకుబడి, గౌరవం ఉన్నాయి. ప్రజల కోసం ఆయన ఎన్నో మంచి పనులు చేయించేరు. గ్రామల్లో చక్కటి సిమెంటు రోడ్లు వేయించి, మురుగునీటి కాలువలు ఏర్పాటు చేయించారు. తాగునీరు, సాగునీటి సదుపాయాలు కల్పించారు. జూనియర్ కాలేజీ, బ్యాంకు, పోస్టాఫీసు, టెలిఫోన్ సదుపాయాలన్నీ సమకూర్చారు. గ్రామాల్లో అందరికీ పక్కాఇళ్ళు ఉన్నాయి. పూరిళ్ళులేవు. కులమత విచక్షణ లేకుండా ఎవరికి ఎప్పుడు ఎటువంటి సహాయం కావాల్సినా ఆయన చేస్తున్నారు.

రామవరంలో శాస్త్రిగారికి పిత్రార్జితం యాభై ఎకరాలు మాగాణీ పొలం, పది ఎకరాల కొబ్బరి, అరటి, మామిడి, బత్తాయి, నిమ్మ తోటలున్నాయి. అధునాతన సౌకర్యాలన్నీ ఉన్న పెద్ద ఇల్లుంది.

గౌరీపతిశాస్త్రిగారి ధర్మపత్ని త్రిపుర సుందరి. దానధర్మాలు చెయ్యడంలో ఆమె చేతికి ఎముకే లేదంటారు ప్రజలు. భర్తకు అన్నివిధాలా అనుకూలవతి. వారి ఏకైక కుమారుడు విశ్వనాథశాస్త్రి, కోడలు భవాని, మనవడు శ్రీనివాస్. విశ్వనాథశాస్త్రి హైదరాబాద్‌లో బ్యాంక్ జోనల్ మేనేజర్‌గా జాబ్ చేస్తున్నాడు. శ్రీనివాస్ మెడిసిన్‌లో ఎమ్.ఎస్.. చేసి పై చదువులకు అమెరికావెళ్ళి చదువు పూర్తిచేసుకొని రెండు వారాల క్రితం తిరిగి వచ్చాడు.

గ్రామ ప్రజలకు మంచి వైద్యసదుపాయం కలిగించాలని శాస్త్రిగారి ఆశయం. అందుకోసం రామవరంలో హాస్పిటల్ కట్టిస్తే చుట్టుపక్కలున్న పన్నెండు గ్రామాల ప్రజలకు వైద్య సహాయం లభిస్తుందని ఆయన భావన. మనవడు శ్రీనివాస్ మెడిసిన్‌లో చేరగానే ఆయన కోరిక మరింత బలపడి ఓ రూపుదిద్దుకుంది.

రామవరంలో జాతీయ రహదారికి చేరువలో ఉన్న ఆయన పొలంలో మూడు ఎకరాల స్థలంలో హాస్పిటల్ బిల్డింగ్‌కి, రెండు ఎకరాలస్థలం డాక్టర్‌కి, స్టాఫ్‌కి ఇళ్లకోసం కేటాయించేరు. వాటి నిర్మాణం పనులు ప్రారంభించగానే చుట్టుపక్కల గ్రామాల్లోని మోతుబరులు ఆయనకు చేయూత నిచ్చారు. గ్రామప్రజలు శ్రమదానం చేసేరు.

"నువ్వు చదువు పూర్తిచేసుకుని వచ్చేసరికి నీ కోసం అన్ని హంగులతోనూ మన ఊర్లో మంచి హాస్పటల్ కట్టించి ఉంచుతాను. నీ ప్రాక్టీసు మన ఊర్లోనే పెట్టి గ్రామప్రజలకు వైద్య సహాయం అందించు" అని మనవడికి చెప్పేరు గౌరీపతిశాస్త్రిగారు.

"పల్లెటూర్లో నేను ప్రాక్టీసు పెట్టను తాతయ్యా!" అని తన నిర్ణయాన్ని సీరియస్‌గానే తెలిపేడు శ్రీనివాస్.

మనవడి మాటలకు ఆయన చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు. మనవడు పై చదువులకు అమెరికా వెళ్తున్నాడని విని ఎంతో ఆనందించారు.

తాను మనవడితో చెప్పిన విధంగానే శ్రీనివాస్ అమెరికా నుంచి తిరిగి వచ్చేసరికి రామవరంలో పది పడకల హాస్పటల్ అన్ని హంగులతోనూ రెడీ చేయించారు. డాక్టర్ ఉండడానికి టూబెడ్‌రూమ్స్ ఇల్లు, స్టాఫ్ కొరకు సింగిల్ బెడ్‌రూమ్ గల నాలుగ ఇళ్ళు రెడీ చేయించారు.

హాస్పటల్ ఓపెనింగ్‌కి ముహూర్తం నిర్ణయించి ఆ ఫంక్షన్‌కి కొడుకు,కోడలు, మనవడిని నాలుగు రోజులు ముందుగా రమ్మనమని ఫోన్లో చెప్పారు.

తాతగారు ఇన్నాళ్ళూ తనతో ఏదో జోక్ చేస్తున్నారు అనుకున్నాడు శ్రీనివాస్. అయితే అది జోక్ కాదనీ, ఆమన రామవరంలో పది పడకల హాస్పిటల్ కట్టించి దాని ఓపెనింగ్ రాష్ట్రమంత్రి గారిచేత చేయించబోతున్న విషయం శ్రీనివాస్ ఫారిన్ నుంచి వచ్చిన వెంటనే విని ఆశ్చర్యపోయాడు. తాతగారి మొండి పట్టుదలకు విసుక్కున్నాడు. ఆ కారణంగానే ఫారిన్ నుండి వచ్చి రెండు వారాలైనా ఆయనను చూడ్డానికి వెళ్లకుండా వాయిదావేస్తున్నాడు.

స్టేషన్‌కి జీప్ రావడంతో శ్రీనివాస్ సంతోషించాడు.

"పెద్దమ్మగోరూ... పెద్దమ్మగోరూ సీను బుగతగోరు వొచ్చీసినారండి!" అని అసిరయ్య కేకపెట్టి జీపు వద్దకు వెళ్ళాడు.

"దండాలు సీను బాబూ! ఏటి నాకేసి అట్టా సూస్తన్నారు? నన్ను పోల్తిపట్టనేదేటి? నాను అసిరయ్యను" అన్నాడు.

"అరిసినాయుడు ! బాగున్నావా?" అన్నాడు చిరునవ్వుతో.

"అదీ యిప్పుడు ఒప్పుతాను అరిసినాయుడనీసినారు! తవకి నాను గురుతున్నా! తవరిదయవొల్ల బాగున్నా బాబూ" అన్నాడు అసిరయ్య సంతోషంతో.

శ్రీనివాస్ చిన్నతనంలో అసిరయ్యను అరిసినాయుడు అని పిలిచేవాడు.

సుందరమ్మగారు మనవడికి గుమ్మంలోనే దిష్టితీసి కుశల ప్రశ్నలు వేస్తూ

లోనికి తీసుకుని వెళ్ళారు. శాస్త్రిగారు జపం ముగించుకొని పట్టు పంచతోనే వచ్చి మనవణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నారు.

"రెండు వారాల క్రితమే ఫారిన్ నుంచి వచ్చి ఈ ముసలి వాళ్లను చూడ్డానికిప్పటికి వీలు చిక్కిందన్న మాట" అన్నారు.

"అది కాదు తాతయ్యా! వచ్చిందగ్గర్నుంచి ఏవో అర్జంటు పన్లు! అదీగాక నాకు జాబ్ కోసం రెండు మంచి ఆఫర్లు వచ్చాయి. రెండూ హైదరాబాద్‌లోనే! వాటి గురించి డాడీతో డిస్కషన్స్ ! అందువల్ల వెంటనే రాలేకపోయాను. సారీ తాతయ్యా" అన్నాడు కాస్త గిల్టీగా ఫీలయి.

ఫారిన్ నుంచి తెచ్చిన గిఫ్ట్‌లు వారికిచ్చాడు. వాటిని చూసివారు ఎంతో సంతోషించారు.

స్నానం చేసి వచ్చి టిఫిన్ తింటూ అమెరికా విశేషాలు తాతగారికి, నాయనమ్మకు చెప్పేడు. వారు విని ఆనందించేరు. పని ఉందని శాస్త్రిగారు జీపులో బయటకు వెళ్ళారు. శ్రీనివాస్ డ్రస్సు మార్చుకొని "నాన్నమ్మా! నేనలా గుడికి వెళ్ళి వస్తాను" అన్నాడు.

"సరే బాబూ! ఎండలో ఇంకెటూ తిరగొద్దు! ఆసిరయ్యను తోడుగా పంపనా?'

"అవసరం లేదు నాన్నమ్మా! నాకు తెలుసు. వెళ్లిరాగలను" అని బయల్దేరాడు.

తారకేశ్వరస్వామి ఆలయం వంశపారంపర్య ధర్మకర్తలు గౌరీపతిశాస్త్రిగారు. సుమారు రెండు వందల సంవత్సరాల పూర్వం శాస్త్రిగారి పూర్వికులు ఆ దేవాలయం కట్టించారు. తారకేశ్వరస్వామి, రాజరాజేశ్వరి, వినాయక విగ్రహాలను ప్రతిష్ఠించారు. వాటికి నిత్య ధూప, దీప నైవేద్యాలకూ, పూజారి, పనివాళ్లకు జీతభత్యాలకు నిధులు సమకూర్చేరు.

గంగాధరం గారు ఆలయ పూజారి, వారి తాత, ముత్తాతలు, నాలుగు తరాలుగా దైవారాధన చేస్తున్నారు. గంగాధరంగారు శాస్త్రిగారి పురోహితులు, స్నేహితులు. ఇద్దరూ ఒకే ఈడువారు.

గుడి మంటపంలో ఓ సౌదామిని కూర్చుని కనకంబరాలు మాలకడుతోంది. శ్రీనివాస్ ఆమె అందానికి ఆకర్షితుడయ్యేడు. "ఈ పల్లెటూరిలో ఈ అందాలరాశి

ఎవరో!" అని ఆశ్చర్యపోయాడు. గుడి పూజారి గంగాదరంగారు కనిపించలేదు. శ్రీనివాస్ దైవదర్శనం చేసుకొని గుడి బయటకు వచ్చాడు.

అంతలో గంగాధరంగారు శ్రీనివాస్‌కి ఎదురొచ్చారు. శ్రీనివాస్ ఆయనకు నమస్కరించాడు.

"బాగున్నావా బాబూ! రా బాబూ హారతి తీసుకొని వెళ్లువుగాని. మీ ఇంటి నుంచే వస్తున్నాను. నాయనమ్మగారు నీ పేర అమ్మవారికి అర్చన చేయించమన్నారు. ప్రసాదం ఇవ్వడానికి మీ ఇంటికి వెళ్లాను. నువ్వు గుడికి వచ్చావని విని ఇలా తొందరగా వచ్చాను" అన్నారు.

శ్రీనివాస్ పరాకుగా ఆయన మాటలు వింటూ మండపం నలుమూలలా చూసేడు. మంటపంలో కాని గుడి ఆవరణలో కాని ఎక్కడా ఆ అందాలరాశి కనిపించలేదు. మెరుపుతీగలా మాయమైంది. ఆమె విషయం పూజారిగారిని అడగాలి అనుకున్నాడు కాని ధైర్యం చాలలేదు.

హారతి కళ్ళకద్దుకొని ఇంటి ముఖం పట్టేడు.

మధ్యాహ్నం భోజనాలు చేసి కాసేపు రెస్ట్ తీసుకున్న తరువాత శాస్త్రిగారు మనవడిని తీసుకువెళ్ళి హాస్పటల్ చూపించేరు. హాస్పిటల్ పక్కనే డాక్టరుకి, స్టాఫ్‌కి ఇళ్లుండడం వల్ల ఇరవైనాలుగు గంటలూ వారి సేవలు రోగులకు అందుతాయి అన్న ఉద్దేశంతో వాటిని కట్టించినట్లు చెప్పేరు.

హాస్పిటల్, పరికరాలు, వార్డు, అవిచూసి శ్రీనివాస్ ఎంతో ఇంప్రెస్ అయ్యాడు. ఎంతో అనుభవంతో కట్టించిన దానిలా ఉందని మెచ్చుకున్నాడు.

"ఇంత ఖర్చుచేసి మంచి హాస్పటల్ ఈ పల్లెలో కట్టించారు కాని దీన్ని సరైన విధంగా నడిపించగల డాక్టర్, స్టాఫ్ దొరుకుతారా?" అనుకున్నాడు.

ఆ సాయంత్రం, మర్నాడు రెండుపూటలా శ్రీనివాస్ గుడికి వెళ్లి మంటపంలో చాలాసేపు కూర్చున్నాడు. అతని మనసు దోచుకున్న ఆ సౌదామిని జాడ తెలియలేదు. ఊరు చూసే నెపంతో అసిరయ్యను వెంటతీసుకొని గ్రామం నలుమూలలా తిరిగొచ్చాడు. గ్రామంలో అడుగడుగునా గౌరీపతిశాస్త్రిగారి మనవడనీ, సీమలో డాక్టరు

చదివి వచ్చాడని శ్రీనివాస్‌ని అందరూ ఎంతో ఆప్యాయంగా పలకరించి గౌరవమర్యాదలు చేసేరు.

సౌదామిని జాడ తెలియలేదు.

గౌరీపతిశాస్త్రిగారు పనుల ఒత్తిడి వల్ల బిజీగా తిరుగుతున్నారు. మనవడితో కాసేపు సరదాగా కబుర్లు చెప్పడానికి ఆయనకు వీలవడం లేదు. అందుకు ఆయన ఎంతో ఫీలవుతున్నారు.

మర్నాడు ఉదయం ఫంక్షన్ అనగా తొలిరోజు శ్రీనివాస్ తల్లిదండ్రులు వచ్చారు. సుందరమ్మగారి ఆనందానికి అంతులేదు. శాస్త్రిగారు కొడుకుతో రాత్రి పొద్దుపోయేవరకు అన్ని విషయాలూ చర్చించారు. ఫంక్షనుకి చేసిన ఏర్పాట్లు వివరించారు.

తెల్లవారేసరికి జిల్లా ఉన్నతాధికారులూ, ఎస్.పి. వారి సిబ్బంది వచ్చి ఫంక్షన్‌కి చేసిన ఏర్పాట్లు చూసి తృప్తి చెందేరు. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు వచ్చారు. టైమ్‌కి మంత్రిగారు, జిల్లా మెడికల్ ఆఫీసర్, మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్, స్టాఫ్ వచ్చారు. మంత్రిగారు గ్రామ ప్రజలనుద్దేశించి ప్రసంగించారు. శాస్త్రిగారు గ్రామప్రజల కోసం చేసిన మంచి పనులు వివరించి వారిని కొనియాడేరు. ప్రజల ఆరోగ్య విషయంలో వారు తలపెట్టిన మంచి కార్యాన్ని, దానికి చేయూతనిచ్చిన గ్రామ పెద్దలను అభినందించారు.

మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్ చక్రపాణిగారు మాటాడుతూ "శ్రీ శాస్త్రిగారి ఆశయం, లక్ష్యం నెరవేర్చడానికి కంకణం కట్టుకున్నది మా కాలెజీ బెస్ట్ స్టూడెంట్‌గా బంగారు పతకం పుచ్చుకున్న మిస్ డాక్టర్ వైజయంతి. విలేజ్ హాస్పటల్‌లో పనిచెయ్యడానికి ఈ రోజుల్లో ఎవరూ ముందుకు రావడంలేదు. అటువంటిది డాక్టర్ వైజయంతి పర్మనెంటుగా ఈ గ్రామం హాస్పటల్‌లో పనిచేస్తూ ప్రజలకు వైద్యసేవలు అందిస్తాననడం ఎంతో హర్షించదగ్గ విషయం" వైజయంతిని వేదిక మీదకు రప్పించి పరిచయం చేసేరు చక్రపాణిగారు.

వైజయంతిని చూసి షాక్ అయ్యాడు శ్రీనివాస్. ఆమె గుడిమండపంలో చూసిన సౌదామిని.

డాక్టర్ వైజయంతి మైక్ ముందుకొచ్చి అందరికీ నమస్కరించి - "నేను ఈ గ్రామ బిడ్డనే! గంగాధరం గారు మా తాతగారు. నేను ఇంటరు వరకు ఈగ్రామంలో ఉన్న జూనియర్ కాలేజీలోనే చదువుకున్నాను. మెడిసిన్ చదివి గ్రామ ప్రజలకు వైద్యసహాయం అందించాలని నా ఆశయం! అయితే తల్లితండ్రులు లేని నన్ను మా తాతగారు చేరదీసి నాకు ఇంటర్ వరకూ చదువు చెప్పించగలిగేరు. ఈ గ్రామంలో గుడి పూజారిగా జీవనం సాగిస్తున్న మా తాతగారికి నన్ను మెడిసిన్ చదివించగల స్తోమతలేదు. ఆ తరుణంలో శ్రీగౌరీపతి శాస్త్రిగారు నా ఆశయం తెల్సుకొని ఎంతో సంతోషించారు. వారి సొంతడబ్బుతో నన్ను మెడిసిన్ చదివించారు. ఆయన దీన్ని గుప్తదానంగా భావించి ఇంతవరకూ ఈ విషయం ఎవరికీ చెప్పలేదు. వారి ఔదార్యానికి సభాముఖంగా నా కృతజ్ఞతలు తెలియజేయడం నా కర్తవ్యం. వారు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. వారు నన్నేకాదు హాస్పిటల్ నిర్వహణకు అవసరమైన స్టాఫ్ నర్సులను, ఇద్దరు ఎ.ఎన్.ఎమ్‌లను కూడా వారి సొంత సొమ్ముతో చదివించారు. వారు నలుగురూ మా గ్రామవాసులే! మేమందరం మా సేవలు గ్రామ ప్రజలకు వినియోగించి వారి ఆశయం నెరవేర్చుతామని, వారి లక్ష్యసాధనకు పాటుపడతామని ప్రతిజ్ఞ చేస్తున్నాం., ఈసందర్భంలో మీ అందరికీ మరో ముఖ్యవిషయం తెలియజేస్తున్నాను. శ్రీగౌరీపతిశాస్త్రిగారి ధర్మపత్ని శ్రీమతి త్రిపురసుందరమ్మగారు ఆమెకు కన్నవారిచ్చిన పది ఎకరాల పొలం అమ్మి ఆ సొమ్ము బ్యాంకులో డిపాజిట్ చేసేరు. దానిపై నెలానెలా వచ్చే వడ్డీ డబ్బు పేదప్రజల వైద్యం కోసం వినియోగించమన్నారు. వారికి మా గ్రామ ప్రజలందరి తరఫునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను." అంది.

గౌరీపతిశాస్త్రి దంపతుల ఔదార్యం, ఆశయాన్ని అందరూ మెచ్చుకున్నారు. నెలకోరోజు వచ్చిరోగులను ఉచితంగా పరీక్షిస్తామని స్పెషలిస్టులు తెలియజేశారు. హాస్పిటల్ ప్రారంభోత్సవం ఎంతో వైభవంగా జరిగింది.

గౌరీపతిశాస్త్రిగారు తన ఆశయం, లక్ష్యం నెరవేరినందుకు ఎంతో సంతోషించారు.

డాక్టర వైజయింతి అందచందాలు, చదువు, సంస్కారం, వినయవిధేయతలకు విశ్వనాథశాస్త్రి, భవాని ఎంతో ముచ్చటపడ్డారు. ఆ అమ్మాయిని తమ కోడలుగా చేసుకుంటే బావుంటుంది అనే ఆలోచన వారికి కలిగింది. శ్రీనివాస్ కూడా ఆ

అమ్మాయిని ఇష్టపడుతున్నాడని తెలుసుకున్నారు.

భవాని ఈ విషయం అత్తగారితో ముచ్చటించింది. సుందరమ్మగారు సంతోషించి వెంటనే గంగాధరంగారికి కబురుపంపి వారిని రప్పించారు. ఆయనకు విషయం తెలియజేశారు.

"అమ్మా! అనుకోకుండా భగవంతుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నట్లు మాకు అంతకన్నా భాగ్యం ఏంవుందండీ! తల్లితండ్రులు లేని పిల్ల. ఏ అచ్చట, ముచ్చట ఇంతవరకు ఎరగదు" అన్నారు ఆనందభాష్పాలతో.

అంతలో వైజయంతి అక్కడకు వచ్చి సుందరమ్మ గారికీ, భవాని గారికీ నమస్కరించింది.

"రా అమ్మా రా! నీ విషయమే మీ తాతగారితో మాట్లాడతున్నాను" అన్నారు సుందరమ్మగారు.

"నాకు తెలుసండీ! నేను చెయ్యకూడని తప్పేచేసేను. అందుకు క్షమించమని కోరడానికే వచ్చాను!" అంది వైజయంతి వినయంగా.

"నువ్వు తప్పు చెయ్యడం ఏంటమ్మా?" అన్నారు ఆశ్చర్యంగా.

"అదేనండీ! శాస్త్రితాతగారు నన్ను మెడిసిన్ చదివించిన విషయం ఎవరికీ చెప్పొద్దన్నారు. అదేవిధంగా మీరు పేద ప్రజల వైద్య సహాయం కోసం చేసిన ఏర్పాటు ఉగరించి కూడా ఎవరికీ చెప్పొద్దన్నారుగా! కానీ ఈ రోజు ఉదయం సభలో పదిమందికీ మీ ఔదార్యం, దానగుణం తెలియాలని చెప్పాను. అయితే మీ అనుమతి లేకుండా ఈ విషయం చెప్పినందుకు నన్ను క్షమించమని కోరుతున్నాను" అంది డాక్టర్ వైజయంతి.

"ఓస్ అదా!" అన్నారు సుందరమ్మగారు చిరునవ్వుతో "మేము మాట్లాడు కుంటున్న విషయం అదికాదమ్మా! నీ పెళ్లి విషయం! వారి మనవడికి నిన్ను చేసుకుంటాము అంటున్నారు" అన్నారు గంగాధరంగారు సంతోషం పట్టలేక.

"అవునమ్మా! మా మనవడికి నిన్ను చేసుకుందా మనుకుంటున్నాము! మా శ్రీనివాస్ మెడిసిన్‌లో..."

"నాకు తెలుసండీ! శాస్త్రితాతగారు వారి గురించి నాకు అన్ని విషయాలూ చెప్పారు. అయితే మీ మనవడికీ నాకూ పొత్తు కుదరదండీ! నా జీవిత ఆశయం, లక్ష్యం వేరు. మీ మనవడి ఆశయాలు, అభిరుచులు, అభిప్రాయాలు వేరు. వారికి పల్లెటూర్లన్నా, పల్లెప్రజలన్నా సదభిప్రాయం లేదు. వారు కోరేది పట్నవాసం. నేను ఇష్టపడేది పల్లెజీవనం. పల్లె ప్రజలకు వైద్యసేవలందించడమే నా లక్ష్యం. అందువల్ల మా ఇద్దరికీ నప్పదు!"

"ఇంకొక ముఖ్య విషయం! ఈ ఊరి జూనియర్ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా జాబ్ చేస్తున్న సిద్ధేశ్వరరావు మాకు దగ్గర బంధువు. అతనిది ఈ పక్క గ్రామమే. అతనిని కూడా శాస్త్రితాతగారే ఎమ్.ఎ చదివించారు. అతనే నాకు కాబోయే భర్త! ఏం తాతయ్యా! మీరు వారికి ఈ విషయం చెప్పలేదా?" అన్న వైజయంతి మాటలకు అందరూ నిర్ఘాంతపోయారు.

**('ఈనాడు' ఆదివారం 4,నవంబర్ 2001)** ✪

# కాంతమ్మగారి కాశీయాత్ర!

"తీయనైన తలపులతో కమ్మని కలలు కనే కన్నె వయస్సులో కాంతానికి కాశీయాత్ర చేయాలనే ఆలోచన కల్గింది. కాశీ వెళ్లి గంగలో మూడు మునకలు వేసి విశ్వనాథుడిని దర్శించాలని, కాశీ విశాలాక్షిని, అన్నపూర్ణను కన్నులారా వీక్షించాలని, కాలభైరవుడిని సేవించి రావాలనే కోరిక కల్గింది.

ఆమెకు అటువంటి వింత ఆలోచన ఆ వయస్సులో కలగ జేసింది ఇంటి ఓనరు పేరమ్మగారు. పేరమ్మగారి వయస్సు 70 సంవత్సరాలు. మనిషి దృఢంగా ఉంటుంది. ఆవిడకు భర్త కట్టించిన మండువా వాకిలున్న ఇల్లుంది. దానిని నాలుగు పోర్షన్లుగా మార్చి నాలుగు కుటుంబాల వారికి అద్దెకిచ్చింది. వాటి మీద ఆమెకు నెలకు నాలుగు వేలు అద్దె వస్తోంది. ఆ డబ్బుతో ఆమె ఎవరిమీదా ఆధారపడకుండా ప్రశాంతంగా జీవిస్తోంది.

పేరమ్మగారికి ఇద్దరు కొడుకులు. వారు మంచి జాబ్స్ చేస్తూ వేరు వేరు పట్టణాలలో ఉంటున్నారు. అప్పుడప్పుడు కుటుంబాలతో వచ్చి తల్లి వద్ద కొన్నిరోజులుండి వెళ్తున్నారు. అయితే పేరమ్మగారు ఎన్నడూ వెళ్ళి కొడుకుల వద్ద ఉండరు. అందుకు కారణం -

పేరమ్మగారికి దైవభక్తి ఎక్కువ. మడి, తడి, ఆచారం పాటించే మనిషి. నిత్యం పూజలు, వ్రతాలు, దానధర్మాలు చేస్తుంటారు. ఆమె భర్త పరాత్పరంగారు నాలుగేళ్ళ క్రితం పోయారు. పేరమ్మగారు ఏనాడు భర్తను పట్టువస్త్రాలు, నగలు వగైరాలు ఏవీ కోరలేదు. ఆమె భర్తను కోరింది - "తనకు పుణ్యక్షేత్రాలు, గుళ్ళూగోపురాలు చూపించమని"భార్య కోరికను ఆయన కాదనలేదు. ఆయనకూ దైవభక్తి ఉంది. ఇరువురూ సకల పుణ్యక్షేత్రాలు దర్శించేరు. వాటి వివరాలు పూర్తిగా తెలుసుకున్నారు.



నాలుగు వాటాలలో ఉన్న పిల్లలందరినీ పేరమ్మగారు రోజూ చేరదీసి వారికి పుణ్యక్షేత్రాల వివరాలు కథల రూపంలో చెప్పి ఆనందించడం ఆవిడ దినచర్య. పేరమ్మగారి యాత్రావిశేషాలు కాంతాన్ని ఎంతో ఆకర్షించేయి. అన్నిటి కంటే ఎక్కువ కాశీయాత్ర. పలుమార్లు ఆవిడ చేత కాశీక్షేత్ర వివరాలు చెప్పించుకొని విని ఆనందించింది.

"అమ్మా! మనం కూడ కాశీయాత్ర చేసుకుని వద్దామే!" అంది ఓరోజు తల్లితో కాంతం.

కూతురి మాటలు విని విస్తుపోయింది సూర్యలక్ష్మి.

"బావుందే నీ కోరిక! ఆదర్శాలు శిఖరమెక్కి కూర్చుంటే అవసరాలు అగాధంలోకి ఈడుస్తాయని! నిన్నో అయ్యచేతిలో పెట్టడమెలాగని మేము క్రిందా మీదా పడుతుంటే

యాత్రలట! కాశీయాత్ర! నోరు మూసుకో! మీ నాన్నగారు వింటే మండి పడతారు" అని చీవాట్లు తింది.

"తల్లి పెట్టిన చీవాట్ల వల్ల కాంతం ఆశలు అణగారి పోలేదు మరింత పెరిగాయి.

అనుకోకుండా సూర్యలక్ష్మి అన్నావదిన కాశీయాత్రకు వెళ్తూ వారి పిల్లలను చెల్లెలు వద్ద వదలి వెళ్ళాలని వచ్చారు. వారితో తననూ పంపింపచమని పట్టుపట్టింది కాంతం. అంత మంచి అవకాశం తిరిగిరాదని ఇంట్లో నానా గొడవ చేయమొదలిడింది.

సూర్యలక్ష్మి కూతురి గొడవ పడలేక పేరమ్మగారికి తమ పరిస్థితి వివరించి కాంతానికి నచ్చచెప్పిమంది. పేరమ్మగారు మరి కాదనలేక కాంతాన్ని పిలిచి

"చూడు అమ్మడూ! కన్నెపిల్లలు, కడుపుతో వున్న స్త్రీలు కాశీయాత్ర చెయ్యకూడదు తల్లీ! చేసినందువల్ల పుణ్యంరాదు సరికదా గొప్ప అనర్థం కలుగుతుంది. కాశీలో పూజలు వగైరా చేసే సయమంలో కాశీక్షేత్రాన్ని "మహాశ్మశాన"మనే వ్యవహరిస్తారు. అందువల్లే కన్నెపిల్లలు, గర్భిణీస్త్రీలు కాశీయాత్రకు అనర్హులు" అని చెప్పేరు.

"పేరమ్మగారు అబద్ధం చెప్పరు. ఆవిడ మాటలు నిజమే" అని నమ్మింది కాంతం.

"చూడు తల్లీ! కాశీయాత్రకు భర్తతో వెళ్ళి సరిగంగా స్నానం"చేయడం స్త్రీలకు ఎంతో పుణ్యం! మంగళప్రదం! భర్తతో కాశీయాత్రకు వెళ్ళడానికి నోచుకోని వాళ్ళు కన్న కొడుకు వెంట వెళ్ళాలి! అది సంప్రదాయం. నువ్వింకా చిన్నపిల్లవు, కన్నెపిల్లవు! నీకు పెళ్ళయ్యాక మీ ఆయనతో కాశీయాత్రకు వెళ్లి సరిగంగా స్నానం చేసి పుణ్యం మూట కట్టుకో!" అన్నారు నవ్వుతూ.

అయితే కాంతం, కాశీయాత్ర గురించి కలలు కనడం మానలేదు. ఆమె ఊహాలోకాలలో విహరిస్తుండగానే కామేశంతో వివాహం జరిగింది. పుట్టిల్లు వదిలి మెట్టినిల్లు చేరింది.

శోభనం గదిలో సిగ్గువిడిచి భర్తతో "ఏవండీ మనం కాశీయాత్రకు వెళ్ళాలండీ!" అంది.

భార్య కోరిక విని అదిరిపడ్డాడు కామేశం.

"ఏం నీకు గాని మొక్కుబడి ఉందా?" అన్నాడు.

"అబ్బే అటువంటిదేం లేదండీ! దైవదర్శనం చేసుకురావడానికి, యాత్రలు చేసుకురావడానికీ మొక్కుబడే ఉండాలా?" అంది.

మొక్కుబడి కాదనగానే కాస్త స్థిమితపడి "కాశీయాత్రంటే సామాన్యమైందికాదు! వీలుచూసుకొని త్వరలోనే వెళ్దాం" అన్నాడు.

భర్త మాటలకు కాంతం మహదానందం పొందింది.

కాంతం పెళ్ళిలో పేరమ్మగారు వెయ్యినూట పదహార్లు ఇచ్చి "ఇవి, నీ కాశీక్షేత్రయాత్రకొరకు వినియోగించు!" అన్నారు. ఫ్రెండ్స్, బంధువులు ఇచ్చిన సొమ్ము అంతా మొత్తం పదిహేను వందలుంది కాంతంవద్ద. ఆ సొమ్ము కాశీయాత్రకొరకే వినియోగించాలనుకుంది.

కాంతం అత్తగారు జయమ్మ ఎంతో లోతైన మనిషి. ఏ విషయంలోనూ తొందరపాటు చూపదు. ఎవరినీ చప్పున నమ్మదు. ప్రతి చిన్న విషయం నిశితంగా పరిశీలిస్తుంది. తండ్రిలేని లోటు ఏమాత్రం కనబడనీయకుండా కొడుకును పెంచి చదివించింది. కామేశానికి గవర్నమెంట్ జాబ్ వచ్చింది.

అత్తవారింటి పరిస్థితి అర్థం చేసుకునేందుకు కాంతానికి ఎక్కువకాలం పట్టలేదు. తల్లీకొడుకు లిద్దరూ ఏపనీ తొందరగా చేయరు. ప్రతి చిన్న విషయం గంటలకొలదీ చర్చించుకోనిదే నిర్ణయం తీసుకోరు. కామేశం మాతృవాక్య పరిపాలకుడు.

"తన భర్త ఏపనీ ఇనీషియేటివ్ తీసుకొని చేయడని, అత్తగారిని ప్రసన్నురాలుగా చేసుకోవడం మంచిదని" అనుకొని

"అత్తయ్యా! మీరేవైనా యాత్రలు చేసేరా?" అని అడిగింది కేజువల్‌గా.

"లేదు కాంతం! వీలు పడలేదు. ఎప్పటికప్పుడు అనుకోవడం తప్ప వెళ్లడం లేదు. బారెడు దూరంలో ఉన్న సింహాచలం, అన్నవరం, అరసవిల్లి, శ్రీకూర్మం యివే ఇంతవరకూ చూడలేదంటే నమ్ము!" అన్నారావిడ విచారంగా.

"అదేవిటండీ! అవన్నీ మనకు గంట, రెండు గంటల ప్రయాణదూరంలో ఉన్నవి. ఉదయం వెళ్లి సాయంత్రానికి ఇంటికి తిరిగి రావచ్చు...."

"కదా! మరి ఆ ఉద్దేశంతోనే వీటిని ఎప్పుడైనా, ఎలాగైనా చూడొచ్చు. ముందుగా దూరంగా ఉన్న తిరుపతి, కంచి, కాళహస్తి, కాశీ, రామేశ్వరం, మధుర, శ్రీరంగం, కన్యాకుమారి వగైరా పుణ్యక్షేత్రాలు కాలు, చెయ్యి గట్టిగా ఉన్నప్పుడే వెళ్ళిచూసిరావడం మంచిది అనుకున్నాం. అయితే అటుదూరంగా ఉన్నవాటిని గాని, ఇటు దగ్గరలో ఉన్నవాటిని గాని ఏవీ చూడడం అవలేదు. దేనికైనా ప్రాప్తం ఉండాలి కదా!"

"అవును అత్తయ్యా! దైవకృపలేనిదే దైవదర్శనం అవదంటారు! అయినా కొంత వరకూ మనప్రయత్నం కూడా ఉండాలి కదా!" అంది కాంతం.

కోడలి మనోభావం గ్రహించింది జయమ్మ.

"నువ్వేమీ వర్రీ అవకు కాంతం! మనం చక్కగా ఆలోచించి ప్లానువేసుకొని చూడాలనుకున్న పుణ్యక్షేత్రాలన్నీ సావకాశంగా చూసి వద్దాం" అంది.

అత్తగారి మాటలు ఎంతో ఉత్సాహం కల్గించాయి కాంతాన్ని. తన మనసులోని కాశీయాత్ర కోరిక ఆవిడకు చెప్పింది.

"నీ ఆలోచన చక్కగా ఉంది కాంతం! అన్ని యాత్రలకంటే కాశీయాత్ర ఎంతో ఉత్కృష్టమైంది అంటారు. కాశీయాత్ర చేసివస్తే చాలు మిగిలిన యాత్రలు చెయ్యకున్నా పర్వాలేదు. ముందుగా మనం కాశీయాత్ర గురించే ప్లాను వేద్దాం! అబ్బాయిరానీ" అంది.

ఆ రాత్రి భోజనాలయ్యాక ముగ్గురూ కూర్చుని కాశీయాత్రకు ప్లాను తయారు చేసేరు. కాశీలో చూడవలసిన ప్రదేశాలు, పూజించవలసిన దేవుళ్ల వివరాలన్నీ విపులంగా చెప్పింది కాంతం. ఆ విషయాలన్నీ లోగడ పేరమ్మగారి వద్ద సేకరించినవి. కాంతం చెప్పినవన్నీ సావకాశంగా చూసిరావడానికి, కాశీకి ఎడా, పెడా నున్న గయా, ప్రయాగ యాత్రలతో, కనీసం వారంరోజులు, జర్నీ రానుపోను మూడు రోజులు మొత్తం పదిరోజులు లీవుకావాలి. రానూ పోనూ రైలు చార్జీలు, భోజనాలు, దైవదర్శనం ఊర్లో తిరగడానికి మనిషికి కనీసం మూడు వేలు ఖర్చు..ముగ్గరికీ తొమ్మిదివేలుండాలని బడ్జెట్ జాగ్రత్తగా వేసి చెప్పేడు. బేంకు పాస్ పుస్తకం తెచ్చి చూసేడు. అందులో బేలన్స్ ఆరు వందలుంది.

కామేశం పెళ్లిలో పైసా కట్నం తీసుకోలేదు. ఆ సంగతి కాంతానికి తెలుసు. ప్రతి నెలా ఇంటి ఖర్చులు పోను మిగిలిన సొమ్ము బేంకులో వేస్తున్నాడు. ఆ డబ్బే

పెళ్లి ఖర్చులకు వాడగా మిగిలింది ఆ ఆరువందలు.

భర్త మంచితనం తెలుసు కాంతానికి. కాశీయాత్ర కొరకు తన వద్దనున్న పదిహేను వందలు గురించి చెప్పింది.

“అబ్బాయి! పోనీ ఓ పనిచెయ్యరా! మొత్తం సొమ్ము రెండువేలుంది కదా! మరో మూడు నాలుగువేలు ఎవరి దగ్గరైనా సర్దుబాటు చేసుకొని మీరిద్దరూ కాశీయాత్ర చేసుకొనిరండి!” అంది జయమ్మ.

“అదేవిటి అత్తయ్యా! మన ముగ్గురం మనకు వీలున్నప్పుడే వెళ్దాం! తొందరేంటి? అయినా అప్పుచేసి యాత్రలకు వెళ్లడవేంటి?” అంది కాంతం నొచ్చుకుంటూ.

కోడలి అభిమానానికి ఎంతో ఆనందించింది జయమ్మ.

“కష్టసుఖాలు ఎరిగిన మనిషి!” అని మెచ్చుకుంది.

కామేశం ప్రతి నెలా జీతం అంతా భార్యకిస్తున్నాడు. అది ఇంటి ఖర్చులకు సరిపోగా వందా, ఏభై మిగులుతోంది. అది బేంకులో వేస్తున్నారు. జయమ్మ ఇంటి బాధ్యతలన్నీ కోడలికి అప్పగించింది.

నెలలూ సంవత్సరాలు గడుస్తున్నాయి. కాంతానికి ఇద్దరు ఆడపిల్లలు. కామేశానికి ఉద్యోగంలో ప్రామోషన్ వచ్చి జీతం పెరిగింది. ఇంటి ఖర్చులు పెరిగేయి. పిల్లల చదువులు, ఆలనా పాలనా వారి సరదాలు, అత్తగారి అనారోగ్యం, డాక్టరు ఫీజులు, మందులు ఇంటి చాకిరీతో క్షణం తీరిక లేకుండా వుంది కాంతానికి.

“పాపం! నోరు విప్పి కొత్త కోడలు అడిగిన చిన్న కోరిక తీర్చలేని అసమర్థురాలు నీ అత్తగారు! ఆనాడు నేను చెప్తే వినిపించుకోలేదు. అప్పో, సప్పో చేసి కాశీయాత్ర చేసుకొని రమ్మంటే వినలేదు అందరకం కలిసి సరదాగా వెళ్దామన్నావు! చూస్తున్నావు కదా మన పరిస్థితి. ఏటికి ఏడాదీ ఖర్చులు. బరువు బాధ్యతలు పెరుగుతున్నాయి” అని జయమ్మ అప్పుడప్పుడు నొచ్చుకుంటోంది.

కాంతం ఇప్పుడు ఏ విషయానికీ అంతగా స్పందించటంలేదు. కాంతం అల్లా కాంతమ్మగా మారింది. ఆమెలో ఒక విధమైన నిరాశ, నిర్లిప్తత, ఆవేదన చోటు చేసుకున్నాయి. ఇంటి పనులన్నీ యాంత్రికంగా చేస్తోంది.

భార్యలో క్రమంగా వస్తున్న మార్పు గమనించి విషయం తెలుసుకుందికి ప్రయత్నించేడు. పలుమార్లు భార్యను ప్రశ్నించేడు. సరియైన సమాధానం దొరకలేదు. ఈలోగా అత్తగారు పోవటం, కూతుర్లు పెళ్లి అయి అత్తవారింటికి వెళ్లిపోవడంతో కాంతమ్మ మరింత దిగులు చెందింది.

భర్త రిటైర్ అయ్యేక చేతికి అందిన రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ సొమ్ము చూడగానే కాంతమ్మకు కాశీయాత్ర విషయం గుర్తుకొచ్చి భర్త ముందు ఆ ప్రస్తావన తెచ్చింది.

ఇన్నేళ్ల తరువాత భార్య మళ్లీ నోరువిప్పి కాశీయాత్ర అనగానే వెంటనే అంగీకరించి

"తప్పకుండా వెళ్దాం! బయల్దేరడానికి ఎప్పుడు మంచిదో చూసి చెప్పు. రేపు ఉదయాన్నే వెళ్లి టిక్కెట్లు రిజర్వు చేయించుకొని వస్తాను" అన్నాడు ఉత్సాహంగా

భార్య నిర్ణయించిన రోజుకే రిజర్వేషన్ చేయించి ఆ టిక్కెట్లు ఆమె చేతికిచ్చేడు.

కాంతమ్మ ఆనందం పట్టలేక భర్తను వాటేసుకుంది.

కామేశం లోగడ ఎన్నడూ తన భార్య అంత ఉత్సాహంగాను, సంతోషంగా ఉండడం చూడలేదు.

ఆ రాత్రి కాంతమ్మ భర్త గుండెల మీద పడుక్కొని ప్రశాంతంగా నిద్రపోయింది.

కాశీయాత్రకు కాంతమ్మ నిర్ణయించిన రోజునే కూతుళ్లూ, అల్లుళ్లూ వీడ్కోలుతో బయల్దేరేడు కామేశం భార్య అస్థికల కలశతో-

**(ఫేకర్ 1968 దసరా సంచిక)** ✪

# రైస్ ప్లేంట్స్

"పెద్దమ్మగోరూ! పెదమ్మగోరూ! బుగతమ్మ గోరొచ్చీసినారండి!" అంటూ కేక పెట్టింది నారమ్మ.

"బుగతమ్మ గోరూ! బావున్నారా!" అంది ఆప్యాయంగా.

"బాగున్నాను! నువ్వెలా వున్నావు నారమ్మా?" అంది మాధవి.

"నాకేటమ్మా! గుండ్రాయి నాగున్నాను! తవర్ని సూసిశానా దినాలైనాది! తవరు దిగి లోనికి పదండి సామాను నానొట్టుగొత్తా" అంది.

మాధవి టాక్సీ దిగి వెనుక సీట్లో నిద్రపోతున్న కొడుకును మనూని లేపి దింపింది. ఫ్రంట్ సీట్లోంచి మాధవి చిన్నన్న చంద్రం దిగి డిక్కీలో సామాన్లు దింపి లెక్క సరిచూసి టాక్సీ వాడికి డబ్బులిచ్చి పంపించేడు.

ఆ వరకు మాధవి తల్లిదండ్రులు పెద్దన్న సూర్యం, వదినెలు అందరూ బయటకు వచ్చేరు.

పార్వతమ్మ కూతురుకీ, మనవడికీ గుమ్మంలోనే నిల్చోపెట్టి దిష్టితీసేరు.

"ఏరా బావగారు రాలేదా?" అన్నాడు సూర్యం

"ఎల్లుండి వస్తారు అన్నయ్యా! ఈ మూడు రోజులూ ఏవో కాన్ఫరెన్స్ లున్నాయట" అన్నాడు.

వదినెలిద్దరూ ఆడపడుచును ఆప్యాయంగా పలకరించి లోనికి తీసుకొని వెళ్లేరు.

మనూకి అంతా వింతగా వుంది. వీధి వాకిలి ముందు వేసిన పెద్ద పందిరి దానికి కట్టిన మామిడి మండల తోరణాలు చూసి లోనికి వెళ్లబోయి వీధి గుమ్మందగ్గర



ఆగిపోయేడు. ద్వార బంధం అడుగు చెక్క ఎనిమిదంగుళాల ఎత్తు ఆరంగుళాల మందం వుంది. ఆ గుమ్మానికి అంతకు మునుపే పసుపురాసి బొట్లు పెట్టేరు. అవింకా తడారలేదు.

అంత పెద్దగుమ్మం చూడడం అదే మొదటిసారి. దానిని ఎలాదాటాలో వాడికి అర్థంకాక తికమక పడుతున్నాడు.

అంతలో వాడు గాల్లో లేచి గుమ్మం అవతల దింపబడడంతో తిరిగి చూసేడు. వాడిని గుమ్మం దాటించింది చంద్రం.

"చిన్న మావయ్యా! ఇదెందుకు అడ్డుగా పెట్టేరు? దీని పైనుంచి జంప్ చెయ్యాలా?" అన్నాడు.

"అదా? చూడు అక్కడ ఉయ్యాలబల్ల మీద తీరికగా కూర్చున్నారు చూసేవా? మీ తాతగారు. వెళ్లి ఆయన్ని అడుగు!" అన్నాడు చంద్రం నవ్వుతూ. మూడురోజుల

నుండీ మేనల్లుడి ప్రశ్నల పరంపరను ఎదుర్కొంటున్నాడు.

పరమేశ్వరశాస్త్రిగారికి పెద్దలు సంపాదించిన ఆస్తి యాభై ఎకరాల పల్లపు పొలం, నాలుగు ఎకరాల మామిడి, నిమ్మ, బత్తాయి, జామ తోటలు వున్నాయి. గ్రామంలో ఆయనకు ముందూ వెనకా విశాలమైన ఆవరణ వున్న పాతకాలం పదిగదులున్న మండువా యిల్లు వుంది. ఆ యింటికి అధునాతన సౌకర్యాలన్నీ సమకూర్చేరు. నాలుగు బెడ్‌రూమ్స్‌కు ఎటాచ్‌డ్ బాత్‌రూమ్స్ టాయ్‌లెట్స్ కట్టించేరు.

పరమేశ్వరశాస్త్రి గారికి ఇద్దరు కొడుకులు సూర్యం, చంద్రం. ఒక కూతురు మాధవి. కొడుకులిద్దరూ డిగ్రీ పుచ్చుకొని వ్యవసాయం చూసుకుంటూ తండ్రికి విశ్రాంతి నిచ్చేరు. కొడుకులకు మేనరికాలే చేసేరు. వారికి చెరొక కొడుకూ, కూతురు సంతానం,. మాధవి భర్త హయగ్రీవరావు హైదరాబాద్‌లో బేంక్ మేనేజర్. వారి ఏకైక కుమారుడు మనోజ్. ఐదు సంవత్సరాల వాడు. కాన్వెంట్‌లో సెకెండ్‌క్లాస్ చదువుతున్నాడు. చురుకైనవాడు.

పెద్ద మనవడికి ఉపనయనం చేయ సంకల్పించి కూతురు, అల్లుడు, మనవణ్ని తీసుకొని రమ్మనమని చంద్రాన్ని హైదరాబాద్ పంపించేరు పరమేశ్వరశాస్త్రిగారు.

"తాతగారూ!" అంటూ పరుగుపరుగున వస్తున్న మనవడిని చూసి ఉయ్యాల బల్ల దిగి చేతులు చాచేరు.

"మనూ! షూస్!" అంటూ కొడుకుని మధ్యలోనే ఆపి షూస్ సాక్స్ విప్పింది మాధవి.

"పర్వాలేదమ్మా!" అని మనవడిని ఎత్తుకొని కిస్‌చేసి ఉయ్యాల బల్లమీద కూర్చోబెట్టి తనూ కూర్చున్నారు.

"తాతయ్యా! మరి అక్కడ దార్లో అడ్డంగా ఎందుకు పెట్టేరు? కాలు తగిలి పడిపోరూ?" అన్నాడు.

"ఏది బాబూ? ఎక్కడ?"

"అక్కడ! ముందు డోర్ దగ్గర!" అన్నాడు అటు చేయి చూపించి.

"నారయ్యా చూడు దారిలో ఎదో అడ్డం వుందిట!" అని కేకవేసేరు. అప్పుడే లోనికి వస్తున్న నారయ్య నుద్దేశించి.

నారమ్మ పెనిమిటి నారయ్య. వారిద్దరూ, వారి ముగ్గురు కొడుకులు, కోడళ్ళూ అందరూ పరమేశ్వర శాస్త్రిగారింటి పని వ్యవసాయం పనులూ చేస్తున్నారు. వారికి కావల్సినదంతా పరమేశ్వరశాస్త్రిగారిస్తున్నారు. వారిని కూడ కుటుంబ సభ్యులుగానే చూస్తున్నారు.

"ఏడబాబూ! తోవల ఏటీనేదే!" అన్నాడు నారయ్య అటూ యిటూ, ముందూ వెనుకా తిరిగి చూసి.

"ఉంది తాతయ్యా! నేను చూపిస్తాను" అని వాడు ఆయన చేయి పట్టుకొని వీధిగుమ్మం వద్దకు తీసుకొని వెళ్ళి చూపించి

"ఇంత పెద్దది అడ్డంగా వుంటే ఎలా!" అన్నాడు.

కూతురితో ముచ్చటిస్తున్న పార్వతమ్మగారు "అమ్మాయి! అటు చూడు! మనవడు వచ్చీరావడంతోనే వాళ్ళ తాతగారిని ఆటపట్టించేడు" అన్నారు

పరమేశ్వరశాస్త్రిగారికి ఏం సమాధానం చెప్పాలో పాలుపోక "అదీ గుమ్మంరా' అన్నారు నవ్వుతూ.

"చెప్పేవాళ్ళకి ఓపికుండాలి! వాడన్నీ తిక్క ప్రశ్నలు వేస్తాడు. నాన్నగారూ! వాడి సిల్లీ ప్రశ్నలకు వాళ్ళ డాడీయే వాడికి ఓపికగా సమాధానాలు చెప్పగలరు!" అంది మాధవి నవ్వుతూ.

పార్వతమ్మగారు మనవడిని దగ్గరకు తీసుకొని ఒడిలో కూర్చోపెట్టుకొని ముద్దాడేరు.

పెద్దకోడలు కమలరెండు కప్పులతో జున్నుతెచ్చి ఒక కప్పు మాధవికి, ఒక కప్పు మనూకి యిచ్చింది.

"ఐస్‌క్రీమా!?" అన్నాడు సంతోషంగా.

"కాదు బాబూ! యిదీ జున్ను!" అంది కమల.

"జున్ను అంటే?"

"చీజ్!" అంది మాధవి. "అవునూ ఇంత ఉదయాన్నే జున్నెక్కడిది వదినా!" అంది.

"మనింట్లో జర్సీ పడ్డ వుండేది కదూ! అది చూలు కట్టి నిన్న ఉదయం ఈనింది! జున్ను నీ కిష్టమని ఉదయాన్నే చేసినట్లుంది!" అన్నారు పార్వతమ్మగారు.

"ఎలా వుంది?" అని అడిగింది మనవడిని.

"చాల బావుంది అమ్మమ్మా" అన్నాడు.

"బుగతమ్మగోరూ! తవకి ఉడకు నీరు నూతికాడ తానాల గదిల ఎట్టేను" అంది నారమ్మ.

" దా బాబూ! తవకి తానం చేపిత్తా!" అని మనోజ్‌ని పిల్చింది.

"నీ కాళ్ళకి గొలుసులూ, రింగులూ ఎవరు కట్టేరు? నీకు నొప్పిగా లేదా?" అన్నాడు నారమ్మ కాళ్లకున్న వెండిగొలుసులూ, కడియాలు చూసి.

"నాను యీ పొద్దివి నేరక పోయి ఎట్టుగున్నా పెద్దమ్మగోరూ!" అంది నారమ్మ సిగ్గుపడుతూ.

"పోనీవే! వాడికివన్నీ వింతగా వున్నాయి" అన్నారు.

మాధవి లేచి గదిలోకి వెళ్ళి కొడుకు కోసం కుర్తా, పైజమా, బనీను, డ్రాయరూ తీసి బయట ఉంచింది. వాడిపేంటూ, షర్టూ విప్పింది. డ్రాయరు, బనీనుతో వాడు నారమ్మ వెంట పెరట్లోకి వెళ్ళేడు.

వాడి సోపూ, టవలూ మాధవి నారమ్మకిచ్చింది.

పెరట్లో కూడ తాటికమ్మల పందిరి వేసి మామిడాకుల తోరణాలు కట్టేరు. పందిర్రాటకు లేగదూడ కాలుకి తాడుతో కట్టేరు. దూడమూతికి తాళ్లతో అల్లిన నెట్ తగిలించేరు.

మనూని చూసి దూడ వాడి వద్దకు రాబోయింది. అది చూసి వాడు 'కెవ్వ్' మన్నాడు.

"అదేటీ సెయ్యదు బాబూ! సూడండి!" అని వాడిని దాని దగ్గరకు తీసుకొని వెళ్ళింది. వాడు దానిని ముట్టుకుని కాస్సేపు దాని ఒంటిమీద చెయ్యివేసి నిమిరేడు. వాడికి భయం పోయింది.

"దీని పేరేంటి? మూతికి అదెందుకు పెట్టేరు" అన్నాడు.

"దూడ బాబూ! మూతికి అదెట్టకుంటే ముట్టి నాకుతాది"

నూతి చప్టామీదున్న వేడినీళ్ల బకెట్ చూసి

"ఛీ! యిక్కడేంటి స్నానం చేస్తారు! షేమ్! షేమ్!" అన్నాడు. రెండు అడుగులు వెనుకకు వేసి.

"మరెక్కడ చేస్తావ్! బాత్‌రూమ్‌లోనా!" అటుగా వచ్చిన విమల అంది. వాడు అవునని తల వూపేడు..

"మరి యిక్కడ బాత్‌రూమ్‌లో మీ మమ్మీచేస్తోంది! చూడు నారమ్మా! వీళ్ల గదిలో వున్న స్నానాల గదిలో యీ వేడినీళ్ల బాల్చీపెట్టు. అక్కడ చేస్తాడు" అంది నవ్వుతూ.

"అట్టాగేనమ్మా" అని నారమ్మ నీళ్ళ బకెట్, సోపు, టవల్ తీసుకొని వెళ్ళింది. కూడ మనూ వెళ్ళి స్నానంచేసి బట్టలు మార్చుకుని వచ్చేడు.

పార్వతమ్మగారు మనవడికి తలదువ్వి ముఖానికి పౌడర్ అద్దేరు.

ఉదయాన్నే ట్యూషన్‌కి వెళ్లిన నలుగురు పిల్లలూ పరుగు పరుగున వచ్చేరు. వాళ్లను చూడగానే మనూ ముఖం వికసించింది.

స్నానం చేసివచ్చిన మాధవిని చూసి పిల్లలు "అత్తయ్యా!" అని చుట్టూ చేరేరు- మాధవి వారికోసం కొని తెచ్చిన రడీ మేడ్ దుస్తులు, రకరకాల గిఫ్టులు వారికిచ్చింది. వారు దుస్తులు వేసుకుని చూసుకున్నారు. సరిపోయేయి. వారు అవన్నీ వాళ్ల అమ్మకి, తాతగారికి, నాయనమ్మకు చూపించేరు.

"ఇప్పుడు వాళ్ళకి అవన్నీ ఎందుకు కొని తెచ్చావ్ చెల్లాయి" అన్నాడు సూర్యం.

"అమ్మమ్మా! నాకు త్రీడ్రసెస్! చూడు యిది తాతగారు యిది పెద్ద మామయ్య. ఇది చిన్న మామయ్య యిచ్చినవి" అని సంతోషంగా చూపించేడు. అవి చంద్రం హైదరాబాద్‌లో వాడికి కొని యిచ్చి అలాగని చెప్పేడు.

మధ్యాహ్నం భోజనాలయినప్పటి నుండీ మనూ వాళ్ల చిన్నమామయ్య చంద్రాన్ని పొలాలు పండ్లతోటలూ చూపించమని వేధిస్తున్నాడు.

వాడికి వాటన్నిటి గురించి చంద్రం హైదరాబాద్‌లో చెప్పి అవి చూపిస్తానని

ప్రామిస్ చేసేడు.

సాయంత్రం పిల్లలు స్కూలు నుంచి వచ్చేక వాళ్లను, మనూని తీసుకొని వెళ్ళేడు.

కనుచూపుమేర అందంగా వున్న పచ్చటి వరిపొలాలు మనూ వింతగా చూసేడు.

"ఇవన్నీ ఏం మొక్కలు" అన్నాడు.

"యిదీ వరి చేను"

"వరి అంటే ?"

"పేడీ-రైస్!"

"మనం అన్నం వండుకునే రైస్ ప్లేంట్సా!" అన్నాడు.

"మరి అన్ని ఎందుకు వేసేరు?"

"మనకి కావల్సినన్ని వుంచుకొని మిగిలినవి అమ్మేవేస్తాం" అన్నాడు చంద్రం.

తోటలో వున్న జామ, బత్తాయి, నిమ్మచెట్లు వాటికి వున్న గుత్తుల గుత్తుల పండ్లు చూసి ఆనందంతో గంతులు వేసేడు మనూ.

నారయ్య పెద్ద కొడుకు కొన్ని పళ్లుకోసి బుట్టలో వేసి వారివెంట యింటికి తెచ్చేడు.

మనూ యింటికి వచ్చి వాడు చూసినవన్నీ వాడి మమ్మీకి చెప్పేడే. వాడు రోజూ లేగదూడతో ఆడుకోవడం లేదా తోటకి తీసుకొని వెళ్లమని గొడవచెయ్యడం చేస్తున్నాడు.

వాడి డాడీ వచ్చేక వాడు చూసినవన్నీ చెప్పేడు. దూడను హైదరాబాద్ తీసుకొని వెళ్దామని గొడవ చేసేడు. వాడికి బలవంతంగానచ్చ చెప్పేరు. అది పెద్దదయ్యాక తీసుకెళ్దామని మరిపించేరు.

మనూ హైదరాబాద్‌లో ఫ్రెండ్స్‌కి దూడసంగతి, పొలాలు పండ్ల తోటల సంగతి చెప్పేడు.

హైబ్రీడ్ పూల మొక్కలు నాటాలని మాధవి నాలుగు మొక్కల గోలేలు,

మట్టి తెప్పించింది. ఒకదాంట్లో గులాబీ, ఒక దాంట్లో మందార మొక్కలు వేసి రెండు గోలేలు కాళీగా వుంచింది. వాటిలో సీజనల్ ఫ్లవర్స్ వేద్దామని వుంచింది.

మర్నాడు వాటిలో కూడమట్టి వేసి వుండడం చూసింది. అయితే ఆ గోలేలకు విపరీతంగా చీమలు పట్టివున్నాయి. మాధవికి అర్థంకాక భర్తను పిల్చి అడిగింది.

అంతలో మనూ అక్కడికి వచ్చి -

"మమ్మీ! వాటిలో నేను రైస్ ప్లాంట్స్, షుగర్ ప్లాంట్స్ వేసేను! మొక్కలు ఇంకా రాలేదేమిటి?" అన్నాడు.

"రైస్ ప్లాంట్స్, షుగర్ ప్లాంట్స్ ఏవిట్రా!" అన్నారు.

"అదే మమ్మీ! తాతగారికి చాలా రైస్ ప్లాంట్స్ ఉన్నాయిగా! చిన్న మామయ్య నాకు చూపించేడు అవి! నేనుకూడ వీటిలో వేసేను. మరి మనకీ మొక్కలు రైస్, షుగర్ కాస్తాయి కదా! మనం వాటిని ఎంచక్కా రోజూ కోసుకోవచ్చు! అందుకని ఒక దాంట్లో రైస్, ఒకదాంట్లో షుగర్ పోసి మట్టికప్పేను. ఇంకా మొక్కలు రాలేదు" అన్న కొడుకు మాటలకు నిర్ఘాంతపోయేరు భార్యాభర్తలు.

**(ఫేకర్ 1965 దీపావళి సంచిక)** ✪

# నాలుగు స్తంభాలాట

"బుగతమ్మగోరూ! బుగతమ్మగోరూ! యీ అబ్బాయి గోరు తవ యింటికోసం నెలకత ఉంటే తోలు కొచ్చినాను. లోనకెల్లండి బావు!" అన్నాడు అసిరయ్య వీధి గుమ్మంలో నిల్చుని.

రామశర్మ నాలుగు అడుగులు వేసి గడపలోకి వెళ్లి గుమ్మంలో నిల్చున్న కామేశ్వరమ్మన్ను చూసి చేతిలో సంచి క్రిందపెట్టి రెండు చేతులూ జోడించి నమస్కరించేడు. రామశర్మకు సుమారు తొమ్మిది సంవత్సరాల వయస్సుంటుంది. పసిమి చాయ. లాగు చొక్కవేసుకున్నాడు. నుదుట వీబూధిరేఖ. ముఖంలో చక్కటి కళ, తేజస్సుంది. ఎవరు బాబూ నువ్వు? ఎవరు కావాలి?" అంది.

"నా పేరు రామశర్మండీ! గురువుగారి వద్ద వేదం నేర్చుకుందుకు వచ్చాను"

కామేశ్వరమ్మ ఆ అబ్బాయి ముఖంలోకి చూసన్తూ క్షణకాలం అలా నిల్చుండిపోయింది. వాడి వినయ విధేయతలకు విస్తుపోయింది.

"ఏ ఊరు మీది?

"విశాఖపట్నం అండీ"

అంత దూరం నుండి ఒంటరిగా వచ్చావా? తోడుగా ఎవరూ రాలేదా? ఆయన ఇప్పుడు ఎవరికీ వేదం...."

"ఎవరా వచ్చింది? ఎవరీ అబ్బాయి?" అంటూ సోమయాజిగారు వచ్చేరు.

"ఆయనే వచ్చారు! వారితోనే మాట్లాడు" అంటూ ప్రక్కకి తప్పుకుంది కామేశ్వరమ్మ



రామశర్మవారికి సాష్టాంగ నమస్కారంచేసి వారివద్ద వేదం నేర్చుకుందుకు వచ్చిన విషయం చెప్పేడు.

సాకేత రామసోమయాజిగారు గొప్ప వేదపండితులు. నాలుగు వేదాల్లోను ఆయనను మించిన వారు దేశంలోనే లేరు. రాష్ట్రపతి వద్ద బంగారు పతకాలు, ప్రసంశాపత్రాలు అందుకున్నారు. సంస్కృతం, శాస్త్రాలు అభ్యసించేరు. ఎన్నో సన్మానాలు పొందేరు. దేశం నలుమూలలా వారి శిష్యులున్నారు. వారికి గ్రామంలో మంచి నీటి వసతి గల ఏభై ఎకరాల పొలం ఉంది. దానిమీద వచ్చే ఫలసాయంతో వారు తన ఇంటి వద్ద విద్యార్థులకు చిన్న గురుకులం నడుపుతూ అన్ని సదుపాయాలతో ఉచిత వేద విద్య నేర్పుతున్నారు. వారి భార్య కామేశ్వరమ్మ భర్తకు అన్ని విధాలా అనుకూలవతి.

సోమయాజిగారు గత పది సంవత్సరాలుగా ఎవరికీ వేదం నేర్పటంలేదు.. వారి వద్ద శిష్యులెవరూ లేరు. ఆయన రామశర్మ ముఖంలోకి క్షణ కాలంచూసి చిరునవ్వు నవ్వి

"సరే! కామేశ్వరీ అబ్బాయిని లోనికి తీసుకొని వెళ్లు! ఏమైనా తినడానికి పెట్టు" అన్నారు.

కామేశ్వరమ్మ భర్త మాటలు నమ్మలేనట్లు అచేతనంగా నిల్చుని అబ్బాయి వంకే చూస్తోంది.

"నీకే చెప్పింది!" అనే సరికి ఆవిడ తృళ్లిపడి "రాబాబూ!" అంటూ లోనికి తీసుకొని వెళ్ళింది.

"బాబూ! రాత్రి నీళ్లల్లో వేసిన చల్ది అన్నం ఉంది పెరుగు వేసుకొని తింటావా? లేక అటుకులు ఉన్నాయి పాలల్లో వేసి యివ్వనా?" అంది ఆప్యాయంగా

"చల్ది అన్నం తింటానండి" అన్నాడు.

"సరే బట్టలు మార్చుకొనిరా" అంది.

రామశర్మ సంచిలోంచి తడి గా వంచా, తువ్వాలు తీసుకొని తడిగావంచా కట్టుకున్నాడు. పెరట్లోకి వెళ్లి నూతివద్ద కాళ్లూ చేతులూ కడుక్కొని వచ్చాడు. కామేశ్వరమ్మ పీటవేసి ఆకులో చల్ది అన్నం పెట్టి పెరుగు ఆవకాయ వేసింది. గ్లాసుతో మంచినీళ్లు పెట్టింది. రామ శర్మ తడిగావంచాతో కూర్చుని చల్ది అన్నం తిని ఆకుపారవేసి అక్కడ సుద్దిచేసేడు.

సోమయాజిగారికి మళ్లీ ఇన్నేళ్ల తరువాత గతం గుర్తుకొచ్చింది–

"అన్నా చెల్లెలూ సంప్రదించుకొని నిర్ణయం తీసుకున్న తరువాత ఇక నా ఆమోదం ఎందుకు బావగారూ?" అన్నారు రామసోమయాజిగారు.

"అదేవిటి బావగారూ! అలా అంటున్నారు? ఇదీ మీ అబ్బాయి చదువు విషయం! వాడి భవిష్యత్తు నిర్ణయించాల్సింది...."

"తండ్రిగా నా బాధ్యత! అయితే ఈ ఇంగ్లీషు చదువుల గురించి నాకేం తెలుసు చెప్పండి! అయినా మీరేం పరాయి వాళ్లుకాదు! కాలాను గుణంగా వాడిని తీర్చి దిద్దాలనీ, వాడి మంచి భవిష్యత్తుకోసం ఓ నిర్ణయం తీసుకున్నాక నేను అడ్డు చెప్పడం భావ్యం కాదు. నేను నేర్చుకున్న వేద శాస్త్రాలు ఈ రోజుల్లో ఎవరికి కావాలి చెప్పండి?" అన్నారు.

"అది కాదండీ! అబ్బాయి శివశర్మ ఇంగ్లీషు స్కూల్లో చదువుతానని సరదా పడుతున్నాడు. వేదశాస్త్రాలు చేతిలో విద్య! ఇంటి పట్టున వున్నప్పుడవి మీ వద్ద సావకాశంగా నేర్చుకుంటాడు" అంది కామేశ్వరమ్మ.

సోమయాజులు గారు భార్యవేపు చూసి పేలవంగా నవ్వేరు.

"ప్రయాణం ఎప్పుడు నిర్ణయించుకున్నారు?" అన్నారు బావమరిది రామజోగితో.

"మధ్యాహ్నం బస్సుకి బయల్దేరుదామనుకుంటున్నాం! ఈ రోజు దశమి మంచిది. రేపు ఏకాదశి! స్కూల్లో చేర్పించడానికి అన్ని విధాల అబ్బాయి పేర బావుంది!"

"సరే మంచిది! చూడు కామేశ్వరీ! సందుగ పెట్టె తాళాలివిగో! మీ అన్నయ్య గారికి మూడో, నాలుగో ఎన్నివేలు అవసరమో అడిగి ఆసొమ్ము తీసియివ్వు" అన్నారు.

"ఇప్పుడు డబ్బెందుకు బావగారూ!" అన్నాడు రామజోగికాస్త మొమాటంగా.

"ఎందుకా? నాకు తెలిసినంత వరకూ ఇంగ్లీషు చదువులు ఉచిత విద్య కాదనుకుంటాను. స్కూల్లో ప్రవేశరుసుము, నెలజీతాలు పుస్తకాలు, బట్టలు, వగైరా స్కూలు వారు ఉచితంగా ఇవ్వరు కనుక" అన్నారు.

"అదికాదు బావగారూ! అవన్నీ నేను..." అని ఏమో చెప్పబోయేడు. అవరకే సోమయాజిగారు లేచి పెరట్లోకి వెళ్లి పోవడంతో మౌనం వహించేడు.

సోమయాజిగారి ఏకైక సంతానం శివశర్మ. వయస్సు తొమ్మిది సంవత్సరాలు. మంచి తెలివైనవాడు. ఎలిమెంటరీ స్కూల్లో ఐదవతరగతి పూర్తి చేసేడు. తండ్రి వద్ద వేద, సంస్కృతం నేర్చుకుంటున్నాడు.

రామజోగి కామేశ్వరమ్మ అన్న. మంచి లౌక్యుడు. అతడు ఏ పనిచేసినా ఎంతో ముందు చూపుతో పథకం వేసి చేస్తాడు. వేదం, సంస్కృతం నేర్చుకుని పట్టణంలో సంస్కృత కళాశాలలో తెలుగు పండిట్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. ఆయనకు కాదంబరి అనే ఆరేళ్లకూతురుంది. పెద్ద చదువు చదివి మంచి ఉద్యోగస్తుడికిచ్చి తన కూతుర్ని పెళ్లిచెయ్యాలని అతని సంకల్పం-అందుకు మేనల్లుడిని అన్ని విధాల తీర్చి దిద్దాలనుకుని పథకం వేసుకున్నాడు. చెల్లెల్ని పురికొల్పి మేనల్లుడిని ఉసికొల్పి

కాన్వెంటు చదువుకు ఒప్పించి వెంట పట్నం తీసుకొచ్చాడు. కాన్వెంటులో చేర్పించాడు. మేనల్లుడి చదువు ఖర్చుతోనే తన కొడుకు చదువు ఖర్చుకలిసి రావాలని ప్లాను వేసుకుని వాడిని ఎల్.కె.జీలో చేర్పించాడు.

సోమయాజిగారి ఏకైక పుత్రుడిని అల్లుడుగా చేసుకొని ఆయన ఆస్థినంతా దక్కించుకోవాలనేది రామజోగి మనసులోని కోరిక.

శివశర్మ స్వతహాగా ఎంతో తెలివైనవాడు. మంచి చురుకైనవాడు. చదువులో అన్ని క్లాసుల్లోనూ ఫస్ట్ వస్తున్నాడు. శలవుల్లో ఇంటికి పంపితే మేనల్లుడు మనసు మార్చుకొని ఎక్కడ చెయ్యి జారిపోతాడో అన్నభయంతో ఏదో నెపంతో వాడిని తల్లిదండ్రులవద్దకు పంపకుండా మేనేజ్ చేస్తున్నాడు. ఒకవేళ వెళ్లాల్సివస్తే రామజోగి కూడ వెళ్లి వస్తున్నాడు.

కన్నకొడుకు వేదవిద్య కాదని ఇంగ్లీషు చదువులకు వెళ్లడం అందుకు వాడిని కన్న తల్లే ప్రోత్సహించడం సోమయాజిగారు మనస్సులోనే ఎంతో బాధపడ్డారు. వంశపారంపర్యంగా వస్తున్న వేదవిద్య తనతోనే అంతరించిపోతుందేమోనని దిగులు చెందేరు.

శివశర్మ కాలేజీ చదువుకు వచ్చాక తన బసమేనమామ ఇంటి నుండీ హాస్టల్‌కి మార్చాడు. డిగ్రీ చదువులో స్టేట్‌ఫస్ట్ సాధించి యూనివర్సిటీలో పోస్ట్‌గ్రాడ్యుయేట్‌లో గోల్డ్ మెడల్ అందుకున్నాడు. ఐ.ఏ.ఎస్. పూర్తిచేసి ఢిల్లీలో ఉద్యోగం సంపాదించుకున్నాడు.

రామజోగి ఆనందానికి అంతులేదు. 'తన పథకం ప్రకారం మేనల్లుడు పెద్ద చదువు చదివి మంచి ఉద్యోగం సంపాదించుకున్నాడు. ఇక ఆ పెళ్లికాస్త జరిపించేస్తే తన లక్ష్యం నెరవేరుతుంది' అనుకున్నాడు.

బావగారితోను, చెల్లెలితోను మేనల్లుడి ఎదుటే పెళ్లివిషయం ప్రస్తావించేడు. వాళ్లు సమాధానం చెప్పేలోపలే శివశర్మ తనకు మేనరికం చేసుకోవడం ఏమాత్రం ఇష్టంలేదని నిర్మొహమాటంగా చెప్పేడు. తనతో చదువుకున్న అమ్మాయి కాత్యాయనిని చేసుకుంటానన్నాడు. కాత్యాయని డా. సంజీవరావుగారి ఏకైక పుత్రిక ఎమ్.ఎ. వరకూ చదివింది. మంచి అందకత్తె. ప్రస్తుతం పి.హెచ్.డి. చేస్తోంది. డాక్టర్ సంజీవరావుగారికి పట్టణంలో పెద్ద నర్సింగ్ హోమ్ ఉంది.డాక్టరుగా మంచిపేరు పలుకుబడి గల వ్యక్తి.

మేనల్లుడి మాటలకు రామజోగి మండిపడ్డాడు. విశ్వాసం లేని వాడని నిందించేడు. బంధుత్వం లెక్క చెయ్యకుండా మౌనం వహించిన చెల్లెల్ని, బావగారిని ఎన్నో విధాలుగా తూలనాడేడు. తన పథకం పారనందుకు ఎంతో విచారించేడు.

మేనకోడలు తనకు కోడలు కాలేదని కామేశ్వరమ్మ కొంత చింతించినా మంచి అందం, చదువు ఉన్న పిల్లకోడలు కాబోతున్నందుకు ఎంతో సంతోషించింది. కొడుకు పెళ్లి విషయంలో కూడ సోమయాజిగారు పెదవి విప్పలేదు.

డా. సంజీవరావుగారు కూతురి పెళ్లి శివశర్మతో ఎంతో వైభవంగా జరిపించేరు. కామేశ్వరమ్మ ఆనందానికి అంతులేక పోయింది. పెళ్లికి రామజోగి కుటుంబం రాలేదు.

పెళ్ళితంతుపూర్తయిన తరువాత సోమయాజిగారు తిరుగుప్రయాణవిషయం వియ్యంకుడితో చెప్పాలని భార్యను వెంటపెట్టుకొని సంజీవరావుగారి వద్దకు వెళ్లారు. వారు వెళ్లేసరికి సంజీవరావుగారు, అతని భార్య ఒకావిడితో ముచ్చటిస్తున్నారు. అంతలో కాత్యాయని, శివశర్మ అక్కడకు వచ్చారు.

"రండి బావగారూ! ఈవిడ డాక్టర్ మేరీ! ఇదివరకు మా నర్సింగ్‌హోంలోనే పనిచేసేవారు. కాత్యాయని కన్నతల్లి యీవిడ. పుట్టగానే మాకు దత్తతపెంపకాని కిచ్చేరు." అని ఇంట్రడ్యూస్ చేసేరు.

వియ్యంకుడి మాటలకు షాక్ అయ్యారు సోమయాజిగారు, భార్య. శివశర్మ సంగతి సరేసరి. తన ముఖం తండ్రికి చూపలేక చివాలున బయటకు వెళ్లిపోయేడు.

సోమయాజిగారు వెంటనే తేరుకొని "మేము ఊరికి బయలుదేరుతున్నాం! ఆ విషయం మీకు చెప్పిపోదామని వచ్చాం!" అని భార్యను తీసుకొని ప్రయాణ మయ్యేరు.

"క్రొత్తకోడలిని గృహప్రవేశానికి తీసుకొని రాలేదేమని" గ్రామప్రజలంతా వారిని ప్రశ్నించారు.

"అబ్బాయికి సెలవు దొరకలేదని" తప్పించుకున్నారు.

సోమయాజిగారు క్రమంగా వేదం నేర్పడం మానుకున్నారు. తిరిగి ఇన్నేళ్ల తరువాత రామశర్మను చూడగానే వాడిని శిష్యుడిగా స్వీకరించి వేదం నేర్పాలన్న కోరిక కల్గింది.

రామశర్మ బట్టలు మార్చుకొని మండువాలో చిత్రాసనం మీద వ్యాసపీఠం ముందుకూర్చున్న సోమయాజులుగారి వద్దకు వెళ్లి వారిఎదుట తాటి ఆకుల చదరమీద కూర్చున్నాడు.

ఆయన వాడి వేపు ఆప్యాయంగా చూసి "ఏంబాబూ! ఈ రోజుల్లో ఉన్నవారు, లేనివారు అంతా ఇంగ్లీషు చదువులకు మొగ్గుచూపుతున్నారు. ఇంగ్లీషు చదివి మంచి ఉద్యోగస్తులవ్వాలని ప్రయత్నిస్తున్నారు. మరి నువ్వు వేదం నేర్చుకుందామని ఎందుకు అనుకున్నావు?" అన్నారు నవ్వుతూ.

కాస్సేపు మౌనం వహించి ఇంగ్లీషు చదువుకు అవకాశం లేదండీ" అన్నాడు.

"నేను చదివిస్తాను చదువుకుంటావా?"

"వొద్దండి! నాకు వేదం నేర్చుకోవాలని ఉంది" అన్నాడు

"లోగడ ఎవరి వద్దైనా ఏమైనా నేర్చుకున్నావా?"

"ఉపనయనం చేయించిన గురువుగారి వద్ద సంధ్యావందనం నేర్చుకున్నాను. శ్రీసూక్తం, పురుషసూక్తం, నమకం, చమకం, అరుణం మావీధిలో దేవాలయంలో రికార్డులు వేస్తే విని నేర్చుకున్నాను" అన్నాడు.

"రుద్రనమకం చెప్పమన్నారు.

రామశర్మ చెప్తూ వుంటే ఆయన కూడ స్వరంకలిపి కొంత వరకూ చెప్పి "ఇక చాలు" అన్నారు.

"ఉచ్చారణ, స్వరం బాగున్నాయి" అనుకున్నారు.

ముందుగా యజుర్వేదం ప్రారంభించేరు. ప్రతీది మూడు సంతలు చెప్పించుకొని వల్లేవేసి అప్పగిస్తున్నాడు. రామశర్మ 'ఏకసంతగ్రాహి' అని గుర్తించేరు. కుర్రాడి దీక్ష పట్టుదలకు మెచ్చుకున్నారు. శిష్యుడి కోరికమేరకు మూడు వేదాలు ప్రారంభించి మూడు పూటలా చెప్తున్నారు. నేర్చుకున్నది తడబడకుండా ఎప్పటికప్పుడు అప్పగిస్తున్నాడు. సమయం వృధా చేయకుండా గురువుగారికి సేవ చేస్తూ వారు చెప్పింది నేర్చుకుంటున్నాడు.

భర్త ముఖంలో మునుపటి కళ, తేజస్సు, సంతోషం తిరిగి చూడగలిగింది

కామేశ్వరమ్మ. అందుకు ఎంతో సంతోషించింది.

రామశర్మకు పదిహేను యేళ్ళు రాకుండానే నాలుగు వేదాలు క్షుణ్ణంగా నేర్చుకుని గురువుని మించిన శిష్యుడిలా తయారయ్యాడు. ఇప్పుడు సంస్కృతం, శాస్త్రాలు అభ్యసిస్తున్నాడు. మొదట్లో రామశర్మను "పండుగులకు మీ వాళ్ళ వద్దకు వెళ్తావా" అని అడిగేరు సోమయాజి గారు. "వెళ్లను నాకు చదువే ముఖ్యం" అని దృఢంగా చెప్పేడు. ఒకవేళ తాను అటు వెళ్లగానే ఇటు గురువుగారు మనసు మార్చుకొని చదువు చెప్పడానికి నిరాకరిస్తారేమో నన్న భయం! రామశర్మకుంది.

ప్రభుత్వం వారు ప్రతియేడూ తిరుపతిలో వేదపరీక్షలు నిర్వహిస్తున్నారు. ఉత్తీర్ణులైన వారికి సర్టిఫికేట్స్ ఇస్తున్నారు. ప్రథమ శ్రేణి వారికి బంగారు పతకం, వెయ్యి రూపాయల నగదు, దుశ్శాలువాలతో సత్కరిస్తున్నారు. పరీక్షలు నాలుగు వేదాల్లోనూ జరుగుతాయి.

సోమయాజిగారు మొదట్లో పరీక్షాధికారిగా వెళ్లేవారు. తరువాత కొన్నేళ్లుగా ఏదో నెపంతో తప్పించుకుంటున్నారు. లోగడ ఆయన వద్ద చదువుకున్నవారంతా తిరుపతిలో పరీక్షకు వెళ్లి ఉత్తీర్ణులయ్యారు.

"తిరుపతిలో జరగబోయే వేదపరీక్షకు వెళ్తావా?" అని రామశర్మను అడిగేరు గురువుగారు.

గురువుగారి ప్రశ్నకు రామశర్మ తలవంచుకుని కూర్చున్నాడు. సమాధానం చెప్పలేదు.

"ఏం బాబూ! వెళ్లవా?" అన్నారు.

"నా దగ్గర డబ్బులు లేవండీ!" అన్నాడు విచారంగా.

గురువుగారి గుండె కలుక్కుమంది.

"పరవాలేదు నేను నిన్ను తీసుకొని వెళ్తాను" అన్నారు.

రామశర్మ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. పరుగు పరుగున వెళ్లి విషయం గురువమ్మగారికి చెప్పేడు.

కామేశ్వరమ్మకు నమ్మకంలేక భర్తను అడిగింది.

"అవును కామేశ్వరీ! పరీక్షాధికారిగా రమ్మని నాకు ఆహ్వానం వచ్చింది. పరీక్షలకు రామశర్మను తీసుకొని వెళ్తానన్నాను! అన్నట్లు లోగడ నువ్వు తిరుమలేశుని దర్శించి రావాలని ఉందన్నావు కదా! నువ్వూ బయల్దేరు" అన్నారు.

గురుపత్ని కూడ తమతో వస్తున్నందుకు రామశర్మ ఆనందంతో చిందులేసేడు. ముగ్గురూ తరుపతి చేరుకున్నారు. చాల సంవత్సరాల తరువాత తమ ఆహ్వానాన్ని మన్నించి వచ్చిన సోమయాజిగారికి ఘనస్వాగతం లభించింది. ముగ్గురూ ముందుగా వెళ్లిదైవదర్శనంచేసుకొని వచ్చారు.

"తన శిష్యుడు నాలుగు వేదాల్లో పరీక్షలకు హాజరవుతున్న కారణంగా తాను పరీక్షాధికారిగా ఉండడం భావ్యం కాద"న్నారు.

అంతేకాదు రామశర్మ తన శిష్యుడని ఎవరికీ పరిచయం చెయ్యలేదు.

"పరీక్షాధికారిగా కాకున్నా అధ్యక్షస్థానంలో కూర్చొని సూపర్‌వైజ్ చెయ్యమని కోరేరు. సోమయాజిగారు కాదనలేకపోయేరు.

పరీక్షకు హాజరైన విద్యార్థులందరిలోనూ అతి తక్కువ వయస్సు వాడు రామశర్మ. వారి వయస్సులో సగం వయస్సుకూడ లేదు.

"వీడు వారిలో నెగ్గుకు రాకలడా? పసివాడు వారి ముందు భయపడకుండా నిల్చోగలడా? అని భయపడింది కామేశ్వరమ్మ

రామశర్మ మాత్రం ఎంతో ధైర్యంగా ఉన్నాడు.

పరీక్షాధికారులు మొదట రామశర్మను చూసి అతడు ఎవరో ఏమిటో తెలియక తమలో తాము ముసిముసినవ్వులు నవ్వుకున్నారు.

వారు అడిగింది తడవుగా ఏమాత్రం జంకూ భయం లేకుండా గడగడా చెప్పడంతో నిర్ఘాంతపోయారు.

నాలుగు వేదాల్లోనూ ఒకేమారు పరీక్షకు హాజరైన ఏకైక విద్యార్థి రామశర్మ. నాలుగు వేదాల్లోనూ ఆయేడు ప్రథముడిగా ఎంపికచేయబడి స్వర్ణపతకాలు అందుకున్నాడు. రామశర్మ గురువు సోమయాజిగారని తెలుసుకొని అందరూ ప్రశంసించేరు.

రామశర్మ స్వర్ణపతకాలు, సర్టిఫికేట్స్, శాలువలు తీసుకొని సభలో ముందు

వరుసలో కూర్చున్న గురువుగారి వద్దకు ఆనందంతో వచ్చి గరువుగారికి, ఆయన ప్రక్కనే కూర్చున్న గురుపత్నికి పాదాభివందనం చేసేడు.

"బాబూ! ఈ సంతోషంలో పాలు పంచుకోవల్సింది నీకు జన్మనిచ్చిన నీ తల్లిదండ్రులు! వెళ్లివాళ్ల దీవెనలు పొందిరా!" అంది కామేశ్వరమ్మ రామశర్మతో.

రామశర్మ గురువుగారి వేపు చూశాడు.

సోమయాజులు గారు భార్య వేపు ప్రశ్నార్థకంగా చూసి

"ఏమిటీ రామశర్మ తల్లిదండ్రులు ఈ సభకు వచ్చారా?

"అవునండీ! వెళ్లు బాబూ! వెళ్లి వాళ్లను తీసుకొనిరా"

రామశర్మ నెమ్మదిగా వెళ్లేడు.

"అంటే వాళ్లు ముందుగానే నీకు తెలుసా!"

"తెలియదండీ!

"మరి?"

"ఊహించాను... మీ శిష్యుడి రూపు తల్లి పోలికైనా అలవాట్లు, మాట, నడక తీరు పూర్తిగా తండ్రిపోలికే!"

"అంటే రామశర్మ...!"

"అవునండీ! నేను గ్రహించిన యీ విషయం ముందుగా మీకు చెప్తే వాడికి చదువు చెప్పకుండా పంపించి వేస్తారేమోనన్న భయంతో ఈ విషయం మీకు చెప్పకుండా యిన్నాళ్లూ రహస్యంగా ఉంచేను. నన్ను క్షమించండి" అంది.

"లేదు కామేశ్వరీ! నేనే తప్పు చేసేను. అబ్బాయి ఎవరో తెలిసికూడ నీకు నేనే చెప్పలేదు. నా లక్ష్యసాధనకోసం వాడికి శిష్యుడిగానే శిక్షణ ఇవ్వాలనుకున్నాను..."

"కాదు గురువుగారూ! అమ్మగారూ మీరూ నన్ను క్షమించాలి! మీరెవరో నాకు ముందుగానే తెలిసినా నేనెవరో చెప్పకుండా మీవద్దవిద్య నేర్చుకున్నాను" అన్నాడు రామశర్మ.

"ఇంకా గురువుగారూ! అమ్మగారూ ఏవిట్రా? తాతగారు నాయనమ్మా అని

పిలవక" అన్నారు సోమయాజిగారు పాదాభివందనం చేస్తున్న కొడుకు కోడలిని దీవించేరు.

"నాన్నగారూ! కొడుకుగా నేను మీ ఆశయాలు నెరవేర్చలేకపోయాను" అన్నాడు శివశర్మ

మనవడిగా నీ కొడుకు అది సాధించేడు" అన్నారు సంతోషంతో సోమయాజి గారు.

"అందుకు 'నాలుగు స్తంభాలాట' తప్పనిసరి అయింది" అంది కాత్యాయని చిరునవ్వుతో.

**(ఫేకర్ 1966 సంక్రాంతి సంచిక)** ✪

# కసాయివాడి కన్నీరు

"సన్నమ్మా! ఓ సన్నీ! బయటకు రాయే!" అంటూ బిగ్గరగా కేక పెట్టాడు కొండయ్య.

"ఏటా యిసురుబాటు! కూసింత ఆగనేవేటి? కోక సుట్టుకుంతున్నా" అంది గుడిసెలోంచి బయటకు వస్తూ.

"సేసుకున్న సెకు సాల్లే! నీ బొట్టేడు సేస్తన్న పాటుకు పోయి సూసేడానికి పిలకట్టు, సీరా యేసుకుపో పని లేదే! గోసీ ఏసుకుని ఎల్లొచ్చు!" అన్నాడు వెటకారంగా.

"ఏనాడూ నేంది యీ పొద్దు యిట్టా వొల్లాపన సేస్తన్నావు ఏటి అయింది నీకు?" అంది.

"ఇంకా ఏటవ్వాలే! మన సూరయ్యగోడు మోసం సేసినాడే! ఆడు ఏదో గొప్ప సదువులుసదివి పెద్ద వుజ్జోగాలు ఎలగబెడతన్నాడని కలగన్నవు! కడుపులు మాడ్చుకుని పైసా పైసా పోగెట్టి ఆడికి అంపించినావు. ఆడిని పూరాగా సెడగొట్టినావు. ఆడేటి సేస్తనానడో నీకల్లత నువ్వు సూస్తవుగాని బయలెల్లు" అంటూ భార్య రెక్క పట్టుకొని నాలుగు అడుగులు వేశాడు కొండయ్య.

సన్నమ్మకేమీ అర్థం కాలేదు. భర్తచేతిని విడిపించుకొని అతని వెంట బయల్దేరింది.

ఆమెకు కొడుకు సూరయ్యమీద ఎనలేని నమ్మకం ఉంది. వాడు ఎంతో చురుకైనవాడు తెలివైనవాడు. ఎరిగి మరిచి వాడు తప్పుపని చేయడు.

"మనం ఎర్రిబాగులోల్లం! మతిలేని వోల్లవని గెహించే రావయ్యమేట్టరు మన్ని గుమ్మిల దిగేసీసినాడు!"



"నీకు అనుబవం నేదే! కూలోడి కొడుకు కూలిపని సేసి ఆడూ కూలోడే అవ్వాల! రిచ్చావోడి కొడుకు రిచ్చాలాగాల! సెప్పుకుట్టేవోడి కొడుకు సెప్పులే కుట్టాల! అదీ సబవు! ఆల్లు కలెట్టర్లూ, వింజినీల్లు డాట్టర్లూ అవుతారని బెమపడకు ఎర్రిమొకమా"

"రావయ్య మేట్టరుగోరు సెవతన్నారని ఆడేదో పెద్దసదువులు ఎలగ బెడతన్నాడని మునగసెట్టెక్కి కూకున్నావు. పదేళ్ళు ఎదురు సూసినావు. ఏడాదికో సట్టు కలబడి ఆడు సెప్పే కతలు నిజవే అనుకుని మురిసిపోనావు. ఈ పొద్దు సూడవే ఆడేటో ఆడియాసవేటో, రంగేటో అంతా బయటడిపోనాది" కొండయ్య దారి పొడుగునా కొడుకుని నిందిస్తున్నాడు.

ఎంత ఆలోచిస్తున్నా సన్నమ్మకు కొడుకు చేసిన తప్పుడు పనేమిటో అర్థం కాలేదు. దానికంటే భర్తకు అంత కోపం రావడం ఆమె ఎన్నడూ చూడలేదు. కొండయ్య స్వతహాగా ఎంతో నెమ్మదస్తుడు. అతడు నోరి విప్పి మాట్లాడడం అరుదు.

సూరయ్య చదువు పూర్తైన వెంటనే అతనికి హైదరాబాదులో పెద్ద ఉద్యోగం వచ్చింది. వెళ్ళి జాబ్‌లో చేరేడు. తల్లినీ తండ్రినీ హైదరాబాదు తీసుకొని వెళ్ళడానికి అతను బయలుదేరి వస్తున్నాడు. అతను వస్తున్న విషయం తెలుసుకొని పట్నంలో లయన్సుక్లబ్‌వారు అతనికి పౌరసన్మానం ఏర్పాటు చేసేరు. సన్మానానికి తన తల్లిదండ్రులను తీసుకొని రమ్మనమని రామయ్య మేష్టారుకి కబురు పంపేడు. తల్లిదండ్రులకు , మేష్టారుకి ఖరీదైన బట్టలు పంపించేడు. ఈలోగా ఈ గొడవొచ్చింది. భర్త వెంట నడుస్తున్న సన్నమ్మకు పాత విషయాలు గుర్తుకొచ్చేయి...

"సిత్తం బాబయ్యా! తవలాటి పెద్దోరి దరిసెనం సేసుకునేటయాంల ఉత్త సేతల రానేం గదయ్యా! పండూ కాయా మాలాటి వోరి సేతల తవలాటోరు దీసుగుంటారో నేదో బయం! ఇది మా సేతిల పని. తవరి పాదాలకి సెప్పులు గుట్టి దెచ్చినావండి!" అన్నాడు కొండయ్య చేతిలో కొత్త చెప్పులను తలగుడ్డ తీసి మరొకమారు తుడిచి మేష్టారి పాదాల దగ్గరుంచేడు.

మూడు నెలలనుండి కొత్త చెప్పులు కొనుక్కోవాలనుకుంటూ ఆర్థిక ఇబ్బందుల వల్ల వాయిదా వేస్తున్నారాయన. పాత చెప్పులకే పలుమార్లు కొండయ్య చేత మాసికలు వేయించి నెట్టుకొస్తున్నారు.

రామయ్య మేష్టారు వాటిని తీసుకోవడానికి తటపటాయించారు. నెలాఖరు రోజులు. వాటి ఖరీదు చెల్లించటానికి ఆయన వద్ద ప్రస్తుతం డబ్బులేదు. జీతాలు వచ్చేక చెల్లిద్దామనుకొని. "వీటి ధర ఎంతో చెప్పవోయ్!" అన్నారు. చెప్పులు కాళ్లకు వేసుకొని చూసుకున్నారు. చక్కగా సరిపోయాయి.

"ఎంత మాటనీసినారు బాబయ్యా! సదువులు సెప్పే మేట్టరిగోరికాడ మావు పొమ్ముచ్చుగుంటావా!" అంది కొండయ్య భార్య సన్నమ్మ నొచ్చుకుంటూ.

"బావూ ఈడు మా ఒక్కగానొక్క బొట్టెడు సూరయ్య. ఈడు సదువుకుంతానని ఇంటికాడ ఒటే నస యెడతన్నాడు. ఈడయ్య యీడిని పని నేరుసుకోమని బోద సెస్తన్నాడు. నాలుగేల్ల గుంటడు. ఈడికి పనికి తొందరేటి? నాలుగచ్చురం ముక్కలు నురుసుకోనీ. అయినాక సేతిల ఇద్దె నేరుసుగోవొచ్చు ఏడబోతాదని నాను తగవులాడతన్నాను. తవరు యీడికి నాలుగచ్చురాలు నేర్పండి బాబయ్యా. తవరి మేలు మరుపం!" అంది సన్నమ్మ చేతులు జోడించి.

"ఏం సూరయ్యా! నువ్వు చదువుకుంటావా?" అన్నారు రామయ్య మేష్టారు చిరునవ్వుతో.

"అవునండయ్యా!" అన్నాడు సూరయ్య సంతోషంతో చేతులు జోడించి.

"ఈ రెండు నెలలూ సెలవులు. స్కూలు లేదు. నేను ఇంటివద్దే ఉంటాను. నువ్వు రోజూ ఉదయాన్నే మా ఇంటికి రా! నీకు అక్షరాలు అవి రాయడం చదవడం నేర్పుతాను. స్కూలు తెరిచిన తరువాత నిన్ను అందులో చేర్పిస్తాను" అన్నారు.

ఆయన మాటలకు సూరయ్య, వాడి తల్లిదండ్రులు సంతోషించేరు.

"బాబూ అడి సదువుకు పలకా..."

"నా దగ్గరున్నాయి, నేనిస్తాను" అన్నారు.

రామయ్యమేష్టారి భార్య జానకమ్మ తన పిల్లలకు కురచైన రెండు నిక్కర్లు, చొక్కాలు తెచ్చి సూరయ్యకిచ్చింది. వాడు వాటిని తీసుకుని ఆనందించేడు. మర్నాడుదయం సన్నమ్మ కొడుకుని తీసుకొని వచ్చి మేష్టారికి వప్పగించి వెళ్లింది. రామయ్యగారు కొత్తపలక తెచ్చి దానిమీద అఆఇఈ అని నాలుగు అక్షరాలు రాసి వాడిచేత చెప్పించి దిద్దమన్నారు.

వాడు వాటిని పదినిమిషాలు చదువుతూ దిద్ది చూడకుండా రాసి మేష్టారికి చెప్పేడు. వాడు చురుకుతనానికి ఆయన అబ్బురపడి మరో నాలుగు అక్షరాలు రాసిచ్చేరు. వాటిని కూడా వాడు త్వరగా నేర్చుకున్నాడు. నాలుగురోజుల్లో వాడు అక్షరాలు, గుణింతాలు, అంకెలు నేర్చుకొని ఒకటవ తరగతి పుస్తకంలో పేర్లు, వాక్యాలు చదవసాగాడు.

స్కూలు తెరిచిన తరువాత వాడిని స్కూల్లో జాయిన్ చేసేరు. చదువులో క్లాసు ఫస్టు. మూడేళ్ళ తరువాత వాడిని పట్నంలో సంక్షేమ హాస్టల్లో చేర్పించి చదివించేరు. వాడికి స్కాలర్‌షిప్ వచ్చింది. టెన్త్ స్టేట్‌ఫస్ట్ వచ్చేడు. వాడి అభీష్టం మేరకు వాడు కోరిన కోర్సులో చేర్పించి చదివించేరు ఆయన.

కొడుకు అవసరాలకు తల్లీతండ్రీ పైసాపైసా కష్టపడి సంపాదించి వాడికి అడపాదడపా మేష్టారి ద్వారా పంపేవారు.

"రావయ్య మేట్టరుగోరు ఈ పొద్దు పెందిల కబురెట్టి సూరయ్య యీ దినం

వస్తున్నాడు. మీకు బట్టలు పంపేడు. ఆడికి పట్టనంల యీయేల సన్మానం. మిమ్మల్ని దీసుకురమ్మన్నాడు" అని సెప్పేరు.

"మద్దిన మరి యీ అవోంతరవేటి?" అని ఆలోచనలతో పరాకుగా అడుగులు వేస్తున్న భార్యను..."సూడవే సూడు! ఆడ నీ కొడుకేటి నేస్తన్నాడో బాగా సూసుకో!" అని ముందుకు నెట్టేడు.

సన్నమ్మ తృళ్లిపడి ఆలోచనల లోంచి తేరుకుంది. కొడుకు చేస్తున్న పని చూసి ఉగ్రరూపిణియై ముందుకురికింది. కొడుకు ఫెల్ట్‌పట్టుకొని పైకి లేవనెత్తింది.

"నువు సదివిన సదువు సేస్తన్న వుజ్జోగం ఇదట్రా భాడకా!" అని ఈ చెంపా ఆ చెంపా ముమ్మారు వాయించింది. అదే వూపున వెళ్లి భర్త చేయి పట్టుకొని..." ఆడు నాకు పుట్టనేదనుకుంతాను పద" అంది ఆవేశంతో.

ఈ సంఘటనకు అక్కడున్న వారంతా నివ్వెరపోయేరు.

'సూరయ్య వెంటనే తేరుకుని "అమ్మా!...." అని ఏమో చెప్పబోయాడు బొంగురుపోయిన గొంతుకతో.

"సీ నువు అట్టా పిలవక..."

"అగు సన్నమ్మా! ఎంత పని చేశావు. ప్రయోజకుడైన చెట్టంత కొడుకుని నలుగురి ముందూ కొట్టడానికి చేతులెల్లా వచ్చేయి! నీ మనసెలా ఒప్పింది? వాడు చేసిన నేరం ఏమిటమ్మా!" అన్నారు రామయ్యగారు తొందరగా అడుగులు వేస్తూ వారి వద్దకు వచ్చి.

"ఆడు సేస్తన్న పనేటో తవకింకా అవుపడతనేదేటండీ! ఆడిని అన్ని ఇదాల సెడగొట్టింది నువుగాదేటి?" అంది రోషంగా.

"అవును సన్నమ్మా! మీ వాడిని చెడగొట్టింది నేనే! సూరయ్య ఎంతో తెలివైనవాడు, చురుకైనవాడు అని గ్రహించి వాడికి నాలుగు అక్షరాలు నేర్పించడం నే చేసిన పెద్ద నేరం! వాడు చదువుకు పట్నంలో నలుగురినీ ప్రాధేయపడి వసతులు వనరులు సమకూర్చి వాడు కోరిన విధంగా చదివించి వాడిని గొప్ప డాక్టరుగా చేయడం నేను చేసిన మరొక నేరం!"

"మాష్టారూ! మనుషులకు రోగాలు వస్తే వారు తమ బాధలను డాక్టర్లకు

చెప్పుకుని వైద్య సహాయం పొందుతారు. మందులు వాడి రోగాలు నయం చేసుకొంటారు. కాని జంతువులకు రోగాలు వస్తే అవి నోరు విప్పి వాటి బాధలు చెప్పలేవు. వాటి ప్రవర్తనను బట్టి వాటి జబ్బులను తెలుసుకొని చికిత్స చేయడమే గొప్పపని. అందుచేతనే నేను పశువుల డాక్టర్ని అవుతానని నీ కొడుకు సూరయ్య అది సాధించేడు. ఈ రోజు అతను దేశంలో గొప్ప పశువుల డాక్టరు. చదువు పూర్తయిన వెంటనే వాడికి హైదరాబాదులో ఉద్యోగం వచ్చింది. వాడు మిమ్మల్ని హైదరాబాదు తీసుకుపోదామని వచ్చేడు. అతను వస్తున్న విషయం తెలుసుకొని లయన్స్ క్లబ్‌వారు ఈ రోజు సాయంత్రం అతనికి పౌరసన్మానం ఏర్పాటు చేశారు"

అయితే అతను ఉదయం పట్నం రాగానే ఈ చుట్టుప్రక్కల గ్రామాల్లో పశువులు వింతరోగంతో చనిపోతున్నాయన్న సంగతి ఇక్కడ డాక్టర్ల ద్వారా తెలుసుకున్నాడు. వారి కోరిక మేరకు వారికి పశువులకొచ్చిన వింతరోగం గురించి వివరిస్తున్నాడు. జబ్బు వచ్చి చనిపోయిన పశువును కోసి జబ్బు వివరాలు అందరికీ బోధపరుస్తున్నాడు. అక్కడ నీ కొడుకు చుట్టూ ఉన్న వారంతా డాక్టర్లే!" అన్నారు రామయ్య మేష్టారు.

"బుద్ధీగేనంలేని మూర్కుడిని! కన్నతల్లిని కొడుకుమీదకు ఉసిగొలిపిన కసాయివోడిని! ఎర్రి బాగుల్ది దానికేటీ తెల్దు! దాని దోసవేటీనేదు సెమించండి బాబయ్యా!" అని కంటనీరు పెట్టుకొని రామయ్య మేష్టారి కాళ్లమీద పడ్డాడు కొండయ్య.

**(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 8 డిసెంబరు 2001)** ✪

# ఋణానుబంధం

ఆకాశంలో దట్టమైన నల్లని మేఘాలు నలుమూలలా వ్యాపించి చినుకులు పడనారంభించాయి. "బయలుదేరినప్పుడు ఎండ! కొద్ది సేపటిలోనే సడన్‌గా వర్షం! ఏమిటో ఈ ఛేంజి! ఏదిఏమైనా వర్షం పెద్దదవకమునుపే ఇల్లు చేరుకుంటే ఎంతో బాగుండును" అనుకొని "కాస్త స్పీడుగా పోనీ!" అని డ్రైవర్ని హెచ్చరించాలనుకుంది మందాకిని.

కాని ఆమె మిన్నకుండిపోయింది. కారణం వర్షంతోపాటు గాలి కూడా ఉధృతంగా వుండటంవల్ల ముందున్న రోడ్డు ఏమీ కనిపించడంలేదు.

మందాకిని ఆరోజు ఉదయం తన పదినెలల కొడుకు ప్రశాంత్‌ని తీసుకొని కారులో తన ఫ్రెండ్ ఇందిర ఇంట్లో ఫంక్షన్‌కి వైజాగ్ వెళ్ళింది.

సాయంత్రం వరకూ ఫ్రెండ్‌తో సరదాగా గడిపి తిరుగు ప్రయాణమైంది. అయితే అనుకోకుండా ఈ వర్షం. ప్రశాంత్ మంచి నిద్రలో వున్నాడు.

"వాడు నిద్రనుండి లేస్తే పాలకోసం ఏడుస్తాడు. పాలు బాటిల్లోపోసి రడీ చేద్దా"మనుకుంది. ప్లాస్కు మూత తీసింది. అందులో పోసిన వేడి పాలు విరిగిపోయి వుండటం చూసి కాస్త విసుక్కుంది.

"ఇంకా సుమారు అరగంట ప్రయాణం! వర్షంలేకుంటే ఈ పాటికి ఇల్లు చేరుకొని వుందుము!" అనుకుంది.

"అయితే అంతలో దూరంలో ఎక్కడో పిడుగుపడింది. ఆ శబ్దానికి ప్రశాంత్ ఉలిక్కిపడి కళ్ళు తెరచి ఏడుపు లంకించుకున్నాడు. మందాకిని కొడుకుని భుజం మీద వేసుకుని సముదాయించబోయింది. వాడు ఏడుపు ఆపలేదు.



పాలు విరిగిపోయిన విషయం డ్రైవర్‌కి చెప్పి సాధ్యమైనంత త్వరగా డ్రైవ్ చేయమంది. డ్రైవర్ స్పీడు పెంచాడు. అయితే వారికి మరోపది కిలోమీటర్ల దూరంలో గమ్యస్థానముందనగా కారు రెండు జర్క్‌లిచ్చి సడన్‌గా ఆగిపోయింది.

"ఏమైంది?" అంది ఆతృతగా.

"చూస్తాను అమ్మా!" అని బోనెట్ లివర్ లాగేడు.

వర్షం జోరుగానే పడుతోంది. డ్రైవర్ డోర్ తెరిచేసరికి ఒక్కమారు వర్షపు జల్లు లోనికి వచ్చింది. పది గజాల దూరంలో రోడ్డుకు ఎడమ ప్రక్క "గురూజీ" ఆశ్రమం చూసేడు.

"మేడమ్! ప్రక్కనే గురూజీ ఆశ్రమం వుంది. పాలు దొరుకుతాయేమో అడగమంటారా?" అన్నాడు.

"సరే కనుక్కో!" అంది మందాకిని.

డ్రైవర్ పరుగుపరుగున ఆశ్రమానికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి అక్కడ పాతిక మంది స్త్రీలు, పదిమంది పురుషులు కూర్చుని వున్నారు.

గురూజీ వారికి సుందరకాండ పురాణం వినిపిస్తున్నారు.

గురూజీకి డ్రైవర్ నమస్కరించి విషయం చెప్పేడు. గురూజీ సమాధానం చెప్పేంతలో ఒకామెలేచి గోడ వారనున్న రెండు గొడుగులు, టార్చ్‌లైటు తీసుకుని గబగబకారు చెంతకు వెళ్ళి "రండమ్మ గోరూ! బిడ్డను ఇటు దెండి!" అని మందాకినికి ఒక గొడుకు ఇచ్చి ఆమె చేతిలో ఏడుస్తున్న బిడ్డను అందుకొని ఆమెను ఆశ్రమంలోనికి తీసుకొని వచ్చి గురూజీకి ఇచ్చింది. ప్రశాంత్ గురూజీ ముఖంలోకి చూసి టక్కున ఏడుపు ఆపివేసేడు. గురూజీ ముఖంలోకి చూసి టక్కున ఏడుపు ఆపివేసేడు. గురూజీ వాడిని ఒడిలో పడుకోపెట్టుకున్నారు.

మందాకిని ఒకచేత్తో గొడుగు రెండో చేత్తో పిల్లాడి సామాన్లు వున్న బాస్కెట్ పట్టుకొని వచ్చింది. అంతలో ఒకామె వచ్చి మందాకిని చేతిలో గొడుగు, బాస్కెట్ అందుకొని ఆమెను హాలులోకి తీసుకొని వెళ్ళింది.

హాలు నలుమూలలా చూసింది మందాకిని. సుమారు వందమంది విశాలంగా కూర్చోగల హాలది. హాలుకి ప్రక్కగా మూడు గదులున్నాయి. హాలులో ఒక ప్రక్క గోడకు ఆనుకొని ఆరు అడుగుల వెడల్పు తొమ్మిది అడుగుల పొడవు, రెండు అడుగుల ఎత్తువున్న తిన్నె వుంది. దానిమీద తుంగచాప పరిచి వుంది. దర్భాసనంపైన చిత్రాసనం వేసి దానిమీద గురూజీ కూర్చున్నారు. అతి ముందు వ్యాసపీటం దానిమీద తెరచిన పుస్తకం వుంది. అతని వెనుక షెల్ఫ్‌లో రెండు అరలలో పుస్తకాలు, మిగిలిన రెండు అరలలో సీసాలు, వాటిలో పలు రకాల మూలికలున్నాయి.

గురూజీ వయస్సు 70 సంవత్సరాలు. మనిషి దృఢంగా వున్నారు. పసిమి రంగు దేహం, పట్టుకుచ్చులాంటి తెల్లనిగడ్డం, నుదుట చిన్న విబూది రేఖలు, పంచ, కంటి మెడలాల్చీ, మెడలో రుద్రాక్షమాల, ముఖంలో చక్కటి తేజస్సు వుంది. ప్రశాంత్ ఆకలి మరచి ఏడుపు ఆపి గురూజీతో ఊసులాడడం చూసి ఆశ్చర్యపడింది. మందాకిని ఆయనకు నమస్కరించింది.

"అమ్మగోరూ ఇటు దుక్కురండి! పాలు ఎచ్చబెట్టినాను!" అని అటు ప్రక్క వున్న గదిలోనికి మందాకినిని తీసుకొని వెళ్ళిందాకామె.

ఒక స్టీలుగ్లాసు నిండా వేడిపాలు ఒక బల్లమీద వున్నాయి. ప్రక్కనే ఒక ఖాళీగ్లాసు. పంచదార డబ్బా, స్పూన్, పిల్లాడి సామాన్ల బాస్కెటు వున్నాయి. మందాకిని పాలు చల్లార్చి కొద్దిగా గ్లూకోజ్ కలిపి బాటిల్‌లో పోసింది.

"బాబును దీసుగొస్తాను" అని గురూజీ ఒడిలోవున్న ఉన్న పిల్లాడిని అందుకోబోయింది. ప్రశాంత్ ఏడుపు ముఖం పెట్టాడు. గురూజీ బాబును బుజ్జగించి "పాలు తాగిరా ఆడుకుందాం" అని బాబును ఆమెకు అందించేరు.

కిసాన్ టార్చి గొడుగులు పట్టుకొని డ్రైవర్‌కి హెల్ప్ చెయ్యడానికి ఇద్దరు వ్యక్తులు కారు వద్దకు వెళ్ళారు.

బాబు పాలు త్రాగేవరకు రెండు కొబ్బరి బొండాలు కొట్టి మందాకినికి ఇచ్చేరు. ఒక ప్లేటులో బొప్పాయి పండు ముక్కలు, పనసతొనలుంచి ఆమెను తినమని బలవంతం చేసేరు. వారి ఆప్యాయత అభిమానానికి ఎంతో చలించిపోయింది. మందాకిని గురూజీ గురించి ఆశ్రమం గురించి వారిని అడిగింది.

సీతారాంనరంలో సమితి ప్రెసిడెంట్ గ్రామంలోని మోతుబర్లు చక్కటి రామాలయం కట్టించేరు. ఆలయంలో రామాయణం పురాణం చెప్పించాలనే కోరిక కలిగింది ఊర్లో జనానికి. సమితి ప్రెసిడెంటు అల్లుడు తనకు చదువు చెప్పిన గురువుగారు కరుణాకరం మాస్టారు ఉభయభాషాకోవిదులని, వారు వాల్మీకి రామాయణం పురాణం చక్కగా చెప్పగలరని వారిని తీసుకొచ్చేడు.

కరుణాకరం మాస్టారి కంఠ మాధుర్యం పామరులను సహితం ఆకట్టుకునే విధంగా ఉంటుంది. వారి కథాగానం ఊరి జనాన్ని ముగ్ధులను చేసింది. అతనిని అందరూ గురూజీ అని పిలువనారంభించేరు. గురూజీకి ఆయుర్వేదం మూలికావైద్యంలో గొప్ప అనుభవముంది. ఆ గ్రామ సర్పంచ్‌కి జాండీస్ సమయం చేసేరు. గురూజీకి బంధువులు. నా అనే వారు లేరని విన్నారు. అయన్ని తమ ఊర్లోనే వుండిపోవాలని బలవంతం చేసేరు. వారికి కావాల్సిన భోజన వసతి సౌకర్యాలు కల్పిస్తామన్నారు.

గ్రామానికి ముందు జీవగెడ్డ ప్రక్కన రెండు ఎకరాల స్థలం మధ్యలో ఆశ్రమం కట్టించారు. ఆశ్రమం చుట్టూ ముళ్ళ తీగ కంచె వేసారు. ఖాళీ స్థలంలో కొబ్బరి, మామిడి, జామ, పనస, నిమ్మ మొక్కలు, కాయకూరల మొక్కలు, పూలమొక్కలు

వేయించారు. మోటారు ద్వారా నీరు మొక్కలకు ఏర్పాటు చేసి తోట పనివారిని నియమించేరు. ఆవరణలో ఒక ప్రక్క ఔషధాలకు ఉపయోగపడే వందరకాల మొక్కలు చుట్టుపక్కల కొండకోనల నుండి సేకరించి నాటించేరు. ఆశ్రమం ముందు అరుగుల మీద వివిధ సైజులలో కాల్వాలున్నాయి.

గత ఎనిమిది సంవత్సరాలుగా గ్రామ ప్రజలకు గురూజీ మాట వేదవాక్కు. ప్రతిదినం వారికి గురూజీ రామాయణం, భారతం, భగవద్గీత ఏదో ఒకటి చదివి వినిపిస్తుంటారు. పిల్లలకు భగవద్గీత శ్లోకాలు నేర్పిస్తున్నారు. గ్రామ ప్రజలందరికీ చదవడం, రాయడం నేర్పారు. వారికి కావాల్సిన వైద్య సదుపాయాలు అందించడమేగాక అందరూ ఆరోగ్య సూత్రాలు పాటించేలా చూస్తున్నారు. ఆశ్రమంలోని ఫలసాయం ఊరిప్రజల కోసమే వినియోగిస్తారు. గురూజీ ఎవరివద్దా దేనికీ డబ్బు స్వీకరించరు. ఆయనకు కావాల్సిన సదుపాయాలన్నీ ఆ గ్రామ ప్రజలే సమకూర్చుతున్నారు. ఆశ్రమానికి వచ్చేవారికి సదుపాయాలు గ్రామస్థులే చూస్తున్నారు.

ఈ విషయాలన్నీ మందాకిని తెలుసుకుంది. వర్షం తెరిపిచ్చింది. డ్రైవరు వచ్చి కారు బాగుపడిన విషయం చెప్పేడు. మందాకిని గురూజీకి నమస్కరించి వారి దీవెనలు పొంది కొడుకుని తీసుకుని బయలుదేరింది. ఆడవారంతా కారు వరకూ వచ్చి ఆమెకు వీడ్కోలు ఇచ్చేరు.

ప్రతాప్ రావుగారి ఏకైక కుమార్తె మందాకిని. మందాకిని డిగ్రీ చదువుతున్నప్పుడు తరచు ఆమె స్నేహితురాలు ఇందిర ఇంటికి వెళ్తుండేది. ఇందర ఇంట్లో మేడ మీద రాంప్రసాద్ అద్దెకుంటున్నాడు. అతని అందం, పర్సనాల్టీ, సభ్యతకు మందాకిని ఆకర్షితురాలయింది. అతను కూడా మందాకిని ఆకర్షితురాలయింది. అతను కూడా మందాకిని అందానికి దాసుడయ్యాడు. ప్రతాప్‌రావు గారి ఆరోప్రాణం మందాకిని. ఆమె కోరిక కాదనలేరు.

ఇందిర తల్లిదండ్రులను రాంప్రసాద్ గురించి వివరాలడిగేరు.

"రాంప్రసాద్ గత నాలుగేళ్ళుగా తమ ఇంట్లోనే అద్దెకుంటున్నాడని, అతనికి తల్లిదండ్రులు, తోబుట్టువులు, బంధువులు లేరని, కుర్రాడు యోగ్యుడు, బుద్ధిమంతుడు" అని చెప్పారు. 'అంతేకాదు మా ఇందిరకు మేనరికం వుంది లేకుంటే మా అమ్మాయినిచ్చేవాళ్ళం!" అన్నారు.

ప్రతాప్ రావుగారికి రాంప్రసాద్ పనిచేస్తున్న కంపెనీ ఎం.డి. మంచి ఫ్రెండ్. అతడిని రాంప్రసాద్ గురించి అడిగేరు.

"రాంప్రసాద్ మా కంపెనీలో సేల్స్ మేనేజర్‌గా గత మూడేళ్ళుగా పనిచేస్తున్నాడు. చురుకైన వ్యక్తి, వర్క్ మైండెడ్ పర్సన్. అతని చాతుర్యంవల్ల మా సేల్స్ ఇంప్రూవ్ అయ్యాయి. త్వరలో అతనికి జోనల్ మేనేజర్‌గా ప్రమోషన్ ఇవ్వబోతున్నాం!" అని చెప్పాడు.

ప్రతాప్‌రావుగారు తమ కూతుర్ని రాంప్రసాద్‌కిచ్చి వివాహం జరిపించారు. ఆయన నెల రోజుల క్రితమే హైదరాబాదు నుండి వైజాగ్ బదిలీమీద వచ్చారు.

మందాకిని గురూజీ గురించి, వారి ఆశ్రమం గురించి తల్లిదండ్రులకు చెప్పింది. మరొకమారు పగటిపూట ఆశ్రమం చూడాలనిపించి తల్లిదండ్రులను ఒప్పించి బయల్దేరదీసింది.

ఆశ్రమం ఆవరణలోని మొక్కలు చూసి ముచ్చటపడ్డారు మందాకిని మదర్ భవానీదేవిగారు. వారు హాల్లో అడుగుపెట్టేసరికి అక్కడ అరవంద మంది గ్రామప్రజలు కూర్చుని ఉన్నారు. వారి ముందు పదిమంది పిల్లలు నిల్చుని వున్నారు. గురూజీవారి చేత భగవద్గీత శ్లోకాలు చదివిస్తున్నారు.

మందాకిని గురూజీకి నమస్కరించి తల్లిదండ్రులను పరిచయం చేసింది. గురూజీని చూసి ప్రశాంత్ కేరింతలు కొడుతున్నాడు. గురూజీ వారిని దీవించి కూర్చోమని కుశల ప్రశ్నలు వేసేరు.

ప్రతాప్‌రావు గారు గురూజీ ముఖంలోకి క్షణకాలం నిశితంగా చూసి పరిసరాలను కేజువల్‌గా గమనిస్తూ గురూజీ ఊరు, పేరు, ఆయన వివరాలు అడిగి తెలుసుకున్నారు.

"మీరు సుమారు పన్నెండు సంవత్సరాల క్రితం శ్రీకాకుళంలో టీచర్‌గా జాబ్ చేసి రిటైర్ అయ్యేనన్నారు కదూ?"

గురూజీ అవునని తలపించించేరు.

"మీ రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ మొత్తం సొమ్ము రెండు లక్షల రూపాయలు మీ అబ్బాయి కాజేసి పరారయ్యేడు! అవునా?" అన్నాడు.

ప్రతాప్ రావుగారి మాటలకి గురూజీయే గాక అక్కడున్న వారందరూ షాక్ అయ్యారు.

"అంతేకాదు వార్తవిని మీకు హెల్ప్ చేద్దామనుకొనివచ్చిన వారెవరికి మీరు సహకరించలేదు. మీ అబ్బాయి మీద రిపోర్టివ్వలేదు.

"ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయా,

ఋణక్షయే క్షయం యాన్తికాతతత్ర పరివేదనా!" అని చెప్పి వచ్చిన వారినందరినీ సమాధానపరిచేరు" అవునా.

"చూడండి ఆ ఫోటోలో మీ ప్రక్కన వున్న ఫోటో చేతిలోనికి తీసుకొన్నారు. ఆయనకు గత స్మృతులు నెమరుకొచ్చాయి.

గురూజీ తన ఏకైక కొడుకుని తల్లిలేనిలోటు కనపడనీయకుండా పెంచి డిగ్రీ వరకు చదువుచెప్పించేరు. రిటైర్ అయ్యాక శేష జీవితం ప్రశాంతంగా గడిపేందుకు సొంత ఇల్లు వుండాలని కొనడానికి బేరం చేసి అడ్వాన్స్ ఇచ్చారు. ఆయన కూడబెట్టిన సొమ్ము రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ మొత్తం రెండు లక్షలు డ్రా చేసి పెట్టారు. రిజిస్ట్రేషన్ రోజు ఉదయం అతని కొడుకు ఆ సొమ్ము తీసుకుని పరారయ్యాడు. నేటి వరకూ వాడి జాడలేదు. స్నేహితులు, హితులు ఎంత చెప్పినా కొడుకు మీద రిపోర్టివ్వలేదు. "ఋణానుబంధం తీరిపోయింది" అన్నారు.

ప్రతాప్‌రావుగారు గురూజీ చేతిలో ఫోటో అందుకుని దానిని భార్యకు , కూతురుకీ చూపించేరు. మందాకిని ఫోటోలోని వ్యక్తిని గుర్తించి మూర్ఛపోయింది. అతను ఆమె భర్త రాంప్రసాద్.

**('సుప్రభాతం' వారపత్రిక, 22 డిసెంబరు 2001)** ✪

# వస్తువుతో బాటు శిల్పం కథానికకు ముఖ్యం

*రావి-ఎన్-అవధాని గార్ని హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం నుంచి డా॥ వేదగిరి రాంబాబు చేసిన ఇంటర్వ్యూ సంగ్రహపాఠవం.*

డా॥ రాంబాబు : **అవధానిగారూ! మీరు యాభై సంవత్సరాల నుంచి నిర్విరామంగా తెలుగులో కథానికలు రాస్తున్నారు కదా... అసలు మీరు ఈ ప్రక్రియని చేపట్టడానికి స్ఫూర్తి ఏమిటి?**

అవధాని : నా మనోభావాలను ఇతరులతో పంచుకోవాలనే తపనే కథానిక ప్రక్రియ చేపట్టడానికి ముఖ్యకారణం. నిత్య జీవితంలో ఎదురయే ఒక వింత సంఘటనో, ఓ అందమైన ఆలోచనో, ఒక ముఖ్యమైన సమస్యో, ఓ మరువలేని అనుభవమో ఎదుటి వారికి చెప్పాలనే ఆసక్తి ప్రతి మనిషికీ ఉండడం సహజం. ఆ కథన కుతూహలమే నన్ను కథానికలు రాయడానికి పురికొల్పింది. అంతేకాదు తెలుగు సాహిత్యంలో ఎన్నో ప్రక్రియలున్నా కథానికకు ఓ ప్రత్యేకత ఉంది. తెలుగు సాహిత్యానికి అంతర్జాతీయ కీర్తిగుర్తింపు తెచ్చింది తెలుగు కథానికే!

డా॥ రాంబాబు : **ఈ యాభై సంవత్సరాల కాలంలో మీరు రాయడంతో బాటు ఎన్నో కథలు చదువుతూ ఉండి ఉంటారు... సమకాలీన కథల మీద మీ అభిప్రాయం ఏమిటి?**

అవధాని : ఇతివృత్త స్వీకరణలోను, కథానిర్వహణలోను, శిల్పంలోను, ఎంతో ప్రగతిని సాధించారు తెలుగు కథారచయితలు. నిత్యం చూసే

సంఘటనలు, పొందే అనుభూతులు, జరిగే వింతలు, సామాజిక సమస్యలు, పరిణామాలు, ప్రకృతి దృశ్యాలు, ఆర్థిక అసమానత్వాలు, రాజకీయపుటెత్తులు, రాగద్వేషాలు, గ్రామీణ జీవితాలు, అపరాధ పరిశోధనలు, హాస్యరస ఘట్టాలు ఇలా ఎన్నో విషయాలు కథా వస్తువుగా స్వీకరించి కథలు రాస్తున్నారు నాటి నుండీ నేటి వరకూ. వస్తువైవిధ్యాన్ని దృష్టిలో ఉంచుకొని విశ్లేషణ చేస్తే కథలు ఆశిస్తున్న ప్రయోజనాలు సాధించేయి అని చెప్పవచ్చు.

తెలుగు కథలు సామాజిక, వాస్తవికతను ప్రతిబింబిస్తూ వ్యవస్థలోని లోపాలను నిశితంగా బహిర్గతం చేస్తున్నాయి. మానవ సంబంధాలలో వస్తున్న మార్పుల్ని చిత్రిస్తూ ఆయా మార్పులకు కారణాలైన సామాజిక స్థితిగతుల్ని ఆవిష్కరిస్తున్నాయి. స్త్రీ పురుష సంబంధాలలో పురుషాధిక్యతను సామాజిక పాక్షికతను వేలెత్తి చూపుతున్నాయి.

మానవత్వ విలువలు మరువకూడదని మనిషి,మనిషిగా ప్రేమించి గౌరవించాలని సహజీవనం సానుభూతి మానవ సహజపురోగతికి మూలమని చాటి చెప్తున్నాయి. కథాకథన శిల్పంలో ఎంతో మార్పు, ప్రగతి కనిపించినా శైలికి ఏమాత్రం ప్రాముఖ్యం ఇవ్వటం లేదు. శైలి విషయాన్ని అలక్ష్యం చేస్తున్నారు.

**డా॥ రాంబాబు : తెలుగు కథానికి ప్రయోజనం ఏమిటంటారు?**

అవధాని : సమకాలీన జీవన విధానం కథలలో ప్రతిబింబించాలి. రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు సమాజంలో సగటు మనిషి ఆవేదన, సమస్యలు, సామాజిక ధోరణులు ప్రవృత్తులు, రుగ్మతలు, వాటిని ఎదుర్కొనే మార్గాలు, చిత్రీకరించి ప్రజల దృష్టికి తీసుకురావడం, వారిని చైతన్యవంతులుగా చెయ్యడం కథల ప్రయోజనం. అంతేకాదు శాశ్వత విలువలైన మానవతా విలువల్ని మారుతున్న తరాలకు నిరాటంకంగా కథలద్వారా చెప్పుకుంటూపోతుండాలి.

**డా॥ రాంబాబు : మీ దృష్టిలో మంచి కథ లక్షణాల్ని చెప్తారా?**

అవధాని : అసలు మంచి కథ అంటే ఏమిటి? అంటే మంచి కథకు నిర్వచనం ఒక్కమాటలో చెప్పడం కష్టం. సహజత్వమంత కల్పనతోనో, కళ్లముందు జరుగుతున్నంత నిజంగా ఒక సంఘటను చిత్రీకరించి చదువుతున్నంతసేపూ పాఠకుడిని కథ వెంటనడిపించుకుపోతూ మధ్యలో సింహావలోకనం చేయించేది. చదివిన తరువాత కథలోని దృశ్యాలు పాఠకుడి కళ్లముందు కదలాడుతుండేది. సాహిత్య సామాజిక ప్రయోజనం కలిగి ఉండేది మంచి కథ అనొచ్చు. చక్కటి ఇతివృత్తం. వాస్తవికత, రచనా శిల్పం-శైలి తెలుగుదనం, సన్నివేశ పరమైన సున్నితమైన హాస్యం ఎత్తుగడ, మంచి కొసమెరుపు, చక్కటి ముగింపు, శీర్షికాశిల్పం ఇవి మంచి కథా లక్షణాలు.

"భయానకం సుఖపరం గర్భేచ కరుణోరసః

అద్భుతాంతే సుకప్తార్థాః సోదాత్తా కథానికా"

కథానికకు బాహ్యలక్షణాలు రెండు.

కథానిక పొందికగా ఉండాలి.

పెద్ద సమాసాలతోనూ, వర్ణనలతోనూ కథా శరీరం బిగిసిపోకూడదు.

కథానికకు అభ్యంతర లక్షణాలు మూడు..

కథలో పాఠకులను భయసంభ్రమ, ఆశ్చర్యాల్లో ముంచెత్తే విచిత్ర సంఘటనలుండాలి.

కథా గర్భంలో హృదయం కరిగించే కరుణ సన్నివేశం ఉండాలి. పాఠకుడు ఊహించని కొత్త మలుపు-కొసమెరుపుతో కథ ముగిసిపోవాలి.

సోమదేవసూరి కథా సరిత్సాగరంలో కథానికకు 18 లక్షణాలు సూచించేడు అవి -

రమ్యం, హృద్యం, హారణి, చిత్రం, ఉదారం, విచితార్థం, హార్దము, అపూర్వం, నూతనం, స్వల్పం, దివ్యం, వినోదిని, శిక్షావతి, బుద్ధి వివాద సంపన్నారుచిరం, అబ్దత, విచిత్ర రుచిరా, బద్ధవిషయం - అని.

**డా॥ రాంబాబు : తెలుగు కథానికలలో హాస్య కథలు తక్కువైపోతున్నాయి ఎందుకండి?**

అవధాని : కథలో సున్నితమైన హాస్యం సన్నివేశపరంగా ప్రదర్శించాలి. అందుకోసం రచయిత తనచుట్టూ తిరిగే మనుష్యులను, వారిప్రవర్తనలను, సంఘటనలను, కొంత లోతుగా పరిశీలించి ఏకోణంలోంచి హాస్యం పడుతుందో, ఏ శైలిదానికి నప్పుతుందో, ఏ భాష ఏమాండలికం ఆ పాత్రకు ఎఫెక్టివ్‌గా ఉంటుందో ఎంపిక చేసుకుని రాయాలి. అంటే కళ్లకి కాటుక నుదుట తిలకం, వంటకంలో ఉప్పు వంటిది హాస్యం. ఓ పిసరు ఎక్కువ అవకూడదు. ఓ పిసరు తక్కువ అవకూడదన్న మాట! అంతే కాకుండా పాఠకులు హాస్యాన్ని డైరెక్ట్‌గా స్వీకరించలేరు కనుక రచయిత హాస్యాన్ని రొమేన్స్ తోనో, సస్పెన్స్‌తోనే సన్నివేశపరంగా జతపర్చాలి. అంత శ్రమతో కూడుకున్నది హాస్యం. అందువల్లే రచయితలు హాస్యం జోలికి పోవటం లేదు అనుకుంటున్నాను.

**డా॥ రాంబాబు : బాలసాహిత్యంలో కూడా మీకు అనుభవముంది కాబట్టి పెద్దలకు రాసే కథలకు, పిల్లలకు చెప్పే కథలకు ముఖ్యంగా ఉండాల్సిన తేడా లేమిటండి?**

అవధాని : పిల్లల కథలు వారి మనోవికాసానికి తోడ్పడాలి. బాలసాహిత్యానికి లక్షణాలు మూడు-క్లుప్తత, ఆప్తత, గుప్తత.

క్లుప్తత : కథ సాధ్యమైనంత చిన్నదిగా ఉండాలి. అలా ఉంటేనే వారు దానిని గుర్తుంచుకుంటారు.

ఆప్తత : ఏవయస్సు వారికోసం కథ రాస్తున్నామో వారికి సులభంగా అర్థమయ్యే మాటలలో రాయాలి. భాష, శైలిలలో ప్రత్యేక శ్రద్ధ చూపాలి.

గుప్తత : చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా చెప్పాలి. అది పిల్లల మనస్సులో భద్రపర్చుకునే విధంగా ఉండాలి. నీతి, నిజాయితి, సత్యం, ధర్మం, దయ, స్నేహం, ఐకమత్యం, త్యాగం, దైవభక్తి, దేశభక్తి ధైర్యసాహసాలు, వైద్య విజ్ఞాన విషయాలను కథలలో

పొందుపర్చాలి. ఈర్ష్య, పగ, ద్వేషం, విరోధం, వంటివి మంచివి కాదని ప్రబోధించాలి.

**డా॥ రాంబాబు : మీరు 300కి పైగా కథలు రాశారు! నవలలు కూడా రాశారా?**

అవధాని : రెండు నవలలు, ఒక పిల్లల నవల రాశాను.

**డా॥ రాంబాబు : నాటికా రచనలోనూ మీకు ప్రవేశముందాండి?**

అవధాని : ఉందండి! పూర్వాపరాలు, వాగ్దానం, పెళ్లిపిచ్చి వంటి నాటికలు రాసి అందులో ముఖ్యపాత్రలూ పోషించేను.

**డా॥ రాంబాబు : ఇంకా ఏయే సాహిత్య ప్రక్రియల్లో మీరు కృషి చేసారు?**

అవధాని : తెలుగు సాహిత్య ప్రక్రియలన్నిటిలోనూ కృషి చేసేను. సుమారు 60 సాహిత్యవ్యాసాలు, 50 కవితలు, బాల సాహిత్యంలో 40 కథలు, పాటలు ప్రచురితమయ్యాయి. హిందీ, ఇంగ్లీషు భాషలలో కూడ కథలు రాసేను. "ఫేకర్" ఆంగ్లాంధ్ర హిందీ త్రిభాషలలో వెలువడుతున్న పత్రికకు సుమారు పది సంవత్సరాలు సంపాదకుడిగా సాహిత్య సేవ చేసేను.

ఎలక్ట్రానిక్ మాధ్యమాలైన ఆకాశవాణి, దూరదర్శినిలలో కూడా సాహిత్య ప్రసంగాలు చేసేను.

**డా॥ రాంబాబు : ఇన్ని ప్రక్రియలలో మీకు మంచి అనుభవమున్నా కథానిక మీద ప్రత్యేక అభిమాన ముందంటున్నారు. ఎందుకండి?**

అవధాని : నవల, నాటకం, కవిత, కావ్యం మొదలైన సాహితీ ప్రక్రియలేవీ ప్రవేశింప వీలులేని మారుమూల చీకటి కోణాలను సైతం స్పృశించి సమకాలీన సామాన్య జనజీవిత సమస్యలను కథలలో ప్రతిబింబింపచేసి ప్రజలను చైతన్యవంతులుగా చేయవచ్చు అని నా అభిప్రాయం! కథనకు కుతూహలం - శ్రవణానందం రెండూ మనిషికి సహజం.

***(హైదరాబాద్ దూరదర్శన్ సౌజన్యంతో)***



మద్రాసు తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం అందిస్తున్న
కర్ణాటక గవర్నర్ శ్రీమతి వి.ఎస్. రమాదేవిగారు



విజయ భావన-విజయనగరం వారి సన్మానం




బుచ్చిబాబు స్మారక కథా కదంబం అవార్డు ప్రదానం



చైతన్య భారతి-గజపతి నగరం - సన్మానం



విజయనగరం ఎస్.పి. గారిచే పౌర సన్మానం




మిక్కిలినేని రాధాకృష్ణ గారితో...




శ్రీశ్రీ కవితా విశ్వరూపం సభలో ప్రసంగిస్తున్న శ్రీ రావి-ఎన్-అవధాని



బొమ్మ లాంతరు కథల సంపుటి ఆవిష్కరణ



శ్రీ రావి-ఎన్-అవధానిగారి సాహిత్య సేవకు
అభినందన చందనం

# బుచ్చిబాబు స్మారక కథా అవార్డు

మరో రచయిత ఇంకో సీనియర్ రచయితను గౌరవించటమే.

1994లో శ్రీ అరిగే రామారావు కథల్ని 'బుచ్చిబాబు స్మారక కథా అవార్డు' ఒకటిగా ప్రచు[illegible]ంచటం జరిగింది. 1995లో శ్రీ భమిడి పాటి జగన్నాథ రావు గారి కథల్ని, 1996లో శ్రీ డి. వెంకట్రామయ్య కథల్ని, 1997లో వీరాజీ కథల్నీ, 1998లో శ్రీమతి బుచ్చిబాబు శివరాజు సుబ్బలక్ష్మిగారి కథల్ని, 1999లో రావి-ఎన్-అవధాని కథల్నీ 'బుచ్చిబాబు స్మారక కథా అవార్డులు' గా పుస్తక రూపంలో ప్రచురించడం జరిగింది. 20000 సంవత్సరానికి గాను ఈ అవార్డు కింద డా॥ నాయని కృష్ణకుమారి గారి సమగ్ర కథల్ని కథా సంపుటిగా తీసుకు వస్తున్నారు.




...న్యాయం చేస్తున్న రచయిత వీరాజీ. ప్రముఖ కథారచయిత బుచ్చిబాబు గారి భార్య అయివుండి, ఆయనకి భిన్నంగా, అనవసరమైన వర్ణనలు లేకుండా సూటిగా కథల్ని చెప్పడంలో దిట్ట శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి. ఇవి మనిషి

వార్త

## రచయిత అవధానికి కథా కదంబం అవార్డు

భీమునిపట్నం, మే 17 (ప్రభాతవార్త): దివంగత రచయిత బుచ్చిబాబు పేరుతో ఏర్పాటు చేసిన స్మారక కథా కదంబం అవార్డును ఈ సంవత్సరం ఉత్తరాంధ్రకు చెందిన ప్రముఖ కథా రచయిత రావి నర్సింహావధానికి లభించింది. ఈ విషయాన్ని సంస్థకు చెందిన వేదగిరి రాంబాబు తెలియజేశారు. ప్రతి సంవత్సరం బుచ్చిబాబు పేరు మీద ఒక్కొక్క రచయిత సంకలనాలను ప్రచురించి నగదుతో సత్కరిస్తారు. ఇంతవరకు ప్రముఖ రచయితలు అరేగె రామారావు, బమ్మిడిపాటి జగన్నాథరావు, వీరాజీ, బి.వెంకటరామయ్య, శివరాజు సుబ్బలక్ష్మి తదితరులకు లభించగా ఈ సంవత్సరం అవధానికి అందిస్తున్నామని తెలిపారు. 1951 నుంచి కథలు రాస్తున్న [illegible]


రావి నర్సింహావధాని

## రావి ఎన.అవధానికి బుచ్చిబాబు స్మారక అవార్డు-2000

విశాఖపట్నం, మే 6 (ప్రభాతవార్త-కల్చరల్): ప్రముఖ రచయిత బుచ్చిబాబు పేరిట [illegible] 'బుచ్చిబాబు స్మారక కథా కదంబం' అవార్డు కథారచయిత రావి ఎన్. అవధానికి లభించిందని [illegible] కమ్యూనికేషన్స్ నుంచి వేదగిరి రాంబాబు ఒక ప్రకటనలో తెలిపారు. ప్ర[illegible] ఏటా ఒక ప్రముఖ రచయిత కథా సంపుటాన్ని ప్రచురించి, దానినే అవార్డుగా సత్కరించడం జరుగుతుందని, 2000 సంవత్సరానికి రావి ఎన్. అవధానిని ఎంపిక చెయ్యడం జరిగింది. [illegible] జూన్ 14న పురస్కారప్రదానం జరుగుతుందని ఆయన తెలిపారు.

# ఉత్తమ కథల కదంబం

## చక్కని తెలుగుదనంతో విరబూసిన వినూత్న శైలీశిల్పాలు




రావి. ఎన్. అవధాని కథలు
ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, నవోదయ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, నవయుగ బుక్ హౌస్, కోటి, హైదరాబాద్; బుక్‌లింక్స్;
వెల: రూ. 45/-

టి. రఘుకుమార్

తెలుగు సాహిత్యంలో కథా ప్రక్రియను సునంపన్నం చేసిన ప్రముఖులలో కీర్తి శేషులు బుచ్చిబాబు ఒకరు. ఆయన కథలు ఇప్పటి వరకు ఏడు సంపుటాలుగా వచ్చాయి. బుచ్చిబాబు స్మారకార్థం 1994 నుంచి ప్రతి ఏడాది జూన్ 14న ఆయన పుట్టిన రోజున ఓ ప్రముఖ రచయితకు అవార్డు ఇవ్వడం జరుగుతోంది. ఈ కార్యక్రమ భాగంగా రచయిత వేదగిరి రాంబాబు మరో రచయిత బుచ్చిబాబు పేరిట సమగ్ర కథా సంపుటాని ప్రచురించి,

డిప్యూటీ కలెక్టర్ వాసుదేవరావు క... స్కూల్ టీచర్ ముకుందరావు క... మంచి (ఫ్రెండ్స్). బి.ఇడి ... ఉద్యోగంలో చేరుతుంది ... అసిస్టెంట్ సర్జన్‌గా ... తుంది. కాగా, రా... రావు శారదన... కాదని రిజి... పెళ్ళికి అ... ట్టుండి ఒ... మరణిస... ఆదిత్య... వరం... త్రి...

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

24 జూన 2001

# అసాధారణ ఇతివృత్తాల కథా సంపుటి




రావి ఎన్. అవధాని
కథలు
(ప్రచురణ: విశాలాంధ్ర; నవోదయ; నవయుగ; బుక్‌లింక్స్, హైదరాబాదు. పేజీలు: 185. వెల: 50.00)

కథారచయితల్లో చాలామంది ఒకప్పుడు ఒక వెలుగు వెలిగి



# 'Bommalantaru' re[leased]

## నేడు అవధాని షష్టిపూర్తి ఉత్సవం



(కల్చరల్ కంట్రిబ్యూటర్)

విజయనగరం, సెప్టెంబరు 25. (న్యూస్‌టుడే): సుమారు నాలుగు దశా... సాహిత్య ... కృషి

(ఆంధ్రప్రభ కల్చరల్ కంట్రిబ్యూటర్)

విజయనగరం, సెప్టెంబర్ 27: అవధా...

"గుండెను సూటిగా తాకి ఆలోచింపజేయుత ...ది ఉత్తమ కథ. కథలు రాయడంతో ... పాటించవలసిన ప్రమాణాలను మనం పాశ్చాత్యుల నుండి అలవర్చుకున్నాం" అన్నారు రాజమండ్రికి చెందిన సుప్రసిద్ధ కథా రచయిత శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు. శ్రీ రావి.ఎస్. అవధాని బొమ్మలాంతరు కథా సంపుటిని ఆయన మంగళవారంనాడు ఆవిష్కరించారు. సాహితీ మిత్ర సమాఖ్య విజయ భావన ఈ కార్యక్రమాన్ని నిర్వహించింది.

...వదాని ... మంగళవారం జరు... 58వ సాహిత్య సభ ... కార్యక్రమంలో ... రు. కథల సంపుటి ... తుల మల్లికార్జున ... చిత్రగుప్త ... షష్టి ... పుగుపెట్టి వివిధ ... కథలు, వ్యాస ... మ తదితర ... యడం విశేషం. శ్రీర ... రిటబుల ... కార్యద...



A view of the release function of "Bommalantaru" held in Vizianagaram recently.

# అవధాని కథలు సామాజిక సమస్యలకు సాధనాలు

(కల్చరల్ కంట్రిబ్యూటర్)

విజయనగరం, సెప్టెంబరు 28 (న్యూస్‌టుడే): రావి అవధాని కథలు సామాజిక మానసిక, ఆధ్యాత్మిక అవసరాలకు, సమస్యలకు సాధనాలని, భారతీయ సంస్కృతి చిహ్నాలని ప్రముఖ రచయిత కప్పగంతుల మల్లికార్జునరావు (రాజమండ్రి) అన్నారు. మంగళవారం సాయంత్రం గురజాడ స్మారక జిల్లా గ్రంథాలయంలో విజయ భావన 158వ సాహిత్య సభ సందర్భంగా జరిగిన గ్రంథావిష్కరణోత్సవంలో రావి-ఎస్ అవధాని రచించిన 'బొమ్మలాంతరు' కథల...

...మండ్ర వెంకటసూర్యనారాయణ వేదాశ్శీరచనం అందించారు. నృత్య దర్శకులు సి.రామ్మూర్తి రచయితను పూలమాలతో అలంకరించారు. తనకు జరిగిన సత్కారానికి రచయిత కృతజ్ఞతలు తెలిపారు. సాహితీ ప్రియులు పంపిన సందేశాల్ని మార్కండేయులు సభకు సమర్పించారు. డాక్టర్ ఎ.గోపాలరావు స్వాగతం పలికి అతిథుల్ని పరిచయం చేశారు. ఆచార్య భావన్ ప్రార్థనతో ఆరంభమైన ఈ సభ డాక్టర్ పి.వి.ఎన్.సుబ్బారావు వందన సమర్పణతో ముగిసింది.

# మన కథకులు




## 26న 'బొమ్మలాంతరు' ఆవిష్కరణోత్సవం

(కల్చరల్ కంట్రిబ్యూటర్)

విజయనగరం, సెప్టెంబరు 20 (న్యూస్‌టుడే): స్థానిక గురజాడ స్మారక జిల్లా గ్రంధాలయంలో 26న విజయభావన 158వ సాహిత్య సభ సందర్భంగా గ్రంధావిష్కరణ మహెత్సవం జరుగుతుందని సంస్థ ప్రధాన కార్యదర్శి డాక్టర్ ఎ.గోపాలరావు తెలిపారు. ఫేకర్ రామెటీరియల్స్ రిటైర్డు మేనేజర్ రావి-ఎన్-అవధాని రచించిన 'బొమ్మలాంతరు' (కధల సంపుటి)ను రాజమండ్రి చరిత్ర అధ్యాపకులు, ప్రముఖ రచయిత కప్పగంతుల మల్లికార్జునరావు ఆవిష్కరిస్తారు. సభకు ప్రముఖ కధా రచయిత ముద్దంశెట్టి హనుమంతరావు అధ్యక్షత వహిస్తారు. ముఖ్యఅతిధిగా, సన్మాన కర్తగా ప్రజాసేవకులు ఐ.వి.రమణరాజు పాల్గొంటారు. గ్రంధ సమీక్షకులుగా రచయిత, తెలుగు పండిట్ వి.వి.బి.శ్రీరామమూర్తి (పార్వతీపురం) వ్యవహరిస్తారు. మహారాజ సంస్కృత కళాశాల అధ్యక్షులు, రుగ్వేదచార్య యనమండ్ర వెంకటసూర్యనారాయణ అవధాని వేదాశీర్వచనం అందజేస్తారు.

తొలితరం కథకులను వదిలేస్తే 1950వ దశకంలోనే మాండలికభాషలో కథలు రాసిన రచయితలలో రావి-ఎన్.అవధాని పేరుతో కథలు రాసే నరసింహఅవధాని ఒకరు. జన్మించింది విజయనగరంలో. తండ్రి రావి వెంకట్రామయ్య అవధానులు (తల్లి సూర్యకాంతమ్మ) వేదపండితులు. అయినా, ఆ వాసనలు కొడుక్కి అబ్బినట్లు లేవు. బి.కామ్. చదివి, ఫెర్రో ఎల్లాయిస్ కార్పొరేషన్ లిమిటెడ్‌లో కొలువుకు చేరేరు. మెటీరియల్ మేనేజర్‌గా రిటైరై స్వస్థలానికి చేరుకున్నారు.

# కాలక్షేపం కథలు

రావి. ఎన్. అవధాని కథలు, రచయిత: రావి. ఎన్. అవధాని, పేజీలు: 185, వెల: 50 రూపాయలు. ప్రతులకు: విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు, నవోదయ, కాచిగూడ, హైదరాబాద్, బుక్‌లింక్స్, నారాయణగూడ, హైదరాబాద్.

# Story book released

A BOOK of short-stories, *Bommalantharu*, written by Ravi N Awadhani of Vizianagaram, was released by Kapaganthula Mallikharjuna Rao of Rajahmundry, at the 158th literary meeting of the Vijaya Bhawana in the Gurazada Memorial District Central Library in the town on Sept 26.

Releasing the book, Mallikharjuna Rao, himself a writer, said that he found the 23 stories in it appealing to him. He dwelt on the subject, style and narration of the storyteller.

The writer named stories such as *Simhachalammahima*, *Palukurallu*, *Praajni*, and *Aantharyamu*, stating that they touched the heart before stimulating the mind.

It was interesting to find a large number of storytellers among the participants. Mudamsetty Hanumantha Rao from Visakhapatnam, who presided, said.

PVB Rama Rao from Parvatipuram, reviewing the book, said that he liked the surprise ending to every story.

SUNDAY OCTOBER 1 1995

# రావి-ఎన్-అవధానికి ఉగాది పురస్కారం

విజయనగరం కల్చరల్, జనవరి 6 (ప్రభాతవార్త): ప్రముఖ రచయిత రావి-ఎన్-అవధానికి సాహితీ తెలుగు అకాడమి వారి 2000 సంవత్సరం ఉగాది పురస్కారాన్ని ప్రకటించారు. ఈ పురస్కారాన్ని ఏప్రిల్ 2వ తేది ... అందజేయనున్నట్లు సంస్థ కార్యదర్శి ... తెలిపారు. రావి-ఎన్-అవధాని 1951 నుంచి సాహిత్య సేవ చేస్తున్నారు.

ఆంధ్రజ్యోతి

# అవధానికి తెలుగు అకాడమీ పురస్కారం

విజయనగరం(కల్చరల్), జనవరి 6 (స్పాట్‌న్యూస్): విజయనగరానికి చెందిన ప్రముఖ రచయిత రావి. ఎస్. అవధానికి ప్రతిష్ఠాత్మకమైన మద్రాసు తెలుగు అకాడమీ ఉగాది పురస్కారాన్ని ప్రకటించింది. రెండు వేల సంవత్సరానికి ఆల్‌రౌండర్‌గా గుర్తించి ఈ పురస్కారానికి అవధానిని ఎంపిక చేసినట్టు అకాడమీ చీఫ్ కన్వీనర్ టి.వి.కె.శాస్త్రి తెలియజేశారని విజయభావన ఉపాధ్యక్షుడు బులుసు.జి. ప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. హైదరాబాద్ వేదగిరి కమ్యూనికేషన్స్ 'రావి.ఎస్.అవధాని కథలు' శీర్షికన అవధాని సమగ్ర కథాసంపుటిని డాక్టర్ వేదగిరి రాంబాబు త్వరలో వెలువరిస్తారని ప్రకాష్ తెలిపారు. 1951లో చిత్రగుప్త పత్రిక ద్వారా రచయితగా అవధాని పరిచయం అయ్యారు. అప్పటినుంచి నేటి వరకు అనేక పత్రికలలో ...

1995 సెప్టెంబర్ లో 'విజయభావన' ఆవిష్కరించింది. ఉగాది పురస్కారాన్ని ఈ ఏడాది ఏప్రిల్ రెండవ తేదీన అందజేస్తారని ప్రకాష్ తెలిపారు.

జాతీయ దినపత్రిక
వార్త

# రావి అవధానికి ఉగాది పురస్కారం

(ఆంధ్రప్రభ విలేఖరి)

విజయనగరం, జనవరి 5: ప్రముఖ రచయిత రావి ఎస్.అవధానిని ఆల్‌రౌండర్‌గా ...

ఆంధ్రభూమి

# రావి-ఎస్-అవధానికి తెలుగు అకాడమి పురస్కారం

కల్చరల్ కంట్రిబ్యూటర్

విజయనగరం, జనవరి 5: పట్టణానికి చెందిన ప్రముఖ రచయిత రావి-ఎస్-అవధాని మద్రాసు తెలుగు అకాడమి ఉగాది పురస్కారానికి ఎంపికయ్యారు. ఈ పురస్కారాన్ని ఏప్రిల్ 2వ తేదీన ప్రదానం చేయనున్నారు ...



... దని వెలువరిస్తున్నారు. గరివిడి ఫేకర్‌లో మేనేజర్‌గా పనిచేసి రిటైర్ అయిన అవధానికి ప్రతిష్ఠాత్మకమైన మద్రాసు తెలుగు అకాడమి ఉగాది పురస్కారం లభించడం పట్ల విజయభావన సాహితీ మిత్ర సమాఖ్య ఒక ...

# సామాజిక సమస్యల దర్పణం 'బొమ్మ లాంతరు' కధాగమనం

విజయనగరం, అక్టోబరు 4(సిటీన్యూస్): సామాజిక, మానసిక, ఆధ్యాత్మిక, భౌతిక అంశాలను తన కథల్లో ప్రతిబింబించే 'రావి ఎన్ అవధాని' కథలకు ఒక ప్రత్యేక స్థానం ఉందని ప్రముఖ కథకుడు శ్రీ కప్పగంతుల మల్లిఖార్జునరావు ప్రస్తుతించారు.

స్థానిక జిల్లా కేంద్ర గ్రంథాలయంలో 'బొమ్మలాంతర్లు' కథా సంపుటిని ఆవిష్కరణ సభ జరిగింది. విజయభావన (సాహితీమిత్ర సమాఖ్య) ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమంలో శ్రీ మల్లిఖార్జున రావు ప్రసంగిస్తూ కుటుంబ వ్యవస్థ, ధార్మిక చింతన అనే భారతీయ సంస్కృతి చిహ్నాలు అవధాని కథల్లో గోచరిస్తాయని చెప్పారు.




'బొమ్మలాంతర్లు' కథా సంపుటి ఆవిష్కరణ సభలో రచయిత రావి ఎన్.అవధాని, శ్రీ కప్పగంతుల మల్లిఖార్జునరావు, శ్రీ ముద్దంశెట్టి తదితరులు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు (విశాఖ) మాట్లాడుతూ అవధాని షష్టి పూర్తి సందర్భంగా 'బొమ్మలాంతర్లు' ఆవిష్కరణ నిర్వహించడం చాలా హర్షణీయమని 'విజయభావన'కు అభినందనలు తెలిపారు.

ప్రముఖ రచయిత శ్రీ పి.వి.బి.మూర్తి (పార్వతీపురం), ప్రముఖ ప్రజాసేవకుడు శ్రీ పి.వి.రమణ (కాసులురాజు, ఎస్.కోట), ప్రభుత్వ మహారాజా సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ ఋగ్వేద ఆచార్య శ్రీ మనమంద్ర వెంకట సూర్యనారాయణ, ప్రముఖ నృత్య దర్శకులు శ్రీ సి.రామ్మూర్తి ప్రభృతులు ప్రసంగించగా గ్రంధ రచయిత శ్రీ రావి ఎన్. అవధాని తనకు జరిగిన సత్కారానికి కృతజ్ఞతలు తెలిపారు.

